*Issued on 10—7—1956*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## TUESDAY, 26TH JULY, 1955.

### VOLUME V — No. 2.

## CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1956

Price 5 annas.

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

Tuesday, 26th July 1955.

---

The House met in the Assembly Hall, Kurnool at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### Starred Questions.

*Cases of Gazetted Officers disposed of by Special Tribunal.*

134—

* 66 *Q*.—SRI S. VEMAYYA : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the number of cases disposed of by Special Tribunal regarding the gazetted officers who are charged with dishonest and illegal gratifications in the State for the year ending 1954 ;

(b) the number of cases pending with them for the year 1954 ; and

(c) the nature of punishment awarded as against clause (a) ?

THE HON. SRI B. GOPALA REDDI :

(a) Four.

(b) 6 cases out of 10 received.

(c) Out of the four cases disposed of by the Tribunal, final orders have been passed by the Government in one case acquitting the officer and the other cases are under examination.

SRI S. VEMAYYA :—ఇందులో నెల్లూరుజిల్లా కలెక్టరు జోగప్పమీద, కేసులు ఉన్నాయని తెలుసా ?

THE HON. SRI B. GOPALA REDDI :—నా కేమీ information లేదు. ఏమైనప్పటికి 1-10-53 లోపల జరిగినవి, ఆంధ్రరాష్ట్రములో జరిగినా,

వాటిపై మద్రాసు గవర్నమెంటువారినే orders చేయమని చెప్పాము. కనుక Madrasలోని Tribunal వాటిమీద orders చేస్తుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU :— 1-10-53 లోపునే కొన్ని కేసులు dispose of అయినవి. అవి ఆంధ్రరాష్ట్రానికి సంబంధించినవి. appeals కు పోవాలన్న ఎవరిదగ్గరకు వెళ్ళాలి? మదరాసు గవర్నమెంటుదగ్గరకు వెళ్లాలా ? ఆంధ్ర గవర్నమెంటు దగ్గరకు వెళ్ళాలా ?

THE HON SRI B. GOAPLA REDDI :—ఆంధ్రకు సంబంధించినప్పటికి, Madras వాళ్ళు orders pass చేయవలసి ఉంటుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన కేసులలో మదరాసువారు appeals ను dispose of చేసే కంటె ఆ హక్కు ఆంధ్ర ప్రభుత్వానికి ఎందుకు ఉండకూడదు ?

THE HON. SRI GOPALA REDDI :—హక్కు వారికే ఉండాలి. అదే legal position. అదే 1-10-53 లోపున జరిగిన వాటిమీద Madras Government యొక్క orders కావాలని నిర్ణయముచేసినాము. అందువల్ల అలాచేస్తున్నాము.

SRI P. SUNDARAYYA :—ఈ special tribunal 4 కేసులుమీద orders పూర్తిచేసినదన్నారు. ఏమి action recommemd చేసినది ?

THE HON. SRI B. GOPALA REDDI :—Appeal చేసినదానిలో special recommendation కూడా acquit చేయవలెననే ఉంది. అయితే విచారణజరిగిన తరువాత, orders pass అయినతర్వాత చెప్పితే బాగుంటుంది.

**Though not exactly *sub-judice*, it is skill being considered. The Tribunal's findings are with the Government and the Government are considering them.**

Sri P. SUNDARAYYA :—Tribunal యొక్క findings Government దగ్గరకువచ్చి ఎన్ని నెలలయినది ?

THE HON. Sri B. GOPALA REDDI :—I want notice, Sir,

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—ఆంధ్ర రాష్ట్రము రాకపూర్వము records అక్కడ ఉండవచ్చు. కాని ఆ వ్యవహారము అంతా ఇక్కడకువచ్చిన తరువాత మళ్ళీ కేసులు అక్కడకు . పోయినప్పుడు ఆ ప్రభుత్వం punishment వేస్తే ఇక్కడివారు దానిని implement చేయకపోతే, ఈ controversy ఎలా తేలుస్తారు?

26th July 1955]

THE HON SRI B. GOPALA REDDI:—Madras Government వారుచేసిన orders ను ఈ Government వారు implement చేస్తారు. చేయకుండాపోవడము అనే hypothetical question ఎందుకు రావాలి ?

SRI P. SUNDARAYYA :—1-10-53 లోపు జరిగిన కేసులు ఎన్ని special tribunal ముందు ఉన్నవి ?

THE HON. SRI B. GOPALA REDDI :—నాలుగో, అయిదో, నాకు తెలియదు, వాళ్ళకు refer చేశాము. 1—10—1953 వ తేదికి లోపల వచ్చిన కేసులు వాళ్లకు refer చేసి వాళ్ళే dispose of చేసి orders పంపించమని అడిగాము.

SRI R. B. RAMAKRISHNA RAJU :—Appeal లో మదరాసు గవర్నమెంటువారు ఎవరైనా నిర్దోషి అని తీర్మానముచేస్తే, అతనిని పనిలోకి తీసుకుంటారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—తప్పకుండా తీసుకుంటాము.

SRI S. VEMAYYA :—1-10-53 నాటికి అటు ఆ గవర్నమెంటులోను ఇటు ఈ గవర్నమెంటులోనూ ఉద్యోగము లేకుండాఉండే వారిమీద కేసులు పెట్టిన యెడల వారిని మరల ఉద్యోగములోనికి తీసుకోడానికి ఒప్పుకుంటారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Legal position మీకు చెప్పాను. ఏమైనప్పటికీ, Madras Government వారు orders pass చేయాలి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Andhra State Act లో యీ విధముగా చెప్పబడలేదు. బహుశా President orders ద్వారా చెప్పబడినదనుకుంటున్నాను. Madras Government కు Andhra officers మీద అధికారము ఇస్తూ ఒక ఆర్డరుపంపినట్లు తెలుస్తున్నది. అందువల్ల కేంద్ర ప్రభుత్వానికి representation పంపించి ఆ orders ను మార్పించడానికి ప్రభుత్వం ప్రయత్నము చేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అది అవుసరం లేదనుకుంటాను. అయినా అక్కడ ఉన్న కేసులు చాలా కొద్దిగా ఉన్నవి. అవన్నీ వారు dispose చేస్తారు. తక్కినవిషయములలో మన గవర్నమెంటువారు orders pass చేస్తారు. కనుక దీనిలో President తో చెప్పవలసిన ప్రమాదం ఏమీలేదు.

SRI P. SUNDARAYYA :— 2 లక్షల 89 వేల మగ్గాలున్నాయన్నారు. అన్నీ పనిచేసేవేనా, లేక మూల పడినవా?

THE HON. SRI K. VENKATA RAO :— మగ్గములన్నీ పనిచేస్తూనే ఉంటవి.

SRI PRAGADA KOTAIAH :— అధ్యక్షా! ఉన్నంతవరకూ ఖద్దరు కొనేందుకు మిగతా అవసరములకు చేనేతబట్టను కొనేందుకు ప్రభుత్వము చర్య తీసుకొంటుందా?

THE HON. SRI K. VENKATA RAO :— ఇపుడే తీసుకుంటున్నది. ఇప్పుడు hospitals లో వాడేవన్నీ చేనేతగుడ్డలే.

SRI P. SUNADARAYYA :— సాధారణంగా మగ్గాలు పనిచేయవచ్చును. అసాధరణంగా ఇప్పుడు ఏమైనా మానివేశాయా ?

THE HON. SRI K. VENKATA RAO :— ఏదైనా వయస్సుమళ్లిన వారిదగ్గర మగ్గంవుంటే.........

SRI V. VISVESWARA RAO :— మంత్రిగారు సమాధానంచెబుతూ సూత్రాన్ని నీటివరకు తీసుకువెడుతాం గాని త్రాగేటట్లుచేయలేము అన్నారు. కాని చాలా weavers' societies ఈనాడు ఆర్థికసహాయం లేకపోవడంవల్ల పనిలేకుండా వున్నాయి. అటువంటి weavers మగ్గాలకు సహకారంచేసే అవకాశం కల్పిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :— చాలా స్కీములు వున్నాయి. రేపు Industries demand మీద వివరాలు చెబుతాను.

SRI P. VENKATASUBBAYYA :— ఉత్పత్తి పెరగడానికి power loomsను handloomsకు బదులుగా cessfund క్రింద co-operativ feildలో వున్నవారికి సప్లయిచేయడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :— వెంకటసుబ్బయ్యగారు ప్రగడకోటయ్యగారు రాజీపడితే దీన్నిగురించి ఆలోచిస్తాము.

SRI P. VENKATASUBBAYYA :— ప్రభుత్వంవారు power looms సప్లయిచేస్తే, వారు రాజీపడుతారు ప్రభుత్వంవారు assurance ఇస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :— ప్రభుత్వానికి పెట్టడం ఇష్టంలేదు.

26th July 1955]

*Functions of Harijan Welfare Committees.*

138—

* 749 *Q.*—SRI P. GOPALAKRISHNA REDDI : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state the functions of the Harijan Welfare Committees ?

THE HON. SRI G. LATCHANNA :—

The function of the District Harijan Welfare Committees is to advise the Collectors of the Districts in the matter of amelioration of the conditions of the communities eligible for help by the Harijan Welfare Department.

SRI S. VEMAYYA :—జిల్లా కమిటీలు కనీసం సంవత్సరానికి 1, 2 సార్లైనా కలుసుకొని ఆలోచించి సలహాలు ఇవ్వడానికి వున్నదా ?

THE HON. SRI G. LATCHANNA :—వున్నదనే మనవి చేశాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—కలెక్టరుగారికి ఇచ్చిన సలహాలు తప్పనిసరిగా పాటించేవిధానం ప్రభుత్వం యోచిస్తోందా ?

THE HON. SRI G. LATCHANA :—సలహా సంఘం అంటే Advisory Committee అన్నమాట. అమలుపరచే అవకాశం వున్నవాటిని తప్పనిసరిగా అమలుచేస్తారు.

SRI PILLALAMARRI VENKATESWARLU:—తప్పని సరిగా నిర్బంధంగా అమలుచేస్తారా ?

THE HON. Sri G. LATCHANNA:—Advisory Committee చెప్పినదంతా నిర్బంధం చేయడానికి లేదు.

Sri P. GUNNAYYA:—అధ్యక్షా! జిల్లా welfare సంఘాలు welfare కమిటీలు వేశారు. ఆ కమిటీలకువుండే అధికారం ఏమిటి ? ఆ మెంబరు చేయవలసిన పని ఏమిటి ?

THE HON. Sri G. LATCHANNA :—ఇంగ్లీషులో చదివినందువల్ల తెలియకపోవచ్చును. Welfare Committee అనేది Welfare Department వారు ఇచ్చేసహాయం గురించి జిల్లాకలెక్టరుకు సలహాలు ఇస్తుంది.

Sri S. K. V. KRISHNAVATARAM :—ఈ సలహా సంఘంలో అందరు శాసనసభ్యులకుకూడా సభ్యత్వం వుండేట్లా చేస్తారా ?

[26th July 1955]

THE HON Sri G. LATCHANNA:—హరిజన M.L.As. తప్పనిసరిగా వుంటారు. ఈ work లో పనిచేసే Harijan M. L. As. ఎవరైనావుంటే వారి విషయంకూడా ఆలోచిస్తారు.

Sri G. NAGESWARA RAO:—ఈ జిల్లా కమిటీలు ఒక జిల్లాలో ఎన్నిసార్లు meet అయినదో సెలవిస్తారా?

THE HON. Sri G. LATCHANNA:—వేరే ప్రశ్న వేయండి.

Sri B. SANKARAIAH:—ఈ సలహా కమిటీలు చెప్పిన సలహాలు నిరాకరిస్తే ఎందుకు నిరాకరించారో ప్రభుత్వానికి కలెక్టరు చెప్పేట్లు చేస్తారా?

THE HON. Sri G. LATCHANNA:—ఏదైనా సమస్య ప్రత్యేకంగా తీసుకువస్తే తప్పకుండా ఆలోచిస్తాము.

Sri L. LAKSHMANA DAS:—ఇందులో కొంతమంది కొండజాతుల వారిని చేర్చడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON. Sri G. LATCHANNA:—ఇదివరకువున్న విధానంలో ఆ proposal వున్నది. దానినిగురించి ఆలోచిస్తున్నాము.

Sri S. NARAYANAPPA:—ఇందులో backward classes కు చెందిన M. L. As. ను వేస్తారా?

THE HON. Sri G. LATCHANNA:—కొండజాతులనుగురించి పరిశీలిస్తాము.

Sri S. NARAYANAPPA:—Backward Classes కు చెందిన M. L. As. కూడా ఇందులో వేస్తారా అని నేను అడిగింది.

THE HON. Sri G. LATCHANNA:—హరిజనసమస్యలపట్ల శ్రద్ధకల వారిని ఏ కులంవారినైనా వేస్తారు.

Sri P. KODANDARAMAYYA:—Tribal Advisory Committee వేరేవుండగా Harijan Committee లో కూడా వేరే ప్రాతినిధ్యంవుండాలని ప్రభుత్వం తలుస్తోందా?

THE HON Sri G. LATCHANNA:—జిల్లా Welfare Committee లో tribal వారికి వేరే ప్రాతినిధ్యం ఇచ్చుట గురించి ఆలోచిస్తాము అని చెప్పాను. రాష్ట్రీయవ్యవహారాల విషయాలలో కొండజాతులకు వేరే ప్రాతినిధ్యం వుంటుంది.

Sri N.C. SESHADRI:—వీరిని ఎవరు appoint చేస్తారు?

THE HON. Sri G. LATCHANNA:—Appoint చేసేది గవర్నమెంటు. Director గారు రిపోర్టు పంపుతారు.

Sri P. VENKATASUBBAYYA :—ఇప్పటివున్న Welfare Committees meet కావడంలేదు. Period అయిపోయి ఆరు మాసాలు కావస్తోంది. వీటిని త్వరలో తిరిగి స్థాపించడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON Sri G. LATCHANNA :—Welfare Committees ఇప్పుడు లేవు. జిల్లాకలెక్టరును రిపోర్టు అడిగాము. తరువాత appoint చేస్తాము.

Sri S. JAGANNADHAM :—Harijan Welfare అనే పేరుతీసి Social Welfare అని పేరుపెట్టారు. అదేవిధంగా ఈ కమిటీలపేర్లు Harijan Welfare బదులు Social Welfare అని పెట్టరాదా?

THE HON. Sri G. LATCHANNA :—మొత్తం డిపార్టుమెంటు పేరు Social Welfare అనిపెట్టారు. ఈ కమిటీ ప్రత్యేకం హరిజనుల వ్యవహారం కోసం అవసరం కాబట్టి ఆవిధంగా పేరుపెట్టాం.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—హరిజనసేవ చేసే వాళ్లలో ఇతర కులాలవారినికూడా వేస్తాము అని అన్నారు. ఎట్లా నిర్ణయిస్తారు? ఎవరు నిర్ణయిస్తారు? ఏమైనా జరిగిందా?

THE HON. Sri. G. LATCHANNA :—జిల్లా కలెక్టర్లకు తెలియచేశాము. ప్రతితాలూకానుంచి కనీసం ఒక ప్రతినిధినైనా తెలియచేయాలని. ఒక స్త్రీకూడా వుండాలని ఈ పేర్లలో హరిజనసమస్యల పట్ల ఎక్కువ శ్రద్ధతీసుకొని చేసేవారిని హరిజనేతరులనుకూడా తెలియచేయవచ్చును.

Sri K. SUBBA RAO:—హరిజనుల, గిరిజనుల సంక్షేమ సంఘాలలో గిరిజనులు సభ్యులను చేర్చకుండా వుంటారా?

THE HON. Sri G. LATCHANNA:—వారితో సంబంధం లేనివారిని ఎవరిని చేర్చరు.

Sri RAJARAM :—రద్దుఅయినాయని చెప్పారు. ఇంతవరకు పనిచేయడంలేదు. ఎందుచేత?

THE HON. Sri LATCHANNA:—ఇదివరకు ప్రభుత్వంవారు appoint చేశారు. ఏప్రిలు 1954 తోవాటి కాలం పూర్తిఅయినది. తిరిగి appointment జరుగలేదు. ఇదివరకు ప్రభుత్వం నిర్మాణంచేయడానికి ప్రయత్నిస్తుండగా శాసనసభ రద్దయినది. ఇప్పటి ప్రభుత్వం proposalsకై జిల్లా కలెక్టర్లను కోరింది.

Sri P. SREERAMULU :—హరిజన శాసనసభ్యులందరిని నియమిస్తాం అన్నారు. హరిజనసేవకసంఘంవారికి ప్రాతినిధ్యం ఇస్తారా?

THE HON. Sri G. LATCHANNA :—హరిజనశాసనసభ్యులుమాత్రమే అని నేను అనలేదు. హరిజనసమస్యల పట్ల శ్రద్ధ తీసుకొన్నవారందరిని నియమిస్తాము. హరిజన సేవక సంఘంవారికికూడా ప్రాతినిధ్యం ఇస్తాం.

*Various grades of municipalities.*

139—

* 381 *Q.*—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(i) the number of Municipalities in Grade I ;

(ii) in Grade II ;

(iii) in Grade III ; and

(iv) in Grade IV in the State now ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

| | | |
|---|---|---|
| (i) | Selection Grade ... ... ... ... | 1 |
| (ii) | I Grade ... ... ... ... ... | 10 |
| (iii) | II Grade ... ... ... ... ... | 10 |
| (iv) | III Grade ... ... ... ... ... | 14 |
| (v) | IV Grade ... ... ... ... ... | Nil. |
| | | 35 |

| | | |
|---|---|---|
| ఒకటవ గ్రేడు | 10 | మునిసిపాలిటీలు |
| రెండవ ,, | 10 | ,, |
| మూడవ ,, | 14 | ,, |
| సెలక్షను ,, | 1 | ,, |
| నాలుగవ గ్రేడు | లేదు. | |

Sri S. VEMAYYA :—ఏ ప్రాతిపదికను పురస్కరించుకొని మునిసిపాలిటీలను పైగ్రేడులలోనికి ప్రమోటుచేస్తారో తెలుసుకోవచ్చునా ?

THE HON. Sri A. B. NAGESWARA RAO:—ఆదాయంబట్టి. మూడులక్షలకంటె తక్కువవుంటే మూడవగ్రేడు. ఆరులక్షలవరకువుంటే రెండవగ్రేడు. 6 లక్షలకుపైనవుంటే ఫస్టుగ్రేడు సెలక్షనుగ్రేడు అనేది composite Madras

State లో వుండగా ఏర్పాటు అయినది. ఎంత ఆదాయం అనేది ప్రభుత్వ ఆలోచనలో వున్నది.

SRI M. NAGI REDDI :—క్లాసు I పంచాయితీలలో పెద్దవాటిని మునిసిపాలిటీలుగా మార్చడానికి ప్రభుత్వం అవకాశం ఇస్తుందా ?

THE HON. Sri. A. B. NAGESWARA RAO :—ప్రస్తుతంవున్న ప్రశ్నకు మీరు అడిగేదానికి సంబంధం లేదు.

Sri. A. KALESWARA RAO :—చాలామంది అడుగుతున్నారు. అప్పుడప్పుడు జవాబుచెప్పలేకుండ వున్నాను. దానికి మునిసిపాలిటీలలో ఏదైన పెద్దదానిని కార్పొరేషన్ చేయడానికి గవర్నమెంటు పద్ధతులేమైన వున్నాయా ? దానికి ఏమి పద్ధతులు ? ఇప్పుడు పెద్దపంచాయితీలున్నాయి. వానిని మునిసిపాలిటీలు చేయుటకేమి పద్ధతులు ?

THE HON. Sri A. B. NAGESWARA RAO:—కార్పొరేషన్ వ్యవహారాలు ప్రస్తుతము ఆలోచించలేదు. పంచాయితీలు కొంచెము ఆలోచనలో వుంది.

Sri N. VENKAIAH :—Class I పంచాయితీలు ఏర్పాటుచేయడానికి ఏవైనా ప్రాతిపదికలు నిర్ణయము చేసినారా ?

THE HON. Sri A. B. NAGESWARA RAO :—రెండవగ్రేడు మునిసిపాలిటీలనుంచి మొదటి గ్రేడు మునిసిపాలిటీలు కావాలంటే ఆదాయము హెచ్చుఅయితే ఔతాయి.

Sri A. SATHYANARAYANA MURTHY :— మునిసిపాలిటీలు చేయడమువల్ల మునిసిపాలిటీలలో గ్రేడ్సు పెంచుతువుండడంవల్ల Act ప్రకారము establishment charges ఎక్కువ అయితాయి. Public Works కు డబ్బు తగ్గిపోతుంది. అందువల్ల ఖర్చు తగ్గించడానికి Public Works లో యింత percentage వుండాలని నియామకము చేస్తారా ?

THE HON. Sri A. B. NAGESWARA RAO :—వేరే ప్రశ్న వేయండి. ఉన్న ప్రశ్నకు మీరు అడిగినదానికి సంబంధము లేదు.

*Revision of Scales of Pay of Non-Gazetted Officers.*

140—

* 72 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state whether there are proposals with the Government to revise the scales of pay of Non-Gazetted

Officers now in pursuance of the recommendations of the Pay Commission ?

THE HON. SRI B. GOPALA REDDI :—No, Sir.

Sri VEMAYYA :— కనీసము dearness allowance ను pay తో merge చేయడానికి ప్రభుత్వం పూనుకుంటారా ?

THE HON. Sri B. GOPALA REDDI :—అటువంటి సత్సంకల్పము లేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఎందుకు లేకుండి ? దానివల్ల నష్టమేముంది ?

THE HON. Sri B. GOPALA REDDI :—నేను budget discussionలో చెప్పాను. Dearness Allowance ను కలిపితే pension liabilities ఎక్కువ ఔతాయి.

Sri P. RAMACHARLU :— అధ్యక్షా, రివెన్యూ డిపార్టుమెంటులో Taluk Head Accountants కొందరున్నారు. వాండ్లకు pay scales బోర్డు ఇదివరకే ఎక్కువచేయాలని రెకమెండుచేసినది. ఆంధ్రరాష్ట్రము ఏర్పాటు జరిగి పోయినది. మద్రాసు గవర్నమెంటువారి scales revise చేసి 1½ సంవత్సరమైంది. ఇంకను ఆంధ్ర గవర్నమెంటు revise చేయలేదు. తాలూకు హెడ్డు అక్కౌంటెంట్సువారికి చాల కష్టపడుతున్నారు. కొబట్టి scales of pay revise చేస్తారా ?

THE HON. Sri B. GOPALA REDDI :— ఆలోచిస్తాము.

Sri P. SUNDARAYYA :—Dearness Allowance ను Pay తో merge చేస్తే pension charges ఎంత ఎక్కువ ఔతవో లెక్కలు చెప్పగలరా ?

THE HON. Sri B. GOPALA REDDI :—వేరే ప్రశ్న వేస్తే జవాబు చెప్పతాను.

Sri M. NAGI REDDI :— Dearness Allowance అంతా కలుపకపోయినా, పోనీ కొంత భాగమైనా కల్పుతారా ?

THE HON. Sri B. GOPALA REDDI:— కొంతకల్పడమెందుకు కలిపితే అంతా కల్పాలి. లేకపోతే లేదు.

26th July 1955]

Sri P. SUNDARAYYA :—గాడ్గిల్ కమిటీ రెకమెండేషన్ ప్రకారము Dearness Allowance లో కనీసము సగమైనా ఆంధ్రలో ప్రభుత్వ ఉద్యోగులకు కనీసము N.G.Os. యొక్క జీతముతో కల్పుతుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—గాడ్గిల్ కమిటీవచ్చి చాల కాలమైంది. అటువంటి ఆలోచన యింతవరకు లేదు.

*Grant of Central Government Scales of Pay and Dearness Allowance to State Government Officials.*

141—

* 660 *Q*.—Sri P. NARASIMHAPPA RAO : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the question of granting Central Government scales of pay and dearness allowance to Non-Gazetted Government Officials in the Andhra is under the contemplation of the Government ; and

(b) if so, the principles that will be adopted in the matter; and

(c) the approximate amount that will be incurred ?

THE Hon. Sri B. GOPALA REDDI :—

(a) No, Sir.

(b) & (c) Do not arise.

Sri S. VEMAYYA :—అధ్యక్షా ! ఆంధ్రరాష్ట్రము వచ్చినతర్వాత రైతుల కోర్కెలు ఏవో కొన్ని కాలువలు త్రవ్వడమువల్ల తీరినవి. కాని వారి తోటి సోదరులు అయిన N.G.Os. చాల యిబ్బందులు పడుచున్నారు. Central Government ఉద్యోగులు సరిగా 10 ఘంటలకువచ్చి 5 ఘంటలకు వెళ్లిపోతారు. కాని వీరు మాత్రము ఉదయమునుంచి సాయంకాలమువరకు కూర్చోవలసివస్తుంది. ఏదైన వారికి సదుపాయము చేయకూడదా ? అని నేను మనవిచేస్తున్నాను.

THE HON. Sri B. GOPALA REDDI :—Central Pay Commission సూచించిన scales ను అమలుపరచినట్లయితే మన ఆంధ్ర రాష్ట్రములో 5 కోట్లరూపాయలు ఎక్కువ జీతాలు యివ్వవలసివస్తుంది. ఇప్పుడు Sయిచ్చే పరిస్థితిలోగ వర్నమెంటు లేదు.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా ! మంత్రిగారు సమాధానము చెప్పుతూ డబ్బులేదని చెప్పారు. శాశ్వతముగా లేదని అనుకోవచ్చునా ?

THE HON. Sri B. GOPALA REDDI :—అనుకుంటే మంచిదేమో వని అనుకుంటాను.

*Licences under the Arms Act.*

142—

* 258 *Q.*—SRI S. VEMAYYA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state the number of applications received, licences granted or rejected for the year ending 1954 under Arms Act in the State ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(1) Number of applications received : ... ... 3794

(2) Number of licences granted : ... ... 1794

(3) Number of applications rejected : ... ... 1614

Sri S. VEMAYYA :—Reject అయిన applications వున్నాయి. ఏ కారణాలవల్ల వాటిని reject చేశారో. తెలిసికోవచ్చునా ?

THE HON. Sri N. SANJEEVA REDDI — అతని చేతులలో ఆయుధాలు వుంటే శ్రేయస్కరము కాదు అనే కారణమువల్ల.

Sri A. KALESWARA RAO :—ఎవరైన కమ్యూనిస్టులుకూడ లైసెన్సుకు దరఖాస్తులు పెట్టారా అండి ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—Form లో "ఆ కమ్యూనిస్టు, కాంగ్రెస్" అనే కాలంలేదు.

Sri PILLAMARRI VENKATESWARLU :— ఆయుధాలిస్తే దుర్వినియోగము చేస్తారనే వారికి లైసన్సులు యిస్తున్నారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—సాధారణముగాయివ్వరు.

Sri N. VENKAIAH :—కమ్యూనిస్టులకు ఆయుధాలు యివ్వడము ప్రమాదకరమని ప్రభుత్వము తెలుసుకున్నారేమండి ?

THE HON. Sri N. SANJEEVA REEDI :—వాండ్లు సాధారణముగా application పెట్టుకోరు. కాని సంపాదించుకుంటారు.

SRI P. KODANDARAMAYYA :—యుద్ధకాలములో నాటు తుపాకు లను కోయవారలనుండి ప్రభుత్వము తీసుకున్నారు. వాండ్లు protect చేసుకో డానికి తిరిగి 306 నాటుతుపాకులను వాండ్లకివ్వడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా?

26th July 1955]

THE HON. Sri N. SANJEEVA REDDI :—ఆలోచిస్తాము.

Sri S. VEMAYYA :—అధ్యక్షా! వెంకయ్య, రామయ్య, గున్నయ్య అనేవాండ్లకు పలానా కారణాలు అనితెల్పకుండా వాండ్ల దరఖాస్తులు త్రోసివేయబడినవి. ఏ కారణాలవల్లనండి ?

Mr. SPEAKER :—please put a specific question.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా! కమ్యూనిస్టు ప్రాబల్యము వున్నచోట ఆత్మరక్షణకోసము ప్రభుత్వము ఆయుధాలు యిచ్చేదానికి పూనుకుంటుందా ?

THE HON Sri N. SANJEVA REDDI :—ఆ పని చేస్తుంది.

Sri P. BASI REDDI:—ఈ కమ్యూనిస్టులు లైసన్సు లేకుండాఆయుధాలు సంపాదించుకుంటారని ప్రభుత్వానికి తెలిసినట్టుంది. ఈవిధంగా సంపాదించుకోకుండా అరి కట్టడానికి ప్రభుత్వము ఏమి ప్రయత్నము చేస్తుంది ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—ఇప్పుడు వారు ఆ ఉద్దేశముతో లేరు కాబట్టి ఆ ప్రయత్నము మనకు అవసరము లేదు.

Sri P. SUNDARAYYA :—కడప కర్నూలు జిల్లాలలో పెద్ద పెద్ద భూస్వాములు లైసన్సులు లేకుండా తుపాకులు సంపాదించుకొని ప్రజలపై దాడిచేసి బీభత్సము చేసినసంగతి ప్రభుత్వానికి తెలుసు. అటువంటివి అపుచేయడానికి ప్రభుత్వము తగిన చర్యలు తీసుకుంటారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—కడప కర్నూలు ప్రాంతాలలో తుపాకులు అవసరము లేదు. రాళ్లు యీటెలతోకూడ పనిచేసుకుంటారు.

*Karvetinagar Zamindari in Chittoor District.*

143—

* 436 *Q.*—SRI R. B. RAMAKRISHNA RAJU : **Will the Hon. the Minister for Revenue be pleased to state—**

**(a) whether it is a fact that, in the Karvetinagar Zamindari in Chittoor district taken over by the Government under the Estates Abolition Act, the wells dug by the ryots at their own expense in their own holdings are classed under poramboke and water-rate is being charged for lands irrigated under the said wells ; and**

[26th July 1955

(b) whether a number of protests and representations have been sent to the Government complaining about the inequity and injustice ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

The answer * is placed on the table of the House.

Sri RAMAKRISHNA RAJU:—కొన్ని బావులుఅసలు wet lands లోనే ఉన్నవండి. అటువంటి భావులక్రింద మూడు ఎకరా లుంటేకూడా వాటికి నీటితీరువా చార్జిచేస్తారా ?

THE HON Sri K. CHANDRAMOULI:—Wet lands క్రింద ఉన్న వన్నికూడా charge చేస్తాం.

Mr. SPEAKER:—We discussed this matter at great length in the budget debate.

Sri G. YELLAMANDA REDDI:—అధ్యక్షా ! ఆ paperలో Bలో ఈ బావులన్నీ 1884 కు ముందు వాళ్ళే త్రవ్వకున్నట్లు, రైతులే prove చేసుకోవాలని చెప్పారు. అసలు భావులన్నీకూడా general గా ఎక్కడపట్టినా రైతులే త్రవ్వకున్నారు కాబట్టి ఈ clause తీసివేసి బావులు రైతులు త్రవ్వకున్నట్లు ప్రభుత్వం గుర్తిస్తుందా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—ఆ question ప్రభుత్వాలోచనలో యున్నదని ఇదివఱకే రెండు మూడు పర్యాయాలు చెప్పాం. సాధ్యమైనంత త్వరలో చేస్తాం.

Sri R. B. RAMAKRISHNA RAJU :— అసలు wet తీరువా ఛార్జి చేసే భూమిలో బావులుంటే మళ్ళీ దానికి water rate charge చేస్తారా ?

THE HON. Sri K. CHANDRAMOULI :— భావిక్రింద సాగైతే బావినీరు ఉపయోగించుకుంటే తప్పకుండా చార్జి చేస్తారు.

Sri R. B. RAMAKRISHNA RAJU —అటువంటి భూములకుకూడా భావి ఉంటే దాన్ని మళ్ళీ charge చేస్తారా అని అడుగుతున్నాను.

THE HON. Sri K. CHANDRAMOULI :— Wet సాగుచేస్తున్నప్పుడు wet తీరువామాత్రమే చార్జిచేస్తారు. భావులక్రింద ప్రత్యేకం వేరే సాగుచేసుకుంటే భావుల తీరువా ఉంటుంది.

Sri R. B. RAMAKRISHNA RAJU:—1884 అని పెట్టారు. ఏ కారణంచేత ?

* Vide appendix at page 262 infra.

THE HON. Sri K. CHANDRAMOULI :—బహుశా అది అప్పటినుంచీ అమలులో ఉంటుంది అనుకుంటాను. వేరే question వేస్తే చెబుతాను.

Sri M. NAGI REDDI :—నీళ్లు ప్రభుత్వానివి కాబట్టి బావులు ఎక్కడ త్రవ్వుకున్నా వేస్తామంటున్నారు, పోనీ ఆలోచిస్తామంటున్నారు. ఒకవేళ water cess తప్పనిసరిగా వెయ్యాలని ప్రభుత్వం ఆలోచించేటట్లయితే, బావులు రైతులు త్రవ్వుకున్నారు కాబట్టి, బావికి అయ్యే ఖర్చైనా రైతుల కిస్తారా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—లేదండి.

Sri R. B. RAMAKRISHNA RAJU :—గవర్నమెంటువారికి ఇటువంటి కేసులు ముఖ్యంగా మన సంస్థానంనుంచి హైకోర్టువరకూపోయి ఈ బావులన్నీ రైతులే త్రవ్వుకున్నారని తీర్మానాలున్నాయి. అవి ప్రభుత్వంవారికి తెలుసువా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—అందువల్లనే ఆ విషయాలు ఆలోచిస్తున్నాం అని చెప్పాను.

Sri R. B. RAMAKRISHNA RAJU :—గవర్నమెంటువారు దానికి తీరువా వసూలు చేయకూడదని ఉత్తర్వులు ఇప్పించినందులకు చాలా సంతోషం. వారిని అభినందిస్తున్నాను. ఈ బావులక్రిందయుండే భూమి రైతులకు ఇవ్వడానికి గవర్నమెంటువారు ఎప్పుడు తీర్మానం చేయగలరో చెబుతారా ?

THE HON. Sri. K. CHANDRAMOULI :—సాధ్యమైనంత త్వరలో చేయుటకు ప్రయత్నం జరుగుతోంది. ఆ wells క్రిందభూములకు joint patta లు రైతులకు లేకపోతే ఇవి ఏ విధంగా రైతు పరం చెయ్యాలనే విషయంకూడా ఇప్పుడు ఆలోచనలో యున్నది.

*Glass Factory at Gudur.*

144—

* 353 *Q.*—Sri S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether there are proposals to start Glass Factory at Gudur, Nellore district ;

(b) if so, when it will be opened ; and

(c) what its estimated cost is ?

THE Hon. Sri K. VENKATA RAO :—

(a), (b) and (c) :—The starting of a Block Glass Factory at Gudur in Nellore District at a cost of Rs. 1,01,200 non-recurring and Rs. 1,98,800 recurring was sanctioned by the Government in 1949. The construction of buildings for the factory was completed in May, 1955 and the factory was opened on 26—5—1955.

Sri S. VEMAYYA :— ఇది ప్రభుత్వమే నిర్వహిస్తుందా ? లేకపోతే ప్రభుత్వమూ, ఇతరవ్యక్తులూ కలసి నిర్వహిస్తారా ?

THE HON. Sri K. VENKATA RAO:—అది పూర్తిగా ప్రభుత్వంవారి ఫ్యాక్టరీయేనండి ?

Sri A. KALESWARA RAO :— ఇంకా ఎక్కడైనా Glass factory లు ఆంధ్రరాష్ట్రంలో త్వరలోనే నిర్మించుటకు ప్రభుత్వం నిర్ణయించు కున్నారా ? ఆ విషయంగురించి ఆలోచిస్తున్నారా ?

THE HON. Sri K. VENKTA RAO :— ప్రభుత్వంవారు స్వయంగా మళ్లీ ఏమీ Glass factory పెట్టరు. ఎవరైనా Private Sector లో దరఖాస్తు పెట్టుకుంటే సహాయంచేయడానికి ఆలోచిస్తారు.

Sri A. SATYANARAYANAMURTY:— Private గా పెట్టుకుంటే ఇస్తామని మంత్రిగారు చెప్పారు. 50% Government ఇస్తే, 50% private గానూ ఇవ్వడానికి చాలామంది సిద్ధంగా యున్నారు. దానికి Government అంగీకరిస్తుందా ?

THE HON. Sri K. VENKATA RAO :— అటువంటి వారు ఎంత మంది ఉన్నారో గాని, ఆంధ్రరాష్ట్రమంతా పదిసార్లు తిరిగినా నాకంటికి ఒక్కరూ కనిపించడంలేదు. సత్యనారాయణగారు ఎవరినైనా తీసుకువస్తే ఆలోచిస్తాం.

*Kumri Cultivation.*

145—

* 218 Q.—Sri S. VEMAYYA : Will the Hon. the Chief Minister be pleased to state the extent of land cultivated during the previous fasli under the "Kumri Cultivation" ?

THE Hon. Sri B. GOPALA REDDI :—4054·86 acres.

26th July 1955]

Sri S. VEMAYYA :— ఈ kumri సాగుచేయడంలో మధ్యమధ్య మొక్కలు నాటి తరువాత పైరు పెట్టుకోవాలి. ఈ మొక్కలు పోషించుకోడానికి అందులో ఫలించేఫలితం చాలడంలేదు. ఈ మొక్కలు ఖచ్చితంగా వాళ్లు పాతి పోషించాలనే పద్ధతి మానిపించుటకు ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. Sri B. GOPALA REDDI :— మానిపించినప్పుడు అది Kumri Cultivation కానేకాదు. పట్టి మామూలు cultivation అయిపోతుంది. కాబట్టి Kumri cultivation ఎక్కువ చెయ్యాలనే Department యొక్క ఉద్దేశ్యం.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— అయ్యా, కుమ్రీ cultivation వల్ల చెట్లు పెరగడంలేదు కనుక kumri cultivation కు ఇవ్వమని ఒక వంక Forest Officers చెబుతున్నారు. తమరు మొన్న kumri-cultivation అభివృద్ధిచేయాలని ఆలోచిస్తున్నామని చెప్పారు. దీనిలో దేనిమీద మమ్మల్ని ఆధారపడ మంటారో సెలవిస్తారా ?

THE HON Sri B. GOPALA REDDI:— Kumri cultivation అనే పేరుతో అనేకమంది భూములు ఆక్రమించుకుని అక్కడ చెట్లు నాటడం గాని, పెంచడం గాని లేకుండా తరువాత ఆక్రమణకు ఎవరినో ఒకరిని పట్టుకొని వాటిని స్వాధీనం చేసుకుందాం అనే ఉద్దేశ్యంతో kumri అనే పేరుతో అక్కడ ప్రవేశించడంవల్ల అది జరగకుండా పోతోంది. అట్లాకాకుండా షరతులుపెట్టి Kumri cultivation చేసేవారికి భూములు సాగుకు ఇవ్వాలని ప్రయత్నం చేస్తున్నాం.

Sri PILLALAMARRI VENKATESWARLU :— కొన్ని షరతుల మీద cultivation కు ఇచ్చిన forest భూములనుపే డు సంవత్సరాలనైప్పటికినీ, ఆ భూములనుకూడా తిరిగి ప్రభుత్వం ఈ సంవత్సరం cultivation చేయకుండా అభ్యంతరం పెడుతున్నట్లు కనిపిస్తోంది. అలా జరగకుండా ప్రభుత్వం ఉత్తరువులు పంపిస్తుందా ?

THE HON. Sri B. GOPALA REDDI :—Kumri Cultivation పేరుతో తీసుకున్నవాళ్లు చెట్లు పెంచకుంటే, పెంచినచోట ఎక్కడా వారిదగ్గర నుంచీ తీసుకున్నది లేదు. కాని పెంచుతున్నామని సాకుపెట్టి అక్కడ పెంచకుండా, పెంచాలనే ఉద్దేశ్యంకూడా లేకుండా ఉన్న కేసులే మాదగ్గరకు వస్తున్నాయి. అందువల్ల అది తగ్గించాలని ప్రయత్నంచేస్తాం.

Sri V. VISWESWARA RAO :— ఈ Kumri cultivation లో చెట్లు చేమ నర్కి పెంచాలని యున్నది. దాన్ని మార్చి గట్లమీద పెంచే పద్ధతి తీసుకువస్తారా?

THE HON. Sri B. GOPALA REDDI :— ప్రతి ఎకరానికీకూడా పెంచడం అనేది kumri cultivation కు విరుద్ధమవుతుందేమో. అవి ఇన్ని ఎకరాలకు ఇన్ని చెట్లు వేస్తామనే షరతుమీద Kumri cultivation కు ఇస్తున్నారు. కేవలం గట్లమీదైతే అన్ని చెట్లు వేయలేననిపిస్తుంది.

Sri S. NARAYANAPPA :—అధ్యక్షా ! రాయలసీమ మెట్ట ప్రాంతాలలో త్రాగడానికే నీరు దొరకడం కష్టంగా యుంటుంది. ఈ అడవులలో ఈ kumri cultivation చేసేది చాలా కష్టంగా యుంటుంది. ఈ విధానాన్ని రాయలసీమ మెట్టప్రాంతాలలో రద్దుచేసే విధానం ప్రభుత్వం ఆలోచిస్తుందా?

THE HON. Sri B. GOPALA REDDI:— Kumri cultivation అనే పేరుతో భూములు దరఖాస్తు పెట్టకుండా ఉంటే సరిపోతుంది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Kumri cultivation అని 3, 4, 5 సంవత్సరాల lease ఇస్తున్నారు. మొదటి సంవత్సరం చెట్లు వేస్తున్నారు. బ్రతకడం లేదు. మరు సంవత్సరం చెప్పకుండా తీసేస్తున్నారు. 2, 3 సంవత్సరాలు opportunity వచ్చినచోట్ల వాళ్లు ప్రయత్నించినప్పటికీకూడా విఫలం ఐనప్పుడు దానికి చేయవలసిన పద్ధతి ఆలోచించాలి. కాని మీరు చెట్లు వేయలేదంటే వేసినప్పటికీ అది విఫలమవుతుంది, వర్షం లేనందువల్ల. దానివల్ల మీరు ఆలోచిస్తారా ఆ lease ఉన్నవాళ్లూ వాళ్ళచేతుల్లో ఉండేటట్లు ?

THE HON. Sri B. GOPALA REDDI :—ఎకరాలు, ఎకరాలు దర్యాప్తు చేయవలసిన విషయం అది. వేస్తున్నామని పేరుచెప్పి చాలామంది వెయ్యకుండా ఉన్నారనే విషయం department వారికి తెలుస్తూయున్నది. అందువల్ల ఎక్కడైనా ప్రత్యేకంగా అక్కడ ఏమిజరుగుతోందో ఆ పరిస్థితులనుబట్టి ఉంటుందిగాని general గా ఇప్పుడేమీ చెప్పడానికి వీలులేదు.

Sri P. SREERAMULU :— ఈ Kumri cultivation ను గురించి మంత్రిగారు ఏమైనా తెలియచెప్తారా ?

Mr. SPEAKER :—After so many answers you could have caught the meaning of the word Kumri cultivation

26th July 1955]

*Gummidigedda Reservoir Scheme.*

146 —

* 590 *Q.*—Sri P. GUNNAYYA: Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Government investigated into Gummidigedda Reservoir Scheme, Parvathipuram taluk of Srikakulam district.

(b) if so, the estimated cost ; and

(c) the land that could be irrigated ?

THE Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) The investigation of Gummidigedda Reservoir scheme has not yet been completed.

(b) and (c) : The particulars are not yet available.

Sri P. GUNNAYYA :—అధ్యక్షా! ఇది చాలా కాలంనుంచి ఉన్నపని కాబట్టి మంత్రిగారు జవాబు తెలుగులో చెబుతారని ఆశిస్తున్నాను.

Mr. SPEAKER :—Investigation తీసుకోలేదని చెప్పారు.

Sri P. GUNNAYYA :— తీసుకోకపోతే ఎంతలోగా investigation తీసుకుని ఆపని పూర్తిచేయడానికి ప్రభుత్వంవారు చూస్తున్నారు,

THE HON. Sri N. SANJEEVA REDDI :—1952వ సంవత్సరంలో investigation జరుగుతోంది. అప్పుడు grow more food department ఎత్తివేయడంవల్ల ఆ staff నిలచిపోయింది. మళ్ళీ ఇప్పుడు క్రొత్త staff వేశాం. శ్రీకాకుళంజిల్లాకు ఇప్పుడు ఆప్రాంతంలో మండగడ్డ scheme investigate చేస్తున్నారు. తరువాత గోస్తానది scheme చూస్తున్నారు. తరువాత మండగడ్డ scheme కు వస్తారు. దానితరువాత గుమ్మడిగడ్డ scheme కు వస్తారు.

Sri K. V. S. PADMANABHA RAJU :— కొన్ని ప్రాజెక్టులు ప్రభుత్వంవారు తీసుకొంటున్నారని, అవి అందులో (statement లో) వున్నవని చెప్పారు. అవి ఏయే ప్రాజెక్టులో చెప్పగలరా ?

THE HON. Sri N. SANJEEVA REDDI:—ఏదో staff వేస్తున్నామని చెప్పాను గాని మీకు రాష్ట్రమంతటికి ఈ వివరాలు కావాలంటె వేరే ప్రశ్న వేయండి. మీకు ఒక booklet ఇవ్వదలచుకొన్నాను. ఇప్పుడే అది print అవుతూ ఉన్నది. రేపో ఎల్లుండో ఆ booklet ఇస్తాను. ఏవేవి investigate

చేస్తారో, ఏవి contemplation లో ఉన్నాయో, ఏ ప్రాజెక్టులు ఏ స్టేజిలో ఉన్నాయో అది చదివితే తెలుస్తుంది.

Sri L. LAKSHMANA DAS:—అధ్యక్షా! ఈ గుమ్మడిగడ్డ reservoir scheme చాలా ఉపయోగకరమైనటువంటిది. అందుచేత దానిని కొంచెముత్వరలో investigate చేయించుటకు ప్రభుత్వము ఏర్పాటుచేస్తుందా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—ఈ స్కీము మంచిదని special staff శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలో వేసినాము అని budget speech లో చెప్పాము. కాని ప్రతిఒక్కరు తమ ప్రాంతములో ఉన్న స్కీము చాలా ప్రధానమైనదని అనుకొంటుఉంటారు. కనుక అన్ని సమష్టిగాచూచి ఇదికూడ investigate చేయించడానికి ప్రభుత్వము తయారుగా ఉంది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—ముఖ్యమంత్రిగారు మొన్న మాట్లాడుతూ grow more food compaign ఉన్నది అని చెప్పారు. వీరు కేమో ఇది తీసివేశారని చెప్పతున్నారు.

MR. SPEAKER :—We are now in Gummidigedda Scheme.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—వారు ఆ సంగతి చెప్పారు. అందువల్ల నేను చెప్పతున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI.—He is making a mistake, Sir. I said that the particular staff which was in investigation of the project was abolished. That does not mean that the whole scheme of grow more food campaign has gone.

*Constitution of Village Planning Committees.*

147—

* 454 *Q.*—SRI P. VENKATASUBBAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the number of members required to constitute the Village Planning Committee and whether there is a directive to the District Collectors to include one or two members from the Harijan community of the village ?

THE HON. SRI K. VENKATA RAO :—The strength of the members of the Village Planning Committees in Non-Panchayat Villages is from 7 to 9 of whom one at least should be a Harijan. In the case of Panchayat Villages, the Panchayat

itself is the Planning Committee with the addition of the Village Munsif and Karnam and, wherever the villages come under the Community Project, Community Development or National Extension Service Scheme, the Village Level Worker. Government orders require that a Harijan should be nominated to be on the Committee by the convenor, if the Panchayat does not have a Harijan representative.

Sri P. VEKKATASUBBAYYA :— ఈ Village Planning Committees పని అంతా పూర్తి అయింది కదా! కనుక ఈ Village Planning Committees ఇంకా ఉంటాయా, లేక ఇంతటితో వాటిపని ముగిసిపోయిందా ?

THE HON Sri K. VENKATA RAO:—వారిపని పూర్తి అయిపోయింది.

Sri G. NAGESWARA RAO :— పంచాయితీలు ఉన్న గ్రామాలలో పంచాయితీలు కమిటీలుగా ఉంటాయని అంటున్నారు. అటువంటి పంచాయితీలు ఉన్న గ్రామాలలోనే పంచాయితీ సభ్యులను కొంతమందిని మినహాయించి కమిటీలు వేశారు. అటువంటి మినహాయింపులు చేయబడిన గ్రామాలసంగతి మంత్రిగారికి ఏమైనా అందిందా ?

THE HON. Sri K. VENKATA RAO :—ఇదివరకు అందలేదు.

Sri P. SUNDARAYYA:—ఈ Village Planning Committees Plans పంపివేసినతోడనే వాటిపని పూర్తయిపోయిందని మంత్రిగారుచెప్పారు. ఆ plans ప్రభుత్వము అంగీకరించినతరువాత, వాటిని అమలుపరచడానికోసం ప్రజల సహకారం తీసుకోవలసియుంటుంది. కనుక ఇటువంటి planning committees అన్ని స్థాయిలలోను అవసరమని ప్రభుత్వము గుర్తిస్తుందా ?

THE HON. Sri K. VENKATA RAO :—గుర్తింపవలసిన అవసరం లేదు. కాని దానికి అనుగుణమైన ఏర్పాట్లన్నీ వచ్చే ఏప్రిల్‌లో చేస్తాము.

Sri L. LAKSHMANA DAS :—ఇప్పుడు సుందరయ్యగారు వేయదలచినప్రశ్న నేను వేయదలచాను. మంత్రిగారు దీన్నిగురించి ఆలోచిస్తున్నామని చెప్పారు. ఈ plans execute చేయడానికి కూడ చాలా బాధ్యతలున్నవి. అందుచేత ఈ కమిటీలనే continue చేస్తే లేప్ప సక్రమంగా ఆ plans అమలు జరుగుటకు వీలుంటుంది అని ప్రభుత్వము భావిస్తుందా ?

THE HON. Sri K. VENKATA RAO :—రేపు development మీద discussion వచ్చినప్పుడు, దీనినిగురించి వారు విపులంగా ఉపన్యాసము చేస్తే బాగుంటుంది.

*Cut on Salaries above Rs. 500.*

148—

* 349 *Q.*—SRI S. VEMAYYA : Will the Hon. the Chief Minister be pleased to state whether there are proposals with the Government, to impose a cut on the salaries of the officers drawing Rs. 500 and above ?

THE HON. Sri B. GOPALA REDDI :—No, Sir.

Sri S. VEMAYYA :— 1937 సంవత్సరంలోనే All India Congress వారు అయిదువందలకు పైబడిన జీతాలను తగ్గిస్తామని చెప్పారు. దానిని పురస్కరించుకొని అయినా మన ప్రభుత్వము అటువంటి జీతాలను తగ్గించడానికి పూనుకుంటుందా ?

THE HON Sri B. GOPALA REDDI:—ఈ విధంగా pass చేసింది 1931 లో గాని 1937 లో కాదు. ఇది కరాచీ కాంగ్రెసులో చేశారు. అటువంటి విషయమేమీ ఇప్పుడు ఆలోచనలో లేదు.

*Extension of the scheme of Separation of Judiciary from the Executive.*

282—

* 918 *Q.*—SRI M. RAJESWARA RAO: Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether the Government have taken a decision to extend the system of Separation of the Judiciary from the Executive to any other districts in the current year ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

The question of extension of the Scheme of Separation of the Judiciary from the Executive to another district this year is under the active consideration of the Government and the decision will soon be taken in the matter.

Sri V. VISWESWARA RAO :—కనీసం ఈసంవత్సరం క్రిష్ణాజిల్లాలో దానిని అమలుజరుపుతారా ?

THE HON Sri N. SANJEEVA REDDI :—లేదండీ.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— ఇది తక్కిన జిల్లాలలోకూడ అమలు జరుపడానికి ఎన్నాళ్లు పడుతుందండీ?

THE HON Sri N. SANJEEVA REDDI :—ఇప్పుడు ఒక జిల్లా తీసుకొంటాము. మిగిలిన రెండుజిల్లాలుగురించి తరువాత ఆలోచిస్తాము.

Sri P. NARASIMHAPPA RAO :—శ్రీకాకుళం జిల్లాను ముందుతీసుకుంటారా ?

THE HON Sri N. SANJEEVA REDDI :— శ్రీకాకుళం జిల్లాతీసుకొని అప్పుడే చాలానాళ్లయింది. అప్పారావుగారు అసలు ఈ ప్రశ్న ఏమిటో చదివి ఉంటే తెలిసిఉండేది.

Sri B. SANKARAIAH :— దీని అవసరాన్ని ప్రజలు ప్రభుత్వము గుర్తించారు కదా! అటువంటప్పుడు, దీనిని అక్కడక్కడ కాకుండా, ఒకేసారి అన్నిజిల్లాలలోను తీసుకోడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON Sri N. SANJEEVA REDDI :—నిదానంగా జాగ్రత్తగా చేస్తే బాగుంటుందిగాని తొందరపడి పరుగెత్తితే ఎట్లా ?

*Staff of Tirumalai-Tirupati Devasthanam Estates.*

283—

* 576 *Q.*—SRI P. GOPALU REDDY :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether the Government are aware that the staff of Tirumalai-Tirupati Devasthanam Estates have not been so far merged with the regular staff even in cases of qualified people ;

(b) if so, the reason for it ;

(c) whether the Government have received any representations from the Tirumalai-Tirupathi Devasthanam Estate staff regarding the regularisation of their services ; and

(d) if so, the action taken in the matter ?

[26th July 1955

THE HON. Sri K. CHANDRAMOULI :—

(a) : Yes.

(b) : The question of integration of the offices of the Deputy Collector-Manager Tiruttani, Tahsildar-Managers, Pallipat, and Karvetinagar, with the regular Revenue Offices is under the consideration of the Government. The merger of Tirumalai-Tirupati Devasthanam Estate staff with the regular Revenue staff can be effected only when the integration takes place.

(c) : The answer is in the negative.

(d) : Does not arise.

Sri R. B. RAMAKRISHNA RAJU :— ఈ consideration ఎంతకాలము పడుతుందండి ?

THE HON Sri K. CHANDRAMOULI :— సాధ్యమైనంతత్వరలో తీసుకోవడానికి ప్రయత్నం జరుగుతుందండి.

Sri R. B. RAMAKRISHNA RAJU :—కొంచెం definite గా చెప్పగలరా ?

THE HON Sri K. CHANDRAMOULI :—Dates చెప్పడం కష్టం.

*Co-operative Deputy Registrars and Sub-Registrars appointed under the Cess Fund Scheme.*

284—

* 798 *Q.*—SRI S. RANGANATHA MUDALIAR : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) the number of Deputy Registrars of Co-operative Societies, and Co-operative Sub-Registrars appointed under the Cess Fund Scheme for the execution of the Schemes ;

(b) whether it is a fact that the Departmental Officers appointed under the Cess Fund Scheme are being paid an additional pay of 25 per cent over their usual pay ; and

(c) if so, the reasons therefor ?

26th July 1955]

THE HON. SRI K. VENKATA RAO :—

(a) 4 Deputy Registrars, 6 Co-operative Sub-Registrars.

(b) Yes.

(c) Because the duties and responsibilities of the officers on deputation are onerous and require special tact, initiative, drive and careful planning.

*Installation of a Diesel Power Station at Giddalur and Cumbum.*

285—

* 412 *Q.*—SRI P. RANGA REDDI :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether there is any proposal for installation of a Diesel Power Station at Giddalur and Cumbum in Kurnool District ; and

(b) if so, when it is likely to come up ?

THE HON. Sri G. LATCHANNA :—

(a) and (b) :—The answer is in the affirmative. The installation of a diesal generating Station at Giddalur has been sanctioned by the Government on 30—6—1955 and the work on the scheme may be expected to be taken up soon.

A proposal for installation of a diesel generation station at Cumbum is however under consideration of the Government.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Diesel generating station యింకా ఎక్కడనైనా పెట్టడానికి ప్రపోసలుఏదైనా వున్నదా ? వుంటే తెలియజేస్తారా ?

THE HON. Sri G. LATCHANNA :— దీనికి జవాబు యీ ప్రశ్నలో చెప్పడం, కష్టం.

Sri V. VISWESWARA RAO:—Diesel generator వల్ల ఎక్కువ ఖర్చులు అవుతాయని ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. Sri G. LATCHANNA :— Dharmal station line తీసుకొని వెళ్ళటానికి economic గా వుండడానికి అవకాశము లేనిచోట, డీజిల్ జనరేషను స్టేషను పెట్టుతారు.

*Exemption of weavers from taxes.*

286—

* 520 Q.—SRI S. NARAYANAPPA :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether the Government have received any representation requesting them to issue necessary instructions to the local bodies permitting them to exempt the weavers from the taxes ; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) and (b) The Government did not receive representation from The Andhra State Handloom Weavers' Congress about the distress among the Handloom Weavers in October 1953. In view of reports of widespread distress reaching the Government, the Government advised local bodies in December 1953, to exempt handloom weavers from the payment of property tax, house tax and profession tax for the year 1953-54 only in cases where the executive authorities are satisfied that the particular weaver's economic condition was such as to justify exemption from the payment of these taxes. This exemption was not applicable to all weavers or to the weavers who had taken to profitable forms of handloom industry such as carpet-making or to the weavers who were dealing in prosperous items of handloom trade. No representation from weavers has been received by Government for issue of such a direction to local bodies for subsequent years.

Sri S. NARAYANAPPA:— రాష్ట్రము మొత్తము పైన పంచాయితీల లోనూ, మునిసిపాలటీలలోనూ చేనేత పారిశ్రామికులకు పన్ను హెచ్చించినందువల్ల చేనేతపారిశ్రామికులు చాలా ఆందోళన పడుతున్నారు. ఈ విషయములో ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపించారు. కాని అవి మంత్రిగారు రాలేదని చెపుతున్నారు. అయి

నప్పటికిన్నీ, యీ పన్నులు తగినంతవరకు వీలుగా తగ్గించటానికి పంచాయితీలకు, మునిసిపాలటీలకు తగిన సలహాలను యిస్తూ వుత్తరువులు పంపుతారా ?

THE HON. Sri A. B. NAGESWARA RAO :— నారాయణప్పగారు చెప్పినటువంటి విజ్ఞప్తులు ఏమైనా వస్తే తప్పకుండా విచారించి, అర్హకంగా సమగ్రులైన వారికి యీ విషయములో తప్పకుండా ప్రభుత్వము ఆలోచిస్తుంది.

Sri A. C. SUBBA REDDI :— ఆవిధంగా ఆలోచించి remission యిచ్చేపద్ధతిలో ప్రభుత్వమువారు మునిసిపాలిటీలకు గూడా యిచ్చే విషయముకూడా ఆలోచిస్తారా ?

THE HON. Sri A. B. NAGESWARA RAO :— గ్రాంటు యివ్వటానికి అవకాశము ఏమీ లేదు. సుబ్బారెడ్డిగారు 1953-54 లో యింతకంటె ఎక్కువగానే యిచ్చారు. కాబట్టి యిప్పుడుకూడా యిస్తే బాగావుటుందని వారికి చెబుతున్నాను.

Sri B. SANKARAIAH :— Weavers కొరకు సెస్సుఫండు వగైరాలు పెట్టినప్పటికినీ, ఆవిధంగా ఎవరి conditions గూడా improve కాలేదని తెలుస్తున్నప్పుడు ఒకవేళ ఎవరినో ఒక్కరి conditions improve అయితే కావచ్చు, కాని చాలామంది conditions improve కాలేదు. అందువల్ల 1953 వ సం॥లో యిచ్చిన కన్సెషనే, యిప్పుడుగూడా వారి వృత్తులు కొనసాగించుకోటానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. Sri A.B. NAGESWARA RAO:— అలాంటి విషయాలలో ఏవైనా అర్జీలువస్తే ప్రభుత్వము తప్పకుండా ఆలోచిస్తుందని మనవి చేశాను.

Sri P. BRAHMAYYA :— చేనేత పారిశ్రామికులకంటె తివాచీ పారిశ్రామికుల పరిస్థితులు మరింత దుర్భరముగా వున్నవి. ఈ విషయములో ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపారు. వారికి గూడాపనులు యిచ్చే విషయంలో ప్రభుత్వం ఆలోచిస్తుందా !

THE HON. Sri A.B. NAGESWARA RAO:— అలాంటివిషయాలలో, అర్జీలు ఏవైనావస్తే తప్పకుండా ప్రభుత్వం విచారిస్తుందని యిదివరకే మనవిచేశాను.

Sri P. GUNNAYYA :— అధ్యక్షా, చేనేత పారిశ్రామికులకు పంచాయితీలలోను, మునిసిపాలటీలలోనూ పన్నులు మినహా యిస్తున్నారు. అలాంటప్పుడు హరిజనులకుగూడా యిటువంటి పన్నులు మినహాయించటానికి ప్రభుత్వము ఏర్పాటు చేస్తుందా ?

THE HON. Sri A. B. NAGESWARA RAO :—ఇది ప్రభుత్వము యిదివరకే చేసింది. అసలు మామూలుగా అన్నితరగతులవారికి గూడా మునిసిపాలిటీలలో నూటికి 13 రూపాయలకంటె valuation annual rental value కన్న తక్కువగా వున్నవాటి విషయములోనే చేసింది. అవన్నీ కొన్ని మునిసిపాలటీల ఆర్థికపరిస్థితులనుబట్టి 30 రూపాయలకంటె annual rental value తక్కువగా వుండేవారి విషయములో చాలా మునిసిపాలటీలు తగ్గిస్తున్నారు. ఆయా మునిసిపాలటీల ఆర్థికస్తోమతునుబట్టి ఆయా మునిసిపాలటీలు తగ్గించటానికి ప్రభుత్వముయొక్క సలహాకోరితే, ప్రభుత్వము ఆలోచిస్తుంది.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా, చేనేత పారిశ్రామికులు అంటే వీరు ఒకే కులం, ఒకేమతం కలవారు కాదు. ఇందులో మహమ్మదీయులు, శెట్టి బలిజలుగూడా ఉన్నారని ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON Sri A. B. NAGESWARA RAO :— తెలుసును.

Sri M. NAGI REDDI :—అధ్యక్షా ! ఆర్థికస్తోమతు లేనివారిదగ్గరనుంచి పిటిషనులువస్తే ఆలోచిస్తామని మంత్రిగారు చెబుతున్నారు. అలాంటప్పుడు ఒక్క చేనేత పారిశ్రామికులే కాకుండా,యింకను యితరకులాలవారుగూడా ఏయితరవృత్తులు గలవారైన సరే కష్టపడుతూవున్నవారు వుంటే, వారు అర్జీలుపెట్టుకుంటే, వారి విషయముగూడా విచారిస్తారా ?

THE HON Sri A. B. NAGESWARA RAO :—ప్రస్తుతము ప్రభుత్వమువద్ద వున్నది చేనేత పారిశ్రామికుల విషయము. కాబట్టి వారి సంగతి విచారిస్తాము ఇతరులసంగతి వచ్చినప్పుడు, అదిగూడా ఆలోచిస్తాము.

Sri N. C. SESHADRI :—ఆర్థికస్తోమతు లేనివారి సంగతి ఆలోచిస్తామని అంటున్నారు. వారికి ఆర్థికసోమతు వున్నదా లేదా అనేది ఎవరైనా certify చేయాల్సి వుంటుందా ?

THE HON Sri A. B. NAGESWARA RAO :—తప్పకుండా. మునిసిపల్ కమీషనరు certify చేయాలి.

Sri N. VENKAIAH :—కుటీర పరిశ్రమల విషయములో మినహాయింపు చేయటానికి, ఎక్కువ ప్రాధాన్యము యిస్తారా ?

THE HON Sri A. B. NAGESWARA RAO :—దీనికి కుటీర పరిశ్రమలకు ఏలాంటి సంబంధము లేదు.

26th July 1955]

MR. SPEAKER :—Question hour is over.

## II. ADJOURNMENT MOTION

Re : Retrenchment of Secondary School Teachers in Krishna District.

MR. SPEAKER : The hon. Member Sri Vavilala Gopalakrishnayya has given notice of an adjournment motion regarding ousting of the services the Secondary Grade Teachers in the Secondary Schools in Krishna District. I do not feel it is very urgent. I rule it out of order.

[*Note*:—An asterisk* at the commencement of a speech indicates revision by the Member.]

12-00 noon

## III. BUDGET FOR THE YEAR 1955-56 .

*Voting of Demands for Grants (Continued.)*

### I. DEMAND XVIII-AGRICULTURE AND FISHERIES.

THE HON. SRI B. GOPALA REDDI : MR. SPEAKER, Sir, on the recommendation of the Governor, I move :

" That the Government be granted a sum not exceeding Rs. 82,96,200 under Demand XVIII—Agriculture and Fisheries."

Fisheries కూడ యీ డిమాండులోనే వున్నది. రూ. 3,88,000 లు Fisheries Department మీద, మిగిలినది Agriculture Department మీద, ఖర్చు అవుతున్నది. ఈ 82 లక్షలలో, ఎక్కువ భాగము Development schemes క్రింద, 51 లక్షలు, గవర్నమెంటువారు అడుగుతున్నారు. ఆ 51 లక్షల రూపాయలకుగాను.

(1) Scheme for the control of pests and diseases of crops and plant protection,

(2) Comprehensive scheme for the multiplication and distribution of improved paddy and other seeds (3) Scheme for the development of sugarcane and cotton (4) Contour bunding and tractor cultivation schemes (5) Schemes for establishment of modern orchard-cum nurseries (6) Development of Agricultural College, Bapatla, వంటివన్నీ కూడా యీ డిమాండు

[Sri B. Gopala Reddi] [26th July 1955

క్రింద వస్తున్నవిషయాలే. Agricultural loans వగైరాలు యీ demand క్రింద రావు. కాని members వాటిని గురించి discuss చేయాలంటే, discuss చేయవచ్చును. కాని అవి Loans and Advances పద్దుక్రింద వస్తాయి. Agricultural Department కు సంబంధించినంతవరకు ఈ డిమాండు క్రింద రు. 79 లక్షుల చిల్లర ; Fisheries Department క్రింద రు. 3 లక్షుల చిల్లర కేటాయించబడ్డది. ఈ డిమాండు దేశానికి చాలా ఉపయోగకరమైనటువంటిది.

ఇంకను Fisheries Department విషయములో అనుభవముగలవారు సలహా ఏమైనావుంటే చెప్పవచ్చును. ప్రభుత్వమువారు మత్స్యశాఖను ఎక్కువగా అభివృద్ధి చేయించడానికి ప్రయత్నము చేస్తున్నారు. ఏమైనప్పటికినీ ఇది వివాదగ్రస్తముకాని డిమాండు గనుక దీనిని అట్టే ఎక్కువ విమర్శనలేకుండా మంజూరు చేయాలని కోరుతున్నాను.

**Mr. SPEAKER** :—The motion before the House is that the "Government be granted a sum not exceeding Rs. 82,96,200 under Demand XVIII—Agriculture and fisheries."

Now we come to cut motions.

258—

(445) **Sri P. SUNDARAYYA** : Sir, I beg to move :

To reduce the allotment of Rs. 82,96,200 for Agriculture and Fisheries by ... Rs. 100

ప్రజలకు వ్యవసాయ విజ్ఞానాన్ని, సలహాలను అందజేయడానికి కావలసిన వ్యవసాయ క్షేత్రాలు తగినన్ని ఏర్పాటుచేయనందున, సకాలములో ఎరువులు, విత్తనాలు, పనిముట్లు, రైతాంగానికి సక్రమ ధరలకు అందజేయనందున.

259—

(446) **Sri P. SUNDARAYYA** : Sir, I beg to move :

To reduce the allotment of Rs. 82,96,200 for Agriculture and Fisheries by ... Rs. 100

రైతాంగము పండించే పంటలకు సరియయి ధరలు వచ్చేటట్లు, ముఖ్యంగా మానూళ్ల సందర్భములో సరియయినధరలు వచ్చేటట్లు చేయడంలేదు, కాన

260—

(447) Sri P. SUNDA RAYYA : Sir, I beg to move :

To reduce the allotment of Rs. 82,93,200
for Agriculture and Fisheries by ... Rs. 100

ఆంధ్ర కోస్తాలోని మత్స్య పారిశ్రామికులకు సముద్రంలో దూరంవెళ్లి లోతున చేపలు పట్టుకోడానికి తగిన సౌకర్యాలు చేయనందున, వారికి కావలసిన వలలు, తదితర సామగ్రి చౌకగా దొరికేటట్లు చేయనందున, పట్టిన చేపలు నిలువచేసి దూరప్రాంతాలకు ఎగుమతి చేసే సౌకర్యాలు కలుగచేయనందున.

264—

(62) Sri M. NAGI REDDI : Sir, I beg to move :

To reduce the allotment of Rs. 82,96,200
for Agriculture and Fisheries ... ... Rs. 100

వ్యవసాయ అప్పులను మంజూరు చేయుట, సక్రమంగా పంపిణీ చేయుట, ఎరువుల ధరలు తగ్గించుట, సకాలములో ఎరువుల అప్పులు మంజూరు చేయుటను గురించి చర్చించుటకు.

265—

(92) Sri M. NAGI REDDI : Sir, I beg to move :

To reduce the allotment of Rs. 82,96,200
for Agriculture and Fisheries ... ... Rs. 100

Agricultural experiments and Research Stations
తాలూకాకు ఒకటిచొప్పున పెట్టుటను గురించి చర్చించుటకు.

268—

(144) Sri V. VISWESWARA RAO : Sir, I beg to move :

To reduce the allotment of Rs. 82,96,200
for Agriculture and Fisheries, by ... Rs. 100

రైతులకు అమ్మోనియా సల్ఫేటును అందజేయుటంలో ప్రభుత్వం ప్రతిసంవత్సరం జాగుచేయు విధానం గురించి,

269—

(171) SRI B. SANKARAIAH : Sir, I begto move :

To reduce the allotment of Rs. 82,96,200 for Agriculture and Fisheries by ... Rs. 100

వ్యవసాయాభివృద్ధికి చాలా తక్కువమొత్తాన్ని గ్రాంటుచేసినందుకు, వ్యవసాయాభివృద్ధికి తగినంత కృషి ప్రభుత్వం చేయనందుకు.

273—

(238) SRI G. NAGESWARA RAO : Sir, I beg tomove :

To reduce the allotment of Rs. 82,96,200 for Agriculture and Fisheries by ... Rs. 100

వ్యవసాయ ఎరువులవిత్తనముల సప్లయి విషయములలోను, వ్యవసాయ అభివృద్ధి కొరకు యిచ్చే అప్పుల విషయములలోను ఫిషరీస్ డిపార్టుమెంటు అవలంబించే విధానాలలోను ప్రభుత్వ విధానాన్ని చర్చించేందుకు.

274—

(277) SRI VAVILALA GOPALAKRISHNAYYA : Sir I beg to move :

To reduce the allotment of Rs. 82,96,200 for Agriculture and Fisheries by ... Rs. 100

జనరల్ విధానం చర్చించుటకు.

276—

(331) SRI P. SATYANARAYANA : Sir, I beg to move :

To reduce the allotment of Rs, 82,96,200 for Agriculture and Fisheries by ... ... ... ... Rs. 100

తూర్పుగోదావరిజిల్లా ఉప్పాడగ్రామం సముద్రముంపుకు గురిఅగుతూ ఆ మేజర్ పంచాయితీగ్రామం అంతా ప్రమాదంలో పడినవిషయాన్ని ప్రభుత్వ దృష్టికి తెచ్చుటకు.

26th July 1955]

277—

(329) SRI PUTSALA SATYANARAYANA: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 82,96,200
for Agriculture and Fisheries by ... Rs. 100

ఫిషరీస్ విషయంలో ఏవిధమైన అభివృద్ధి ప్రభుత్వం సాధించనందుకు.

278—

(359) SRI S. VEMAYYA: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 82,96,200
for Agriculture and Fisheries by .. Rs. 100

రెవిన్యూ, పరపతిశాఖలకు చేపలశాఖకు సంఘీభావములేక వేగూరు, ప్రత్తేడు చెరువులలోని చేపలు పరపతిసంఘాలకియిచ్చే విషయములో వ్యతిరేకించుచున్నందుకు.

Sri K. V. S. PADMANABHA RAJU:— అధ్యక్షా! మన ముఖ్య మంత్రిగారు ఈ Agriculture Demand ను introduce చేస్తూ Agricultural and Fisheries అనేటటువంటిది చాలా ప్రత్యేకమైన డిమాండు అని దీనిమీద ఏవో కొన్ని సలహాలను ఇవ్వాలని, దీనిని విమర్శనదృష్టితో తీసుకో కూడదని చెప్పారు. నేను దానితో ఏకీభవిస్తున్నాను. ఏ దృష్టిలో ఏకీభవిస్తున్నాము అంటే, ఈ Agriculture Demand అనేటటువంటిది, ఈనాడు దేశంలో చాలా ప్రధానమైనటువంటిదని అందులోమాత్రము వారితో తప్పని సరిగా ఏకీభవిస్తున్నాను. Agricultural and fisheries అనేటటువంటివి ఈనాడు దేశంలో, మన రాష్ట్రములో, 100 కి 80 వంతులున్న వ్యవసాయదారులు అనేటటువంటి వారికి సంబంధించింది అనిమాత్రము వారుగ్రహించాలని వారికి మనవిచేస్తున్నాను. ఇటువంటి ప్రధానమైన డిమాండుకు ఈరోజున ముఖ్యముగా గవర్నమెంటు మన ముందుపెట్టిన బడ్జటులో కేటాయించినది. 82,96,200 రు. ఒకకోటిరూపాయలు కూడా లేదన్నమాట. ఇటువంటి ప్రధానమైన ఈ డిమాండుకు ఈ విధముగా బడ్జటులో తక్కువ డబ్బు కేటాయించినప్పుడు ఈవేళ మనకు వెన్నెముక అయిన రైతాంగముమీద ప్రభుత్వపుదృష్టి ఏ విధముగా వున్నదో గమనించండి, ఏవిధముగా ఉన్నదో వారు కేటాయించిన బడ్జట్టుచూస్తే అర్థమవుతుంది. ఇకపోతే ఈ 82 లక్షల 96 వేల రూపాయిలు రాష్ట్రములో ఏవిధముగా ఖర్చు అవుతున్నదో చూడండి. అందులో 3 వ వంతు ఈ రోజున administration కు, అక్కడ వున్నటువంటి Superintendents కు, Researches కు, ఖర్చు అవుతున్నది.

SRI K. V. S. Padmanabha Raju] [26th July 1955

దీనివల్ల వుపయోగం ఏవిధంగాను లేదని వారిదృష్టికి తెస్తున్నాను. ఇంకొ ప్రధానమైన సమస్య ఉన్నది. ఈనాడు వ్యవసాయ డిపార్టుమెంటుకు, రైతాంగానికి సంబంధంలేదు. మనము agricultural farms పెట్టుతున్నాము. ఈ విధంగా వ్యవసాయము చేసుకొన్నప్పుడు చాలా అభివృద్ధివస్తుంది అని, ఈ విధముగా చేయాలి అని రైతులకు బోధచేయడముకోసము ఈఫారములు పనికి వస్తాయి. ఈనాడు సామాన్యరైతులకు లాభముకలుగుటలేదు. Agricultural Department వారు ఇచ్చే విత్తనములలోగాని, కలపాలలోగాని, ఏ విధముగా వ్యవసాయము చేసుకోవాలో అనిచెప్పే దాంట్లోగాని ఏవిధముగాను విశ్వాసము లేకుండా పోతున్నది. ఈనాడు ప్రజల్లోకి వారు చొచ్చుకొనిపోయి, వాళ్లకు దీనివల్ల ఉపయోగము ఇది, దీనివల్లకలిగే వచ్చేలాభము ఇది, అనే టటువంటిది చెప్పలేకపోతున్నారు. ప్రజలకు ఈ విధముగా మేలుకలుగుతుంది అని Agricultural Department చెప్పలేక పోతున్నది. దీనినిగురించి ప్రభుత్వము ప్రత్యేకంగా శ్రద్ధతీసుకోవాలి. ఈనాడు Agricultural Department సాధించిన ఫలితాలను ప్రజలమధ్యకు తీసుకు రావాలి. ఈసిద్ధాంతాన్ని అమల్లోపెట్టాలి, ఈ విధముగా చేసుకోవాలి, అని ప్రజలకు చెప్పకపోవడం చాలాప్రమాదమైన పరిస్థితి. ప్రజలుమాత్రము దానియొక్క తత్వము తెలుసుకోలేక చాలా అపోహపడుతున్నారు. ఈశాఖను గురించి నాకు తెలిసినంతవరకుకూడా చెబుతాను. ఎక్కడఅయినా ఒక Agricultural Demonstrator office వున్నదంటే, మామూలుగా అక్కడ వున్నటువంటి డిమానుస్ట్రేటరుగాని, మేస్త్రీలుగాని గ్రామాలకువెళ్లి రైతాంగానికి ఏమీచెప్పడము లేదు. 25,30 ఎకరాలు వున్న పెద్దపెద్ద రైతులువుంటే వాళ్ల ఇళ్లదగ్గరకూర్చొని ఉన్నటువంటి పరిస్థితులు వాళ్లకు చెప్పివస్తున్నారు గాని గ్రామాలలోకి వెళ్లి ఒక్కొక్కరినిపిలచి, లేక రైతులందరిని కూడగట్టి, ప్రజలందరిని దగ్గరకు పిలచి, ఈ విధముగా చేయాలి, ఈ విధముగాచేస్తే ఉపయోగములు వున్నాయని చెప్పుట లేదు. ఏవిధముగా చేయాలో ఒక్క Agricultural Demonstrator చెప్పడంలేదు. ఈ విధముగా చేస్తున్నారని నాకు ఏ విధముగాను నమ్మకము లేదు. అందుచేత ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొని రైతు లందరికి వారి లోపాలను బోధన చేయవలసిన అవసరము ఎంతైనా ఉన్నదని చెబుతున్నాను పండ్లరీసెర్చిస్టేషను ఆంధ్రదేశములో కోడూరులో ఒకటి వుంది. ఈనాడు ప్రభుత్వము దానికి బడ్జెటులో కేటాయించిన డబ్బు 34 వేలు మాత్రమే. ఈ research station కడపజిల్లాలో ఉంది, అదేవిధముగా విశాఖజిల్లా, శ్రీకాకుళంజిల్లా మెట్టప్రాంతాలు, మామిడితోటలు, ఇతర పండ్లను పండించేప్రాంతాలు వున్నాయి. ఆ ప్రాంత

[26th July 1955 [SRI K. V. S. Padmanabha Raja]

ములలో ఇంకొక స్టేషనుకూడా ఏర్పాటు చేయాలని ప్రభుత్వముదగ్గరకు ఇదివరకు మెమోరాండములు పంపడము జరిగింది. ఈ రోజున ప్రత్యేకముగా మన వ్యవసాయ శాఖ మంత్రిగారు మన ముఖ్యమంత్రిగారే కొబ్బరి దాంట్లో ప్రత్యేకమైన శ్రద్ధతీసుకొని రీసెర్చిస్టేషనులు ఏర్పాటుచేస్తారని ఆశిస్తున్నాను. కేటాయించిన మొత్తము చూస్తే చాలా : తక్కువగా వున్నది. 34 వేలు దీనికోసము కేటాయించారు. ఈవిధముగా బడ్జటులో మాత్రము దీనికి చాలా ప్రాధాన్యము ఇవ్వలేదు. ఇప్పుడైనవారు సర్దుకొని, ఇంకా ఎక్కువ కేటాయించాలని కోరుతున్నాను. మన రాష్ట్రములో అనకాపల్లిలో ఫారము పెట్టారు. ఈ వేళ ఫారములలో వుత్పత్తి అయ్యేటటువంటిది చాలా తక్కువ. ఆఫారమ్సుకు మనము ఎంత expenditure పెట్టామో దానిమీద ఎంత పంటవస్తున్నదో అనే విషయం అలా వుంచండి. ఫారమ్సులో సాధించిన ఫలితాలను ప్రజలకు చూపించాలనే దృష్టితోనే ఆఫారమ్సుపెట్టి వాటిని అభివృద్ధి చేస్తున్నాము. ఈ ఫారమ్సుమీద జరుగుతున్నటువంటి expenditure ఎంత ? ఏమైనా అభివృద్ధిసాధిస్తున్నారా ? మనకు ఇచ్చినటువంటి లెక్కలనుబట్టి చూస్తే అది ఏమాత్రములేదు. అందుచేత ఈ ఫారమ్సు ఇంకా అభివృద్ధిచేయాలని మంత్రిగారిని నేను కోరుతున్నాను. ధరలు పడిపోతున్నాయి. ఇది అందరూకూడా ఒప్పుకొన్నవిషయము. ధరలు పడిపోయేందుకు కారణము ఏమిటి ? ఏ విధముగా ఈ రైతులకు మార్గము చూపించాలో ఆలోచించండి. పన్నులు వేయడానికి మాకు అభ్యంతరము లేదు. ధరలు పడిపోకుండా చేయండి. మార్కెటింగ్ సొసైటీలలో ఫెసిలిటీస్ కలుగచేయాలి. వాటివల్ల ఉపయోగము చాలా ఉన్నది. మార్కెటింగు ఫెసిలిటీస్ లేకపోవడమువల్ల రైతులు బాధపడుతున్నారు. సామాన్యంగా మెట్టప్రాంతములో వేరుశనగ,గంటి పండిస్తారు. అక్కడ ఎవరో ఒక షావుకారు. ఆ పంటలను తక్కువ ధరలకు తీసుకుపోవడము జరుగుతోంది.

(At this stage the Mr. Deputy Speaker occupied the chair.)

ఈ ధరలు పడిపోయినందువల్ల చాలా ఇబ్బందిగా ఉన్నది. అందుచేత ఈ మార్కెటింగ్ సొసైటీస్‌ను నెలకొల్పి, ప్రతిజిల్లాలోనుకూడా రెండు కేంద్రాలు నిర్మించాలని వారిని నేను కోరుతున్నాను. దానికి తక్కువగా కేటాయించారు. మార్కెటింగు ఫెసిలిటీస్ 37, 800 రూపాయలు కేటాయించినట్లు చూపించారు.

SRI K. V S. Padmanabha Raja] [26th July 1955

ఇది చాలా తక్కువనుకుంటాను. మొత్తముమీద మార్కెటింగ్ ఫెసిలిటీస్‌కు 37,800 రూపాయలు చూపించడంజరిగింది. మంత్రిగారు చెప్పినట్లు ఇది చాలా ప్రధానమైన డిమాండు. దీనికి చాలా ప్రాధాన్యతఇచ్చి ప్రతిజిల్లాకుకూడా మార్కెటింగ్ కేంద్రాలు చేసేందుకు చాలా శ్రద్ధవహిస్తారని ఈ agricultural demand కు వారు సరియైన ప్రాధాన్యత ఇస్తారని విశ్వసిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Mr. SPEAKER :— ఈ డిమాండులో agriculture, fisheries రెండు ఉన్నాయి. ఆ విషయముల మీదనే మాట్లాడవలసిడింది. 1½ గంటల వరకు మాత్రమే చర్చ, తరువాత మంత్రిగారుమాట్లాడుతారు. కొబట్టి క్లుప్తముగా సభ్యులందరు మాట్లాడవలయును.

Sri V. V. KRISHNARAJA BAHADUR :—అధ్యక్షా! ప్రస్తుతము యీ Agricultural Demand ను బలపరస్తున్నాను. నా ముందు మాట్లాడిన ప్రతిపక్ష్యసభ్యుని సూచనలు చాలవరకువర్తమాన పరిస్థితిని తెల్పుచున్నప్పటికి నేనుకూడా కొద్దిగా మాట్లాడ దలచుకున్నాను. ప్రస్తుతము Agricultural Department ఎట్లున్నదో చూడండి ప్రతిచోట demonstrator's office లు పెట్టడము జరిగింది. ప్రభుత్వమునకు ఖర్చు ఎక్కువకావడముతప్ప రైతులకు ఏధముగానూ వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుటలేదని మనవిచేస్తున్నాను. సాధారణముగా విత్తనములు వేసేరోజుల్లో విత్తనములు demonstrators యిస్తున్నారు. కాని అనుకొన్న మొక్కలకంటె అనేకరకములైన మొక్కలు మొలుస్తున్నవి. విత్తనముల విషయములో తగు శ్రద్ధ చూపించడములేదు. అంతే కాకుండా విత్తనములు వేసేటప్పుడు రైతులు 2 రూపాయలు 3 రూపాయలు కూలియిచ్చుకోవలసి వస్తున్నది. చాలా విత్తనములు అమ్మినట్లు వారిలెక్కలలో అగుపిస్తున్నవిగాని తేడా విత్తనములు కొనుక్కొనడంవల్ల రైతులు నాట్లు వేసుకొనే time కు అనేకరకాల మొక్కలు మొలుస్తున్నవి. అందువల్ల రైతులకు వ్యవసాయములో ఉత్సాహము కొద్దిగా తగ్గుచున్నదని మీ notice కు తీసుకువస్తున్నాను. అది కాకుండా Central Government ద్వారా loans యిస్తున్నారు. సాధారణముగా ఇప్పటివరకు ఏమి జరుగుచున్నదంటే· రైతులలోకానికి seeds

యివ్వటములోగాని, agricultural loans యివ్వడములోగాని లేదా Ammonium Sulphate, సరఫరా చేయడములోగాని విత్తనముల కాలములో loan యివ్వకుండా తరువాత ఇవ్వడమువల్ల రైతులకు సద్వినియోగము కావడములేదని నేను మనవి చేస్తున్నాను. ఆ విషయములో రైతులేకాకుండా ప్రజానీకముకూడా అర్జీలద్వారా తెలియజేశారు. ముఖ్యముగా వ్యవసాయముద్వారానేకదా మానవ సమాజమునకు ఆరోగ్య విజ్ఞాన సంపత్తి కల్గుచున్నది. తద్రూపేణా దేశ సౌఖ్యమునకు అది ఆధారము. పుష్కలమైన పంటలు పండి ఆ పంటను పుచ్చుకొన్నప్పుడు తగిన ఆరోగ్యసంపత్తి కలుగుతున్నదన్న విషయము నేను చెప్పనక్కరలేదు. మన దేశము ముఖ్యముగా వ్యవసాయక దేశమని మనము వింటున్నాము. మనదేశమును ఇతరదేశములతో పోల్చి చూస్తే మనదేశములో పశువులు చాలతక్కువ. పశువులు వ్యవసాయమునకు చేదోడు వాదోడుగాఉండి అన్ని విధాల ఉపయోగపడుచున్నవి. Scientific basis గా వ్యవసాయముచేయడము మనదేశములో అందరకూఅందుబాటుకాదు. అట్టి పరిస్థితులలో వ్యవసాయముతోపాటు పశుగణాభివృద్ధికూడా చాలా అవుసరము గనుక దాని అభివృద్ధికితగిన చర్యలు తీసుకొనవలసినదిగా కోరుచున్నాను. పూర్వకాలములో రఘు మహారాజు, విరాటుడు, శ్రీ కృష్ణభగవానుడు పశుగణాభివృద్ధిచేసి తద్రూపేణా దేశ వ్యవసాయికముగానూ ఆర్థికముగానూ రైతాంగమునకు ఎంత సహాయపడ్డది వింటున్నాము. యీ రోజులలో జనాభా పెరిగిపోయింది. కొండల వరకు వ్యవసాయము చేస్తున్నాము. పశువులకు ఏవిధంగాను పచ్చికబైళ్లు లేకపోవడమువల్ల పశువులు కృశించి పోవుటవల్ల రైతులు వ్యవసాయము చేయుటకు తహతహలాడుచున్నారు. పశువులకు పచ్చిక బీళ్లు లేకపోవడమువల్ల పాడిపంటలు లేకపోవడమువల్ల దేశములో ప్రజలకు ఆరోగ్యము చెడిపోవుటయు జరుగుచున్నది. అదిగాక ఈనాడు బిడ్డలకు పాలుకుబదులు ఇంగ్లాండునుంచి ఆస్ట్రేలియానుంచి పాల డబ్బాలు తెప్పించి ఇక్కడ స్తన్యము ఇచ్చుచున్నాము అంటె ఎంత సిగ్గుచేటు. కనుక ఈ విషయమై తగుశ్రద్ధ తీసుకొనవలసినదిగా కోరుచున్నాను. దేశము అభివృద్ధి కావాలి.వ్యవసాయకంగా ముందుకు పోవాలి అన్నట్లయితే పశుగణాభివృద్ధి తప్పక అవుసరము. పూర్వము ప్రతిగ్రామములోనూ గ్రామభూమిలో 1/10 వంతు, పశువులకు పచ్చికకు కేటాయించేవారు; అదీగాక గ్రామస్థలములలో 8 వ వంతు. పశువులు స్వేచ్ఛగా తిరుగుటకై కేటాయించేవారు; ఇప్పుడు జనభా పెరుగుటవల్ల వాటికి చోటు దొరుకుటలేదు. అట్టి పరిస్థితులలో పశువుకు పసరములేనప్పుడు ఆధి

Sri V. V. Krishnamraju Bahadur] [26th July 1955

ఎట్లు అభివృద్ధిచెందును. ఇంతవరకు రైతు వ్యవసాయమునకు డబ్బులేక వడ్డీకి షావుకార్ల నుండి తీసుకొనివచ్చి పంటపండించి మరల వానికి డబ్బు చెల్లించుట జరుగుచున్నది గాని దాని సత్ఫలితాన్ని రైతు పొందలేక పోవుచున్నాడు. కనుక Marketing societies ప్రతిగ్రామములోను పెట్టి రైతులకు సహాయము చేయవలసినదిగా కోరుతున్నాను. Marketing facilities ఉంటేగాని రైతుకు లాభము కలుగదు. అదికాకుండా scientific basis మీద భూమి స్వభావము తెలుసుకొనవలెను. ఇప్పుడు ఎరువులు ఇస్తున్నారుగాని వారు ఎందుకుఇస్తున్నారో వీరు ఎందుకుపుచ్చుకుంటున్నారో అర్థము కావడము లేదు. ఏ భూమికి ఏ ఎరువు వేసినట్లయితే ఏ భూమికి ఏ పంటలువేసిన బాగాపండునో ముందరతెలుసుకొని తద్విధముగా మనమువేసిన మన రైతాంగమునకు ఎక్కువ లాభము కలుగును. కనుక గవర్నమెంటువారు ఈవిషయమై తగు శ్రద్ధవహించి భూమినిపరీక్షించి భూమిలోని ఫ్రాస్ఫేట్సు ఏమి లోపంఉన్నది, అందుకు ఏ ఎరువువల్ల భూమి ఫలవంతమయ్యేది అందుపైని ఏ ఫలసాయము రైతు రాబట్టగలడో అన్న పరిశోధన చేసినగాని వ్యవసాయము వృద్ధినొందదు అని మనవి చేస్తూన్నా ఉపన్యాసము యింతటితో ముగించుచున్నాను.

*Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా! ఈ వ్యవసాయ వస్తువు ధరలు క్రమంగా పడిపోవుచున్నవని రైతులలో ఆందోళనగా ఉన్నది. ఈ సందర్భములో కనీసము ఆంధ్రలో పండే వాణిజ్యపంటలకైనా హెచ్చుధరలు పెట్టుటకు అవసరమైన ప్రణాళికలను ప్రభుత్వము ఏవైనా అమలుబరచనున్నదేమో తెలుసుకొనవలె ననుకొంటిని. కాని ఈ వివరములు ఏవీ సభ ముందుకు రాలేదు. ఈ సందర్భములో 1,2 సూచనలు ప్రభుత్వమునకు చేయుచుంటిని. మన ఆంధ్రలో ఉల్లిపాయలు మిరపకాయలు చాలా విశేషముగా పండుచున్నవి. దేశము మొత్తముమీద చూచినట్లయిన ఆంధ్రకు సంబంధించినంతవరకు ఎగుమతి విరివిగా చేయడానికి అవకాశములు లేకుండా ఉన్నది. దురదృష్టవశాత్తు మనము నిన్న మొన్నటివరకు-మద్రాసులోకలసి ఉండడమువల్ల మన ఉల్లిపాయలు మిరపకాయలు మద్రాసువెళ్ళి అక్కడనుంచి మాత్రము ఎక్కువగా సిలోన్ ఇంకా యితరవిదేశాలకు పంపబడుచున్నవి. అందువల్ల భారతప్రభుత్వము విదేశాలకు కోటాలు నిర్ణయించడములో ఎగుమతివ్యాపారము చేసినవాళ్ళను దృష్టిలో పెట్టుకొని పండిస్తున్న ఆంధ్రను చాలవరకు నిర్లక్ష్యముచేసినదని చెప్పవలెను. అయితే చాలా తీవ్రమైన ఆందోళనచేసినతరువాత గత సంవత్సరం ఉల్లిపాయలకు, మిరపకాయలకు కొద్దిగా export కోటాలు యిచ్చారు కాని చాలినంతగా ఇవ్వలేదు. ఈవేళ మదరాసుకు సంబంధించినంతవరకు వారికి చాలినంత ఉల్లి, మిరప పండడములేదు. వారి అవుసరములకు ఆంధ్రలోపండిన ఉల్లిపాయిలను

26th July 1955] [Sri Pragada Kotaiah]

మిరపకాయలను ఉపయోగిస్తున్నారు. కాని వాటి export కోటా ఎక్కువగా నున్నది. ఆంధ్రకు export కోటా తక్కువగానున్నది. ఈ విషయమై మనము ఇండియా ప్రభుత్వముమీద తగినంత ఒత్తిడితెచ్చి పంటల దామాషా ప్రకారము మనకు export కోటా యిచ్చేందుకు ఆంధ్రప్రభుత్వము. కృషిచేస్తే తప్పనిసరిగా ఈ రెండు వాణిజ్యపంటలు పండించేవారికి మరికొంత ప్రతిఫలము ఉంటుంది. ధరలు కూడాకొంతవరకు పెరిగి రైతులు లాభించవచ్చునని అభిప్రాయపడుచున్నాను. మరొక ప్రధానమైన పంట వేరుశనగ. ఇది చాలా ముష్కిలీలో ఉన్నది. పంట విశేషముగా పండినప్పటికి ఇక్కడ డాల్డా కంపెనీల ప్రయోజనముకొరకు, సబ్బు ఫ్యాక్టరీల ప్రయోజనముకొరకు ఎగుమతులు చాలవరకు నిషేధించబడినవి. కాని వేరుశనగకు ప్రభుత్వము సరియైనధరలు నిర్ణయించడములేదు. ఆ విధముగా నుండుట వల్ల ఈ డాల్డాకంపెనీలు, సోపుఫ్యాక్టరీలు చాలాతక్కువ ధరలు quote చేసి రైతులకు న్యాయముగా రావలసిన ధర రాకుండా చేయుచున్నారు. అందువల్ల మన డాల్డా కంపెనీల అవసరమేమిటో, సబ్బుఫ్యాక్టరీల అవసరము లేమిటో తెలుసుకొని అదనముగా ఉంటే Government ఎగుమతిచేయుటకు అవకాశములు కల్పించవలెను.

రైతులకు జరిగే అన్యాయం వివరించాలంటే ఉదాహరణ ఒకటి చెబుతాను. సబ్బుల ధరలు మనకు సాధారణంగా తెలుసును. ఎప్పుడూ ఎగుడుదిగుళ్లు వుండవు. సబ్బుముక్క ధర ఆరణాలు వుంటుంది, మణుగు వేరుశెనగనూనె రు 9 లు వున్నపుడు కూడా సబ్బుముక్క ధర 6 అణాలే వుంటుంది తప్ప వేరుశెనగ ధరలలో వుండే హెచ్చుతగ్గులనుబట్టి Soap factories వాళ్లధరలు తగ్గడంలేదు. ఈ పరిస్థితులలో పెట్టుబడిపెట్టి వ్యాపారం చేసేవారికి లాభాలు సంపాదించేవిధానం కాకుండా రైతులకు ప్రయోజనం వుండేట్లు వారికి ధరలు రావడంలో కాని export quotas నిర్ణయించటంలో కాని ఆంధ్రప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధతీసుకోవాలి అని మనవిచేస్తున్నాను. రైతులు చాలా కాలంగా ఆందోళన చేస్తున్నారు. Oil-cake, విత్తనాలమీద విపరీతమైన export duty వున్నది. ఇవి టన్నుకు రు 125 లు లగాయితు రు 350 లు వరకు వున్నాయి. అందువల్ల విదేశాలలో ధరలు సరిగ్గా రావడంలేదని రైతుల ఆందోళన. ఈ ఆందోళన గుర్తించి రైతులకు సరియైన ధర రావడానికి వాణిజ్యపంటలమీద export duty కొంతవరకు తగ్గించడానికి ఆంధ్ర ప్రభుత్వం ఇండియా ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకురావాలని నేను కోరుతున్నాను. చాలా దురదృష్టమైన విషయం ఏమిటంటే గోగునార పండించేవారి విషయం. మొత్తందేశంమీద 130 వేల ఎకరాలలో గోగునార పండుతోంది. ఇందులో

[SRI Pragada Kotaiah] [26th July 1955

120వేల ఎకరాలు ఆంధ్రదేశంలో వున్నది. ప్రధానంగా శ్రీకాకుళం, విశాఖపట్నం గుంటూరుజిల్లాలలో వున్నది. జనపనార ఎగుమతిచేయడానికి అవకాశంవున్నది. దానితో కలిపి గోగునార ఎగుమతిచేయడానికి అవకాశం లేకుండాచేశారు. ఎందు కంటే ఇక్కడవుండే ఫ్యాక్టరీవాళ్లు వీలయినంత తక్కువ ధరకోసము, జనపనార విశేషంగా వున్నది కాబట్టి గోగునార విశేషంగాలేదు కాబట్టి జనపనారపరిమితంగా ఎగుమతిచేయవచ్చును, గోగునార ఎగుమతి చేయడానికి వీలులేదని పెట్టుబడిదారుల వర్గం భారతప్రభుత్వంమీద ఒత్తిడితీసుకురావడంవల్ల గోగునార ఎగుమతులుమీద నిర్బంధాలు వుండడంవల్ల రు. 750 లు వుండేది ఈవేళ రు. 150 లు వరకు దిగజారి పోయింది. దీనివల్ల శ్రీకాకుళం, విశాఖపట్నం, గుంటూరుజిల్లాలలోవున్న రైతులకు ఎంతకష్టం కలుగుతుందో గమనించి జనపనార తోపాటు గోగునారకూడా ఎగుమతి చేయడానికి మనప్రభుత్వం శ్రద్ధతీసుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను. మరొకవిషయం, మనదేశం అన్నపూర్ణ అని చెప్పవచ్చును. ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకు చాలా విశేషంగా ధాన్యాన్ని పండిస్తున్నాము. కాని ఈ బియ్యానికికూడా సరిఅయిన ధరలు రావడంలేదని ఆందోళనవున్నది. దీనికి ఒక కారణం చెబుతున్నారు. బర్మానుంచి ఇతర ప్రాంతాలనుంచి భారతప్రభుత్వం దిగుమతి చేసుకుంటున్న బియ్యాన్ని wheat ను మనకుకూడా పంపుతున్నారు. ఆ బియ్యాన్ని ఆంధ్రకు పంపడంవల్ల మనకు కావలసినంత ధరలు రావడంలేదని రైతులవాదం. ఈ విషయంలో ఇండియా ప్రభుత్వానికి కొన్ని సాధకబాధకాలు వుండవచ్చును. ఇంతకన్న వారిదగ్గరనుంచి రాబట్ట వలసినడబ్బును రాబట్టుకునేదానికి మరొకమార్గం లేక ఈ బియ్యాన్ని బియ్యం విశేషంగా వాడే ఆంధ్రదేశానికి విశేషంగా పంపక ఏమిచేయాలనవచ్చును. రావలసిన డబ్బును క్రమక్రమంగా 10 సంవత్సరాలు కాలంలో మరొకమార్గంలో రాబట్టే పద్ధతిని అవలంబించి మనకు బియ్యం దిగుమతివచ్చే అవకాశం లేకుండావుంటే ఆంధ్రలో వడ్లుపండించే రైతులకు లాభంకలుగుతుందేమో ముందు పరిశీలిస్తారు అని విజ్ఞప్తి చేస్తున్నాను. Chemical manures సింద్రీ ఎరువుల ఫాక్టరీనుంచి 70 వేల టన్నులు వస్తున్నాయి. Pool price టన్ను రు. 315 లు చిల్లరగా రైతుకు రు. 345 లు చొప్పున అమ్ముతున్నాము. అంటే మధ్యలో రవాణా, sales-tax, tender firms, retailer కుకలిపి టన్నుకు రు. 30 లు లాభంవస్తోంది. రు. 30 లలో విశేషం మద్రాసులోవుండే tender firms కు వెడుతుంది. వారు మన రాష్ట్రంలో చిన్న dealers ను పెట్టుకొని రైతులకు అందచేస్తున్నారు. టన్నుకువుండే రు. 30 లులో రు. 15 లు యితరులకు మినహాయించిన tender firms కు వచ్చే రు. 15 లు ప్రభుత్వమే ప్రధానమైన agent గా వుండి అవసరమైనచోట చిన్న ఏజెంట్లను నియమించి పంపకంచేస్తే ప్రభుత్వానికి

26th July 1955] [SRI Pragada Kotaiah]

ఆదాయం వస్తుంది. దానికి పెట్టుబడిలేకుండా కావలసిన పెట్టుబడి Agricultural Director allot చేయడంవల్ల చిన్నవర్గాలదగ్గరనుంచి వస్తుంది. వచ్చినఎరువులను ప్రభుత్వానికి godownsలేకుండా చిల్లరవర్తకులవారి godownలో delivery తీసుకొనవచ్చును. రాష్ట్రప్రభుత్వం వేరే godowns కు పెట్టుబడి పెట్టవలసిన అగత్యం లేదు. టన్నుకు రు. 10,15 లు లాభం వుంటుంది అనుకున్న దాదాపు 10 లక్షల రూపాయలులాభం రావడానికి అవకాశం వుంటుంది. ఎక్కడా మోసాలు జరుగడానికికూడా అవకాశం లేకుండా పోతోంది. ఈ 70 వేల టన్నులు అమోనియం సల్ఫేటును, tender firms యివ్వడం తగ్గించివేసి, రాష్ట్రప్రభుత్వం చిన్నవర్తకులద్వారా ఆయా ప్రాంతాలకు ఏర్పాటుచేసి పంపకంచేస్తే ఒకవైపు రైతులకు అన్యాయంలేకుండా అందుబాటుగావశమే కాకుండా ప్రభుత్వానికికూడా షుమారు 10 లక్షల రూపాయలు ఆదాయం వస్తుంది. ఈ విషయాన్నికూడా ప్రభుత్వం పరిశీలించాలని కోరుతున్నాను.

ఇంక fisheries వున్నాయి. వీటిగురించి చాలా శ్రద్ధగా చెబుతున్నారు. Social Welfare Department వారిని అడిగితే చేపలుపట్టేవారంతా మేము సహాయంచేసే తెగవారంటారు. వారందరికి సహకారసంఘాలు పెట్టడం, తరువాత వాటినిర్మాణం, నిర్వహణ యావత్తు co-operative department కు సంబంధించింది. ఎక్కడైనా చేపలు పట్టుకోవాలంటే ఆ విషయం రివెన్యూడిపార్టుమెంటుకు సంబంధించింది. అచ్చటచ్చట వారికి చేపలుపట్టుకునేదానికి అవకాశం ఇస్తున్నారు. దానికి కావలసిన ఉత్తరువులుకూడా జారీచేసినమాట యదార్థం. కాని ఉత్తరువులు అమలుచేయడంలో చాలా సాధకబాధకాలు వస్తున్నాయి. ఒక సహకారసంఘము ఒక పంచాయితీబోర్డులో చేపలుపట్టుకునేదానికి రు. 300 లు rental value కట్టి, చేపలు పట్టుకునేదానికి గ్రామానికివెళ్లి ప్రయత్నంచేస్తే గ్రామాలలోవుండే బలవంతులు చెరువులో దిగకుండా కొట్టివేస్తున్న సందర్భాలు వున్నాయి. ఈ సందర్భాలు ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చినా, ట్రెజరీలో కట్టిన రు. 300 లు తిరిగి ఇవ్వడంకాని, లేదా చెరువులో చేపలు పట్టుకునేదానికి అవకాశం కల్పించడంకాని ప్రభుత్వం చేయలేకపోయింది. ఇటువంటి సందర్భాలు ప్రభుత్వదృష్టికివస్తే ప్రత్యేకమైన శ్రద్ధతో పేదవాళ్లకు అపకారం జరగకుండా చేయాలి. సముద్రప్రాంతంలో అనేకమంది జాలరులు చాలా నికృష్టంగా బ్రతుకుతున్నారు. చేపలు వాళ్లు పడుతున్నారు. దళారీలు దానిపై లాభాలుసంపాదిస్తున్నారు. వారికి సహకారసంఘాలుపెట్టి, లారీలను ఇచ్చి, వారుపట్టిన చేపలను బస్తీలలో అమ్మి న్యాయమైన ధరలు వచ్చేట్లుచేయాలి. వారు సరిఅయిన జీవితాలు సాగించడానికి ప్రభుత్వం అవకాశం కల్పించాలి. జాలరుల బిడ్డలకు 10 మందికి చదువులు చెప్పించి. నంతమాత్రాన, నలుగురికి scholarships ఇస్తున్నాం అన్నంతమాత్రంచేత పేదు

[SRI Pragada Kotaiah] [26th July 1955

సముద్రప్రాంతంలోవున్న లక్షలాది జాలరుల జీవితాలలో ఏమీ మార్పు వుండదు అని ప్రభుత్వం గుర్తించాలని మనవిచేస్తున్నాను. Forests గురించి సాధారణంగా చాలా పెంపకం చేస్తున్నాం అంటున్నారు.

Mr. DEPUTY SPEAKER :—అది వేరే డిమాండు.

Sri B. SANKARAIAH :—అధ్యక్షా! ఈ వ్యవసాయ డిమాండుమీద మాట్లాడడానికి మనకు 1952-53 report యిచ్చినారు కాని 1953-54—1 54-55 reports యివ్వలేదు. అందువల్ల దీనినిబట్టి చూచినపుడు ఇదివరకుకంటె కూడ అనేకవిషయాలలో యీ ప్రభుత్వము వ్యవసాయముమీద శ్రద్ధతీసుకోవడము లేదని తెలుస్తున్నది. గ్రామీణ జనాభా ఒకకోటి డెబ్బైమూడులక్షలు. దానికి సరిగా ఒకకోటిడెబ్బైమూడులక్షల ఎకరాలు సాగుబోతుంది. అటువంటప్పుడు చాల వెనుక బడిన మన ఆంధ్రరాష్ట్రము అభివృద్ధికావాలంటే వ్యవసాయము ఎంతో అభివృద్ధి కావలసివుంటుంది. వ్యవసాయము అభివృద్ధికావాలంటే మేలురకపు విత్తనాలు కావలసియున్నవి. దీనికిగాను ఒకలక్ష రూపాయలుకూడ కేటాయించారని బడ్జట్టును బట్టి తెలుస్తున్నది. జపానుపద్ధతి చాల పెద్దఎత్తున ప్రచారము జరుగుతున్నది. జపాను పద్ధతి అమలుచేయాలంటే దానికి చిన్నచిన్న పనిముట్లు కావాలి. దీనికిగాను బీద రైతులకు సహాయముచేయుటకు బడ్జట్టులో ఏమాత్రము కేటాయించలేదు. మంత్రిగారు సమాధానము చెప్పుతూ ఏ మాత్రము సహాయముచేయము అన్నారు. అదనంగా రైతుకు కొంత ఖర్చు బోతుంది. రైతులకు కొంతఅయినా సహాయముచేస్తే ఎక్కువ మంది రైతులకు వ్యవసాయము అభివృద్ధిచేయడానికి జపానుపద్ధతి అవలంబించడానికి వీలువుంటుంది. ఇపుడు మనదేశములోని yield ప్రక్కనవున్న దేశాలతో పోల్చినపుడు చాల తక్కువ అని చెప్పవలసియుంటుంది. కనుక దీనిని అభివృద్ధి చేయనిది ముందుకు పోలేము. ఇప్పుడు పంటచూస్తే సగటున ఎకరానికి 8½ బస్తాలు పండుతుంది. అదేప్రక్కనవున్న Egypt కూడ పెద్దగా అభివృద్ధిఅయిన దేశము కాదు. కాని అక్కడ ఎకరానికి 28½ బస్తాలు పండిస్తున్నారంటే మనకు వాండ్లకు ఎంత తేడావుందో తెలుస్తుంది. ఆ స్థాయికి మనముపోవాలంటే ప్రభుత్వము శ్రద్ధ తీసుకుంటేనే పోగల్గుతాము. ఈ విషయము వ్యవసాయవిషయము కాబట్టి అది controversial ఈ దీని విషయములో కాదు. ప్రభుత్వము చాల నిర్లక్ష్యముగా వుండిఅని తెలియజేయకతప్పదు. ఇప్పుడు ఎరువులు చాల ముఖ్యమైనవి. మన ఆంధ్రదేశములో అన్ని రాష్ట్రాలలోకంటే చాల ఎక్కువగా రసాయన ఎరువులు వాడుతున్నారని ప్రభుత్వానికి లెక్కలద్వారా తెలుసు. అటువం టప్పుడు ఇదివరకు సింధ్రి Factory నుంచి కేటాయించినపుడు బస్తా రు. 35 లు

26th July 1955]                                                  [Sri B. Sankariah

చోప్పున అమ్ముతున్నారు. ఎప్పుడైతే విదేశాలనుండి కేటాయించారో అప్పటినుండి బజారులో sulphate బస్తాను రు. 40 రూపాయలకు అమ్ముతున్నారు. ఈ విధముగా ఎరువుల విషయములో యింత నిర్లక్ష్యముచేసినట్లయితే ఈ season దాటిపోయినట్లయితే రైతు నష్టపడుతారు. క్రిష్ణా గోదావరి జిల్లాలలో seasonలో ఎరువులు యివ్వకుంటే తర్వాత యిచ్చికూడ ప్రయోజనములేదు. నెల్లూరుజిల్లా లో కేసరి ఒక short-term పైరు. దానికి కూడ సకాలములో ఎరువులుయిస్తేనే ఉపయోగమువుంటుంది. ఎరువులకుగాను లక్షరూపాయలు అప్పుకూడ కేటాయించారు. అప్పుయివ్వడములోకూడ రసాయనిక ఎరువులు కొంటేనే ఆ అప్పునుయిస్తామనిఅంటారు. రసాయనఎరువులు ఒక భాగము వాడినట్లయితే అంతకన్న యితర ఎరువులు రెండురెట్లు, కొన్నిచోట్ల 3 రెట్లు మరికొన్నిచోట్ల 4 రెట్లు వాడవలసివుంటుంది. కొన్నిచోట్ల కేవలము మెట్ట పొలాలకు రసాయన ఎరువులు వాడడానికి వీలులేదు, అటువంటిచోట్ల యితర ఎరువులు వాడడము అవసరమౌతుంది. అటువంటపుడు చాల వెనుకబడిన ప్రాంతలలో రసాయన ఎరువులు వుపయోగించుటకు ఆ ప్రాంతాలవారు ఈ ఎరువులక్రింద అప్పులు తీసుకోనే దానికికూడ వీలులేకుండ వుంది. ఈ విధముగా ఎరువులను కొనడానికి కేటాయించిన డబ్బు సకాలములో వాండ్లకు అందచేయనందువల్ల అన్నిరకాల ఎరువులు కొనడానికి అవకాశము లేక వ్యవసాయము అభివృద్ధిచేయడానికి అది ఏ మాత్రము తోడ్పడ కుండాపోతున్నది. ఇక ఈ ఎరువులలో అనేకరకాలు వున్నాయి. అన్నిరకాల ఎరువులు కొనడానికి అవకాశము లేనందువల్ల వ్యవసాయము అభివృద్ధి చేయడానికి ఏమాత్రము తోడ్పడకుండా పోతున్నది. ఎరువులలో అనేక రకాలున్నాయి. Green manures వున్నాయి. వాటికి తగిన సదుపాయము ఎక్కడ కూడ లేదు. Demonstrator office లో గాని Agriculture office లో గాని దానికి తగిన విత్తనాలు తెప్పించి సప్లయి చేసే సౌకర్యము ఎక్కడ కల్పించడము లేదు. సత్యనారాయణగారు తన special report లోనే ఈ విషయం గురించి సూచించారు. ఈ అప్పులు ఇప్పుడు రకరకాలుగా కేటా యిస్తుంటారు ; దానివల్ల రైతులకు చాల యిబ్బందులున్నాయి. ఈ అప్పులు వ్యవసాయ Department ద్వారానే యివ్వాలి ; రివెన్యూవాండ్లకు అనేకపనులు వున్నందున యీ అప్పులు యివ్వడములో చాల ఆలస్యమౌతున్నది. కనుక రైతుకు సంబంధించిన అప్పులన్నికూడ వ్యవసాయ డిపార్టుమెంటుద్వారానే యివ్వాలని సత్యనారాయణగారు సూచించారు. 1935 లో సూచించిన సూచనలుకూడ ఇప్పటికి ప్రభుత్వమువారు అమలు జరుపలేదు. దానిమీద ఏమిచెప్పారో తరువాత కూడ యీ Report లో తెలియజేయలేదు. ఈ విధంగా అమలు జరుపబడివపుతే రైతుకు కావలసిన అన్ని రకాలైన అప్పులు వ్యవసాయ డిపార్టుమెంటు

[26th July 1955 [Sri B. Sankaraiah]

ద్వారా తీసుకోనడానికి రైతులకు సాధ్యమౌతుంది. ఇప్పుడు ప్రతిసంవత్సరముకూడ ప్రభుత్వము అప్పులిచ్చే విషయములో సామాన్యరైతుకు ఎంతఅందింది అనేది ప్రతి సంవత్సరపు లెక్కలు తీయవచ్చును. 10 ఎకరాలలోపలవున్న రైతులకు ఎంత యిచ్చారు, 5 ఎకరాలలోపున ఉండేవారికి ఎంతయిచ్చారు, 10 ఎకరాలపైన, వున్నవారికి ఎంత యిచ్చారో లెక్కవేస్తే 100-కి 95 పాళ్లు పెద్ద రైతులు తీసుకోవడము జరుగుతున్నదని తెలుస్తున్నది అందులో Revenue Department క్రింద వచ్చేటటువంటివన్నీ ఆ విధంగా జరిగినవి. వ్యవసాయ పనిముట్లకు pump-sets కు డబ్బు యిస్తున్నారు. pumpsets కొనకుండా బావులు త్రవ్వకుండా అప్పులు తీసుకోనబడినవి అనేకమున్నాయి. సత్యనారాయణగారు యిదివరకు యిచ్చిన 1953 సం॥ Report లో వ్యవసాయానికిగాను రైతులకు marketing సదుపాయాలు కలుగజేయడము చాలముఖ్యమని సూచించారు. ఇది ఒక పొగాకుకే వుండేది. ఇప్పుడు కోకోనట్ కుకూడ కాకినాడలో ఏర్పరచినట్లు ఇదివరకు రిపోర్టులో తెలిసింది. మన ఆంధ్రదేశములో అన్నిటికన్న చాల ఎక్కువ భాగము పండించేటటువంటివి ధాన్యము, millets అని ప్రభుత్వానికి తెలుసు. అటువంటివాటికి marketing సౌకర్యాలు లేనపుడు ప్రయోజనంఏమిటి? ఈ సంవత్సరము మా జిల్లాలో నా అనుభవముతోనే చూచినాను, కేసరి ఆరోజు రు 150 లు రు. 160 లు మార్కెటుధర వున్నాకూడ, గ్రామాలలో చిన్న చిన్న రైతులు 80 రూపాయలకు అమ్ముకోవలసివచ్చినది. ఈ విధముగా రూపాయికి రూపాయి లేదవుండే పరిస్థితులలో రైతు సరియైన rate రాబట్టుకోలేకుండ వున్నాడు. ఒక ప్రక్కన దేశవ్యాప్తముగా అనేక వ్యవసాయపంటలకు ధరలు తగ్గిపోయి రైతులు దివాలాఎత్తే పరిస్థితిలోవుంటే దానిని గురించికూడ ప్రభుత్వము ఏమిశ్రద్ధ తీసుకోలేదు. సామాన్య రైతుపండించేపంటలకు marketing సదుపాయాలు లేనందువల్ల రైతులు నష్టపడుతున్నారు.

1.00 p.m.

ఇప్పుడు పత్రికలలో ఏరోజుకారోజు ఏధరఉన్నదీ ప్రతిరోజూ దినపత్రికలలో "విపణివీధి" అని ప్రకటిస్తూ ఉన్నారు. ఆంధ్రదేశంలో పండేపంటలను గురించికాని, వాటిధరల విషయంగాని ఏమాత్రమూ శ్రద్ధతీసుకోరు. ఉదాహరణకు ఒకరోజు పత్రిక తీసుకునిచూస్తే తెలుస్తుంది. ఇప్పుడేదో sugar అంటారు, టికట్స్ అంటారు, ఆఖరుకు Newyork దూది ధరతో అది అంతమైపోతుందన్న మాట. మన ఆంధ్రదేశంలో పండించేటటువంటి ప్రధానమైనటువంటి పంటలకు

26th July 1955] [Sri B. Sankaraiah.]

ధరలు ఎట్లాఉన్నాయి? ఆ రకంగా ప్రకటించడానికి ప్రభుత్వం తగినసౌకర్యాలిచ్చినప్పుడే ప్రతిరైతూ తెలుసుకోటానికి అవకాశంఉంటుంది. అదే విధంగా ఇప్పుడు Radio లో ప్రతిరోజూ వార్తలు చెబుతూయుంటారు. ముఖ్యంగా రైతులకు కావలసిన ధరలను గురించి ఇప్పుడు గ్రామస్థులకార్యక్రమం అని ప్రత్యేకం కేటాయించారు. 7-15 ఐనతరువాత 15 నిముషాలు ఆకార్యక్రమం ఉంటుంది. ఆ కార్యక్రమంలో ఏరోజూకూడా ఆ ధరలవిషయం చెప్పనే చెప్పరు. ఎప్పుడో ఒక రోజు చెప్పడం లేక పోతే పూనెయ్యడం జరుగుతోంది. అదేవిధంగా లక్షలమంది రైతులకు నీటి విషయం ఆందోళనగా ఉంటుంది. Krishna ఆనకట్టమీద ఎంత నీరు ఉంటుందో ఏ 15 రోజులకో నెల రోజులకో ఒకసారి చెబుతారు. ఇది లక్షలమంది రైతులకు సంబంధించిన విషయం ప్రతి గ్రామంలోని రైతులూ కాలవలకు ఎంతనీరు వస్తుందోనని ఆందోళనపడుతూ ఉంటారు. ఇది ఏ 10 మందికో 100 మందికో, వేలమందికో సంబంధించిన విషయమైతే చెప్పను. ఇది లక్షలమందికి సంబంధించిన విషయం. Marketing విషయం నీటి విషయం ఇవన్నీ రైతులకు చాలా ముఖ్యమైన విషయాలు. ఉదాహరణకు radio లో చూద్దామని పోతే 7-15 నుంచి మన రాజేశ్వరరావుగారి ప్రసంగం ప్రసారమున్నది. ఆ విధంగా గ్రామస్థుల కార్యక్రమానికి 15 నిముషాలు ఇస్తే దాన్నికూడా ప్రభుత్వం హరింపచేసి గ్రామస్థులకు అసలు ఏమాత్రం సౌకర్యం కల్గకుండా పోతోంది. ఆ 15 నిముషాలు రైతులపంటలకు సంబంధించిన విషయాలకు కేటాయించండి. ఆవిధంగా Radio లో గాని, పత్రికలలో గాని సౌకర్యాలు కల్గజేస్తే బాగుంటుంది. అదేవిధంగా ఇదివరకు సత్యనారాయణగారి report లో ప్రతి firka లోనూ ఒక demonstrator, దానికి తగిన హంగామా ఉంటేనే అది develop అవుతుందని వ్రాశారు. కాని firka కు ఒక demonstrator అయినా లేరు. ఏ తాలూకాలోనో ఉంటారు. Firka కు కేటాయించిన మేస్త్రీకి, విషయాలన్నీ నేర్చుకొని రైతులకు పంటలు ఎట్లా పండించాలో, ఏవీ పొలానికి ఏ ఎరువు వెయ్యాలో, ఇవన్నీ చెప్పేమేస్త్రీకి 20-30 రూపాయల జీతపు scale పెడితే, ఆయన ఏమి చదువుకుని రైతులకు ఏమి చెబుతాడు? ఇప్పుడు భద్రాచలంలో విచారిస్తే అక్కడ కోయలను పెడతారట. కోయలను పెట్ట కూడదని కాదు. పెట్టాల్సిందే వారికి special training ఇవ్వాలి. ఏమి తెలియనటువంటివారు రైతులదగ్గరకు పోయి వ్యవసాయాన్ని గురించి చెబితే ఎవరు నమ్ముతారు? వీరికికూడా వ్యవసాయం తెలుసునని చెబుతారు. ఆ విధంగా 30 రూపాయిలు పెట్టడంవల్ల వ్యవసాయం అంటే తెలియనివాళ్ళను

[SRI B. Sankaraiah.] [26th July 1955

తీసుకోవలసి వస్తోంది. అటువంటప్పుడు ప్రతిదానికీ డబ్బులేదని చెబుతారు. పోలీసు department కు ఇచ్చినదానిలో నూడవ భాగమైనా, ఈ వ్యవసాయ department కు కేటాయించలేదు. ఒక్కొక్క department విడివిడిగా చూసినా వీరి జీతం. తక్కువే పోలీసు department కు ఇచ్చిన దానిలో నూడవ భాగం కూడా కేటాయించకపోవడం, ఈ demonstration మేస్త్రీలని రైతులకు తెలియచెప్పేవారికి 20, 30 రూపాయిలు scale పెట్టడం అంటే, ఇది వ్యవసాయాభివృద్ధిచేయటానికి ఎంత మాత్రం పనికిరాదు. కాబట్టి దానికోసం ప్రభుత్వం ఇప్పుడు అయినా పునరాలోచించుకుని దీనికి తగినంత సొమ్ము కేటాయించి, వ్యవసాయాన్ని అభివృద్ధిచేయడానికి ఇచ్చిన సూచనలు ఆలోచించవలసినదని కోరుతున్నాను.

* SRI N. RAMULU :—ఉపాధ్యక్షా ! మనదేశంలో వ్యవసాయపరిశ్రమ అతిప్రధానమైనది. మనదేశ జనాభాలో 100 కి 75 మంది వ్యవసాయపరిశ్రమ మీద ఆధారపడి జీవిస్తున్నారు. మనదేశం అభివృద్ధి పొందాలంటే వ్యవసాయ పరిశ్రమను అభివృద్ధిచేయాలి. అందుచేత మనదేశ అభివృద్ధికి మనం మార్గాలు అన్వేషించి నిర్ణయించడంలో సామాన్య ప్రజానీకాన్ని దృష్టిలో పెట్టుకుని నిర్ణయించాలని కోరుతున్నాను. ఇప్పుడు సామాన్య రైతాంగపరిస్థితి ఏవిధంగా యున్నది? పేదరికమే ప్రారబ్ధంగా నెంచి అనేక కష్టాలనుభవిస్తూ యున్నారు. సామాన్యరైతాంగం తనకుండే కొ స్తభూమిమీద రాత్రిం బగళ్లు ఆలుబిడ్డలతో చెమటఓడ్చి కష్టించినను తగిన ప్రతిఫలం పొందలేకుండా ఉన్నారు. ఇక irrigation సదుపాయం లేకుండా తతిమాసౌకర్యాలు లేకుండా తాను ఎంత కష్టపడినను ప్రతిఫలం ఏమున్నది? తాను పండించే పంట తన కుటుంబ పోషణకు చాలదు. ఇక అతను చెల్లించవలసిన శిస్తులు, ఇతరత్రా కావలసిన అవసరమైనఖర్చులనుగురించి ప్రతిఏటా అప్పులపాలు కావలసియున్నది. గిట్టుబాటులేని ఈ వ్యవసాయపరిశ్రమను మాని ఇంకోపరిశ్రమమీద బ్రతకాలంటే ఇంకోపరిశ్రమ ఏమీలేదు. అందును గురించి అతను తప్పనిసరిగా ఈవ్యవసాయ పరిశ్రమమీద నే ఆధారపడవలసియున్నది. సామాన్యరైతాంగం తమ లాభనష్టాలతో నిమిత్తం లేకుండా శ్రమించి జీవించడమే పరమావధిగా నెంచి తమ కాయకష్టాన్నంతా ఈ వ్యవసాయ పరిశ్రమకేననూ, వినియోగించినను, దానివల్ల ఫలితంపొందలేకుండా అష్ట కష్టాల పాలగుతున్నారు.అందును గురించే ఈపరిశ్రమకు అన్నివిధాలా సహాయసంపత్తులు చేయాలని కోరుతున్నాను. ఈపరిశ్రమలో అనేక ఇక్కట్లున్న సంగతి ప్రభుత్వానికి తెలుసు. ఇది గిట్టుబాటులేని వ్యవసాయపరిశ్రమ, ధరలు పడిపోకుండా చేసిననాడు వీటినిగురించి ప్రభుత్వం తగినశ్రద్ధ తీసుకున్ననాడు ఈ పరిశ్రమ అభివృద్ధిపొందగలదు.

ఆ దృష్టితో ప్రభుత్వంవారు తలపెట్టిన ఈ భూసంస్కరణవిధానం నిర్ణయింపబడ గలదు అనేదానిలో సందేహంలేదు. ప్రభుత్వంవారు ఈనాడు రైతాంగానికి కావలసిన మంచివిత్తనాలు మొదలైన సౌకర్యాలు కల్పించాలని నేను ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. ఈనాడు ప్రభుత్వంవారు ఇస్తూఉన్న విత్తనాలు సామాన్య రైతాంగానికి ఏవిధంగానూ అందుబాటు కావడంలేదు. మేలురకం విత్తనాలు ప్రభుత్వంవారు సామాన్య రైతాంగానికి ఏగ్రామంలో ఎంతెంతమందికి ఎంతెంత కావాలో గ్రామోద్యోగస్థులవల్ల సేకరించి వాటిని సప్లయిచేయాలని కోరుతున్నాను. ఇక ఎడతెరిపి లేకుండా ఒకేప్రదేశంలో పంటలుపండించడంవల్ల భూమినిస్సారమై పోతూఉంది. రసాయినిక ఎరువులు తదితర ఎరువులు ఈభూములకు వాడితే మరి కొంత పంటపండే అవకాశమున్నమాట వాస్తవమే కాని సామాన్యరైతుకు తగినంత ఆర్థికస్తోమతు లేకపోవడంవల్ల కావలసిన ఈ రసాయనిక ఎరువులు, తదితరఎరువులు black market లేటుకు కొనలేకుండాపోతూయున్నాడు. అందునుగురించి ప్రభుత్వంవారు సామాన్యరైతాంగానికి కావలసిన అన్నిరకములైన ఎరువులూ వారిఇంటికి పంపేటట్లు చేయాలని కోరుతున్నాను. రైతుకుకావలసిన ఇనపసామానులు తదితర పనిముట్లధరలు విపరీతంగాపెరిగిపోయినవి. తాను అమ్మే ఆహారధాన్యాలధరలు విపరీతంగా పడిపోయాయి. అందువల్ల రైతు తనకుకావలసిన పనిముట్లు కొనుక్కోడానికి తగినంత ధనం లేకపోవడంవల్ల వ్యవసాయ పరిశ్రమ కుంటుపడిపోతోంది. కాబట్టి ప్రభుత్వంవారు ఏరైతుకు ఎన్నెన్ని వ్యవసాయపరికరాలు అవసరమో ఆ వెలలు గ్రామోద్యోగులవల్ల సేకరించి వాటిని సక్రమంగా Co-operative సంస్థల ద్వారానో లేక ఇతర సక్రమమైన పంథాలోనో సప్లయిచేయాలని కోరుతున్నాను. ఇంక loans ను గురించి ఈపద్దుక్రింద చర్చింపకపోయినాకూడ వాటినిగురించి కొంత మనవిచేస్తున్నాను. ఈనాడు ప్రభుత్వంవారు బండి పశువులు కొనుక్కోడానికి కొంత అప్పిస్తున్నారు. ఆ అప్పు సామాన్యరైతుకు ముట్టడంలేదు. ఏదో ఉద్యోగస్థులదగ్గరకువెళ్ళి నాలుగుమాటలుచెప్పి సంపాదించకల్గినవారికే అది చేకూరుతోంది. అది సామాన్యరైతాంగానికి అందేటట్లు, గ్రామాలలో ధరఖాస్తులుపెట్టేవారి ఆర్థికస్థోమతు ఏమిటని విచక్షణగా తెలుసుకుని సామాన్యరైతుకు ఆ loan అందేటట్లు ఉత్తరువులు జారీచెయ్యాలని కోరుతున్నాను. ఇంక ధరలనుగురించి రెండుమాటలు చెబుతాను. ఈనాడు ప్రభుత్వంవారు ఎన్నివిధాల సహాయం చేసినప్పటికీ, రైతు ఎంత కష్టపడి పండించుకున్నప్పటికీ, తాను పండించే పంట తనకు లాభసాటిగా ఉండకపోయినంతకాలం, వ్యవసాయపరిశ్రమలో తాను అభివృద్ధి కాజాలడు. అందువల్ల వ్యవసాయపరిశ్రమ అభివృద్ధికావాలంటే రైతు పండించేపంటకు గిట్టుబాటయ్యే

SRI N. Rāmulu] [26th July 1955

ధరలు నిర్ణయించేపద్ధతి అమలుజరిపి ధరల స్థిరీకరణకు యత్నించేయవలెనని కోరుతున్నాను. విత్తనాలు నాటినరోజునుంచీ పంట ఇంటికిచేరేవఱకూ రైతు అనేక బాధలకు గురి అవుతున్నాడు. అతివృష్టి, అనావృష్టి గాలివాన మొదలైన కష్టాలకు రైతాంగం గురై పండినపంట చేతికిరాకుండాపోతూంటే, ఆ బాధలు నివారించుటకు రైతు నష్టపడకుండాయుండుటకు పంటల insurance పద్ధతి అమలుజరిపి రైతాంగానికి మేలు చెయ్యాలని కోరుతున్నాను.

SRI T. LAKSHMINARAYANA REDDI :—ఉపాధ్యక్షా, నేటి Budget లో ఉన్నటువంటి ఈ Demand ను, కలకాలంగా రైతు వ్యవహారములలో అనుభవంఉండి మా జిల్లా రైతునాయకుడైనటువంటివారు ప్రవేశపెడుతారేమో అని ఆశించాను. కాని విధివైపరీత్యముగా అది జరుగలేదు. ఏమైనప్పటికి ఈ డిమాండును నేను బలపరుస్తున్నాను. ఇది చాలా ప్రధానమైనటువంటి డిమాండు అనడానికి సందేహంలేదు. మన ఆంధ్రదేశములో నూటికి 75 మంది వ్యవసాయము మీద బ్రతుకుతున్నారని మనందరికి తెలుసు. కనుక ఇది ఎంతప్రధానమైన సమస్యో మనం ఊహించుకోవచ్చును. నేను ఈరోజు ఒక పుస్తకము చదువుతూఉంటే అందులో ఈ వాక్యమున్నది—"You are lucky if you are a farmer, for we are living in the most excited period of agricultural history" ఇది అమెరికాలో రైతులగురించి చెప్పబడింది. కాని ఈదేశములో రైతులయొక్కస్థితి వ్యతిరేకముగాయున్నది. "In india to be a farmer is a curse" అని చెప్పవలసియుంటుంది. ఎందుచేతనంటే, ఇక్కడ రైతుకు ఏవిధమైనటువంటి రక్షణలేదు. విపరీతమైన శిస్తు భారముతోను రోజురోజుకు పడే పన్నుల భారముతోను కృంగిపోతుఉంటాడు. వ్యవసాయంతప్ప వేరే ఆధారముండదు. ఇప్పటికి కూడ మనదేశములో వ్యవసాయాన్ని "It is a gambiing in rain అని అనుటకు ఏమి సందేహంలేదు. కాని స్వతంత్రం వచ్చినతరువాత మనము నీటిపారుదల బాగుచేసుకొంటున్నాము. అనేకమైనటువంటి Irrigation projects కట్టుకొంటున్నాము. కాబట్టి ఇక్కడకూడ మనస్థితి బాగుపడుతుందని చెప్పవచ్చును. నీటి సౌకర్యము విషయం అట్లుండగా రైతుకు అదనంగా కావలసింది. Intensive cultivation మొదలుపెట్టాము. ఎరువులు అవి ప్రధానమైన స్థానాన్ని ఆక్రమించాయి. అందుచేత మన సింద్రి Factory లో ఎరువులను మనము కావలసినంత supply చేసుకొంటున్నప్పటికీ, ఆంధ్రలోకూడ బెజవాడలో ఒక

26th July 1955] [SRI T. Lakshminarayana Reddi

ఎరువుల factory తప్పనిసరిగా కావలసివస్తుందని ప్రభుత్వము గుర్తిస్తుందనే నేను అనుకొంటాను. ఇకపోతే, రైతుకు కావలసింది rural credit. మన Imperial bank ఈ rural credit విషయంలో చాలా కృషిచేస్తున్నది. ఈ విషయంలో కూడ కొద్ది కాలములో మనకా కష్టముపోతుందని అనుకొంటాను. తరువాత మనకు Imperial Council of Agricultural Research అని ఒక Research society చాలాకాలంగా సిమ్లాలో పనిచేస్తున్నది. కాని అక్కడ ఏమి Research జరుగుతున్నదో ఆ వ్యవహారమంతా రైతులకు అందుబాటులో లేదు. దీని propaganda చాలా లోపభూయిష్టంగా ఉన్నందువల్ల, ఆవిషయాలు రైతులకు అందడం లేదు. కొబట్టి మనం ఇక్కడకూడ Agricultural Research station పెట్టి, దాని ఫలితాలను రైతులకు అందేటట్లు ముఖ్యంగా చూడవలసియున్నది. అనకాపల్లిలో ఒక sugar cane research station ప్రభుత్వము స్థాపించబోతున్నారని ఈ బడ్జెట్ డిమాండులో ఉన్నది. ఇది చాలా సంతోషకరమైనటువంటి విషయము. అటువంటివి అనేక research stations ఆంధ్రలో చాలా అవసరము. ఈ విషయములో ప్రభుత్వము శ్రద్ధతీసుకోవలసియున్నది.

తరువాత, మనం land reforms ఏవీ తీసుకునిరాకుండా, ఈవిధంగానే ఉన్నట్లయితే ఎన్నటికికూడ మనం రైతాంగానికి మేలుచేయలేమని అనుకొంటాను. ఎందువల్లనంటే, ఏదైనా గాని, తన భూమిని బాగుచేసుకోవాలనిగాని, ఫలవంతం చేసుకోవాలనిగాని ప్రయత్నం చేయాలంటే, ఆభూమితనది అని గుర్తించినప్పైతేనే ఆ పని ఉత్సాహంతో ఇష్టంతో చేయగలడుగాని ఏ భూమినో, ఎవరిభూమినో చేసుకొమ్మంటే, దానిమీద ఉత్సాహం చూపించి దానిని ఫలవంతం చేయజాలడు. అందుచేత మనం ఈ Land Reforms అతిత్వరగా తీసుకునిరావలసిన అవసరం ఉన్నదని మనవి చేస్తున్నాను. తరువాత ఇప్పుడు రైతులకు ఉన్నభూమికూడ చాలా scattered గా 4, 5 చోట్ల వేరువేరుగా ఉండడంచేత వ్యవసాయం చక్కగా జరగడంలేదు. కొబట్టి రైతుకు ఒకేచోట తన భూమిఅంతా ఉండేవిధముగా, అటువంటి facility కలుగచేయడానికిగాను, ఏదైనా legislation చేయడానికి కూడ ప్రయత్నం చేయవలసియుంటుంది. ఇదివరకు అటువంటి ప్రయత్నాలు జరిగాయి, కాని ఈమధ్యన జరిగినట్లు కూడలేదు. కనుక ఈవిషయంలో ప్రభుత్వము శ్రద్ధతీసుకొని రైతులయొక్క భూములను ఏకఖండాలుగాచేసి, వారిని ఆవిధంగా ఉత్సాహపరచాలని కోరుతున్నాను. తరువాత ఇంకొక ముఖ్యమైన విషయాన్నిగురించి చెప్పదలచుకొన్నాను. నేను agricultural prices చాలా

[Sri T. Lakshminarayana Reddi] 26th July 1955]

బాధకరంగా ఉన్నాయి. పంటలు బాగాపండాయిఅని సంతోషించేటప్పటికి, ధాన్యం ధరలు పడిపోవడంవల్ల ఆ సంతోషంలేకుండాపోతున్నది. ఈనాడు మనం ఇంకా ఎక్కువగా intensive cultivation చేసేకొలది, ఎక్కువపంటలు పండించే కొలది, రైతులకు లాభములేకుండానే పోతున్నది. కాబట్టి ఈ విషయం గురించి తప్పనిసరిగా ఇప్పటినుంచిఅయినా గట్టిప్రయత్నంచేసి ఒక నిర్దుష్టమైన వ్యవహారం చేసుకోకపోతే, రైతుకు ఎంత మాత్రం క్షేమకరంగా లేదని మనవిచేస్తూ ఇంతటితో సెలవు తీసుకొంటున్నాను.

* SRI. C. V. SURYANARAYANA RAJU :—ఉపాధ్యక్షా, మన వ్యవసాయశాఖ మంత్రిగారు (ముఖ్యమంత్రిగారు) ఈ రోజున ఈ డిమాండును మన ముందుపెడుతూ, ఇదిచాలా ముఖ్యమైనదనిన్నీ, ఈవిషయంలో సభ్యులందరు సహకరించి సరియైన సలహాలు ఇస్తే అవి ప్రభుత్వము ఆ చరణలో పెడుతుందనిన్నీ చెప్పారు. అందుకు చాలా సంతోషించవలసియున్నది. ఈ సందర్భమున కొన్ని విషయాలు వారి దృష్టికి తీసుకురాదలచాను. ఇప్పుడు ప్రతితాలూకాకు ఒక agricultural demonstrator ఉన్నాడు. కాని ప్రభుత్వము ఆ demonstrator ను ఏ విధంగా ఉపయోగిస్తున్నారని చూచినట్టయితే, అతడు రైతుకు ఉండవలసినంత సహాయంగా లేడని చెప్పవలసియున్నది. ఈ నాడు ఈ demonstrators కు ఎరువులు అమ్మడం, పనిముట్లు అమ్మడం లేక విత్తనాలు అమ్మడంమొదలైన పనులు పెడుతూ, ఇంకా చాలా cash dealings కూడ వారిమీద పెట్టారు. దీనివల్ల ఈ demonstrators ఎక్కువశైము బయటికిపోయి రైతులకుతగిన సలహాలు ఇవ్వ లేకుండా పోతున్నారు. అందుకు వారికి వీలులేకుండా పోతున్నది. ఎప్పుడైన వ్యవసాయం విషయంలో, ఏదైనా తెలియపరిస్తే వారితో ఆవిషయం చెప్పినప్పుడు, నాకేదో sales ఉన్నాయి, treasury కి పోయి డబ్బుకట్టి రావలసియుంటింది, అని వ్యతిరేకంగా చెప్పుతూ ఉంటారు. అందుచేత ఈ cash dealings, demonstrators నుంచి తప్పించి, దానికి ఇంకొక agency ఏర్పాటుచేస్తే బాగుంటుందని వారికి సలహా ఇస్తున్నాను.

తరువాత Engineering Department అని Agriculture కు సంబంధించి ఒకకొత్త department పెట్టినారు. వీరిదగ్గరనేమో oil engines ఉంటూన్నాయి. Industrial Department లో, Boring sets ఉన్నాయి. Boring sets ఉన్నప్పుడు, oil engines ఉండవు. Oil Engines ఉన్నప్పుడు boring sets ఉండవు; అవి ఒకమారు ఇస్తున్నారు, ఇవి ఒక మారు ఇస్తున్నారు. అవి రెండు

26th July 1955] [Sri C. V. Suryanarayana Raju]

కలిపి Industrial Department లో పెట్టిన బాగుంటుంది, లేక Engineering Department లో పెట్టినా బాగుంటుంది.

THE HON. SRI B. GOPALA REDDI:—Agricultural Department లోనే పెట్టడానికి నిశ్చయించారు.

SRI C. V. SURYANARAYANA RAJU :—చాలా సంతోషం. తరువాత మూడవది sugar cane cess fund కు రమారమి 6 లక్షలవరకు వసూలు చేసినారు. టన్నుకు ఒకరూపాయచొప్పున పుచ్చుకుంటున్నారు. ఆదే cess విధించే టప్పుడు, ఆ డబ్బు చెరకు అభివృద్ధికోసము, sugar factory ఉన్న area లో ఎక్కువరోడ్లు అభివృద్ధిపరచడంకోసము వినియోగింపబడుతుందని చెప్పారు. కాని ఈ బడ్జెటులో చూస్తే ఏదో Central Government నుంచివచ్చిన డబ్బును దీని కొరకు డబ్బుఖర్చు పెడుతున్నట్లు ఉన్నదేగాని వీరు టన్నుకు రూపాయచొప్పున వసూలుచేసిన డబ్బును ఖర్చుపెడుతున్నట్లు కన్పించదు. ముఖ్యంగా ఇప్పుడు Sugar Factory Reserve Area అంటూ కొంత area పెట్టారు. దీన్నిగురించి చాలా మంది ఈ మధ్యన మంత్రిగారివద్దకు deputation వచ్చారు: దాన్నిగురించి కొంత చెప్పవలసియున్నది. ఆంధ్రదేశములో Sugar Factory ప్రారంభించి 10,12 సంవత్సరము లైంది. ఇంతవరకు చాలామంది, 10,12,20 మైళ్లు దూరము నుంచి కూడవచ్చి Factory కి చెరకు ఇచ్చేవారు. ఇప్పుడు బెల్లము ధర పడి పోయింది. పంచదారకు ధర చాలాఉన్నది. చెరకుకు మాత్రం ధర ప్రభుత్వంవారు నిర్ణయిస్తారు. కొబట్టి దగ్గరగా, 2,3 మైళ్లలో ఉన్నటువంటి గ్రామస్థులు ఎక్కువ చెరకు పండించి Factory కి supply చేస్తున్నారు. దీనివలన 10,14 సంవత్సర ములనుంచి చెరకు supply చేస్తున్న గ్రామాలను పూర్తిగా తప్పించి, Factory చుట్టు 2,3 మైళ్లలో ఉన్న గ్రామాలను ప్రభుత్వమువారు Reserve Area క్రింద పెట్టారు. అది న్యాయం కాదేమో అని నా ఉద్దేశము. మొట్టమొదటనుంచి చెరకు supply చేసిన వాళ్లచేతనే చెరకును ఈ Factory కి supply చేయించవలసిందిగా కోరుతున్నాను. ఈరోజు చెరకుకు ఎక్కువధర ఉన్నదనిచెప్పి Factory కి చుట్టు 2,3 మైళ్లుమాత్రం reserve area క్రిందపెట్టి మిగిలిన areas ను వదలిపెట్టడం న్యాయంకాదు. అంతేగాక sugar cane cess fund అని 6,7 లక్షల రూపాయలు ఈ Factory area లో వసూలుచేస్తున్నారు. అందులో కనీసం, రెండులక్షల రూపాయలైనా రోడ్ల development కన్నా, sales development కన్నా ఉపయోగిస్తే బాగుంటుందని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

[SRI P. Rajagopala, Naidu] [26th July 1955

1-00 p. m.

SRI P. RAJAGOPAL NAIDU :— ఉపాధ్యక్షా, వచ్చే అయిదు సంవత్సరాలలో వ్యవసాయ ఉత్పత్తిని రెండురెట్లుచేయాలనే కృతనిశ్చయముతో యీ ద్వితీయపంచవర్ష ప్రణాళికను రచిస్తున్నసమయములో వ్యవసాయశాఖను నడిపించటానికి రెవిన్యూ డిపార్టుమెంటునుంచి డైరక్టరును తీసుకోవడముమంచిది కాదని నాసలహా. ఎందుకంటే వ్యవసాయశాఖను నడపాలంటే వ్యవసాయాన్ని అభివృద్ధి పరచాలంటే agricultural expert గా వున్నవారిని డైరక్టరుగా పెట్టినట్లయితే చాలా బాగావుంటుంది. ఇంతేకాకుండా వ్యవసాయాన్ని అభివృద్ధిచేయవచ్చు.

రెండవది యేమిటంటే, వ్యవసాయాభివృద్ధి కాకుండాపోవటానికి ప్రచారము తక్కువకావడం ప్రత్యేక కారణము. Agricultural demonstrators అందరిని ఆఫీసులలో కూర్చుండబెట్టి యినుపముక్కలను ఎరువులను అమ్మించే ఉద్యోగము వారికి అప్పగించారు. ఈ demonstrators ను అందరిని గ్రామాలలో ప్రత్యేకంగా ప్రచారము చేయడానికి వెళ్లనిస్తే చాలా బాగావుంటుందని నా ఉద్దేశ్యము.

మూడవది, మార్కెటింగుశాఖనుకూడా బలపరచవలసియున్నది. ఈనాడు మార్కెటింగు డిపార్టుమెంటు అభివృద్ధిచేయాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నది. మార్కెటింగుశాఖలో నియమింపబడుతున్న ఉద్యోగస్థులందరుకూడా Agricultural demonstrators యే కాని Agriculture Colleges లో తరిఫీదుపొందటానికి మార్కెటింగు ఒక ప్రత్యేక subject గా లేకపోవడమువల్ల, మార్కెటింగులో తరిఫీదుపొందిన ఉద్యోగస్థులు యీనాడు మార్కెటింగుశాఖలో లేకుండా వున్నారు. మన Agricultural Minister గారు Education కు కూడా Minister గా వున్నారుగనుక Agricultur e Colleges లో మార్కెటింగు కూడా ప్రత్యేకంగా ఒక special subject గా పెట్టించాలని కోరుతున్నాను. ఆవిధంగాచేస్తే మార్కెటింగుశాఖ అభివృద్ధికావటానికి, శక్తివంతం చేయటానికి వీలుంటుంది.

ఇక నాల్గవది manure sales అంటే, ఎరువులు యివ్వాలని చెబుతున్నారు. ఎరువులు ఏభూమికి ఎంత వేయవలెనోగూడా ప్రజలకు తెలియకుండాపోతూవున్నది. దానికి కారణమేమిటంటే భూములవిషయములో soil survey చేయలేదు. అది చేయవలసివున్నది. ఇంతవరకు మన రాష్ట్రములో soil survey చేయించటానికి ప్రభుత్వము ప్రయత్నము అయినా చేయకపోవడము చాలా విచారకరము. ఈ మధ్య national requirements of manuring ఎంత కావలసివుంటుంది అనే

26th July 1955] [SRI P. Rajagopala Naidu]

ఆలోచనచేసినప్పుడు యీసంగతి గ్రహిస్తే మనకు వచ్చింది. తరువాత అది యే basis మీద, ఎరువులు ఎంత కావాలి అనేవిషయము నిర్ణయించడము కష్టసాధ్యమై పోయింది. ఏభూమికి ఏ ఎరువులువేయాలి అనేది తెలియకపోవడమువల్ల రైతులు బాలాచిక్కులుపడవలసివస్తున్నది. అందువల్ల soil survey చేయించటానికి ప్రభుత్వమువారు ప్రయత్నించడము చాలా మంచిది. దానితో బాటు, subsidy schemeను ప్రవేశపెట్టారు. బావులుత్రవ్వినప్పుడు ఎక్కడెక్కడ ఎంతెంత లోతులో నీరు వుంటుందో తెలియకుండా రైతులు చాలా నష్టపడి చిక్కులుపడుతున్నారు. ఎక్కడెక్కడ పాతాళగంగపడుతుంది, ఎక్కడెక్కడ under current వుంటుంది, అనే వాటినికూడా ప్రభుత్వము సర్వేచేయించటానికి పూనుకోవాలి. ఇటువంటి సర్వే చేయించడము చాలా మంచిది. Tractors, bulldozers ఉపయోగించడము చాలా మంచిది. తెలియక అవి పూరకనే పడివున్నవి. వాటిని వుపయోగించడము చాలాకష్టముగావున్నది. ఎందుకంటే, యివి వుపయోగించటానికి మనకు సరిగా training అయిన drivers లేరు. ఇవి నడిపే drivers మనకు తగినంతమంది లేకపోవడమువల్ల, యివి సాధారణముగా దినమునకు ఆరుగంటలు పనిచేయవలసినవి, కనీసము రెండు గంటలయినా పనిచేయటానికి, డ్రైవర్లు లేనందువల్ల, వీటిని వుపయోగించి వాటి ఫలితము, వుపయోగము మనకు లభించడములేదు. ఈ tractors నుంచి; bulldozers నుంచి కనీసము average పనికూడ తీసుకోటానికి వీలుకనబడలేదు. అందువల్ల మనకు tractors, bulldozers నడపడానికి తగినంతమందికి training యిప్పించి, drivers గా తయారుచేసుకుంటే, అప్పుడు competition పెరిగి సమర్థులైన drivers మనకు చిక్కటానికి అవకాశాలు వుంటాయి. ఇది జరగకపోతే, ఎన్నోవేలరూపాయలు ఖర్చుపెట్టికొన్నటువంటి యీ bulldozersను, tractors ను వుపయోగించుకోటానికి వీలులేకుండా మూలపెట్టవలసిన పరిస్థితులు కలుగుతున్నాయి. ఈవిధంగా వున్నట్లయితే అవి చెడిపోయి ఎందుకుగూడా పనికి రాకుండా పోతాయి. కొన్ని పగిలిపోవడంకూడాకద్దు. అందువల్ల ముందు మనము drivers కు training యిప్పించి ready గా వుంచుకోవాలి. లేకపోతే Tractorsను bulldozers ను కొన్న సొమ్ము అంతా వృథాయే. రైతులపిల్లలలో కొంతమందికి training యిప్పించాలి. లేకపోతే యివి ఉపయోగించటానికి వేరుమార్గము లేదు. ఈ మధ్య హైదరాబాదులో యువకులుగా వున్నవారికి ఒక వారమో, రెండు వారాలో training యివ్వటానికి agriculture మీద పాఠములు చెప్పించుచున్నారు. రైతుపిల్లలను జిల్లాకేంద్రాలకు, తాలూకాకేంద్రాలకు గ్రామకేంద్రాలకు పంపించి short-term courses నేర్పించుచున్నారు. వాళ్లకు వ్యవసాయము మీద పాఠాలు చెప్పించుచున్నారు. అదేవిధంగా మన రాష్ట్రంలోగూడా రైతుపిల్లలకు

[Sri P. Rajagopal Naidu] [26th July 1955

training యిప్పించడము చాలా అవసరమని చెబుతున్నాను. మన రాష్ట్రములో నీటిపైర్లు మెట్టపైర్లు వేస్తూంటారు. వ్యవసాయానికి కావలసిన వివరాలు పుస్తకాలలో ప్రభుత్వమువారు ప్రచురింపజేసి గ్రామాలలో పంచిపెట్టాలి. మన రాష్ట్రములో మెట్టవ్యవసాయము విషయములో తగినంత శ్రద్ధతీసుకోవడము లేదు. మాగాణిప్రదేశాలలో ఒకే రకమైన వరిపంటవేస్తూంటారు. బొంబాయి రాష్ట్రములో ఎక్కువగా మెట్టవ్యవసాయం విషయములో పరిశోధనలు చేశారు. కరపత్రాలు అచ్చువేయించి రైతులకు గ్రామాలలో పంచిపెట్టుతున్నారు. మన రాష్ట్రములోగూడా కరపత్రాలద్వారా వ్యవసాయాభివృద్ధికొరకు ప్రచారముసాగింపచేయాలి. మనది వ్యవసాయరాష్ట్రము కాబట్టి, వ్యవసాయమే మనకు ప్రధానమైనదని భావించాలి. మెట్టవ్యవసాయముకొరకు మనము ఎక్కువగా కృషిచేయాలి. ఒక్క విషయముమాత్రము ముఖ్యంగా గమనించాల్సి వున్నది. మెట్టవ్యవసాయము చేస్తే, కలుపుమొక్కలు పల్లేరుకాయలు ఎక్కువగా వుంటాయి. పల్లేరుకాయలవల్ల, కలుపుమొక్కలవల్ల పైర్లు ఎంతో నష్టపడి పోతున్నవి. వీటిని నాశనముచేయటానికి ప్రభుత్వము పూనుకోవాలి. Technical experts చేత పల్లేరుకాయల నిర్మూలనకు మందు విషయమై research చేయించాలి. బాపట్ల కళాశాలలో పల్లేరుకాయల నిర్మూలనకు పరిశోధనలు జరుపుతున్నారు. Research పూర్తి అయినతరువాత పల్లెరుకాయలను నిర్మూలన చేయడానికి మందు కనిపెట్టి, దానిని గ్రామసీమలలో రైతులకు అందజేయాలి. దీన్నిగురించి ఎక్కువగా ప్రచారముచేయాలని కోరుతున్నాను. మరొక విషయము యేమిటంటే, కూరకాయలు పెంపకము హెచ్చుచేయాలి. టైములేనందున యింతటితో ముగిస్తున్నాను.

SRI D. SREERAMAMURTHI :— ఉపాధ్యక్షా, మనదేశము సుభిక్షంగా వుండాలంటే ఎక్కువగా వ్యవసాయాభివృద్ధికి ప్రభుత్వము తోడ్పడాలని కోరుతున్నాను. ఎట్లా తోడ్పడాలంటే, సామాన్యరైతులకు అందుబాటుగా రైతులకు సప్లయిచేయటానికి దగ్గరప్రాంతాలలో కొన్ని factories నిర్మించినవారికి కావలసిన వస్తువులు, ఎరువులు అందజేయాలి. Agricultural loans యివ్వాలి. ఎద్దులు, బండ్లు తక్కువధరలకు ప్రభుత్వము సప్లయిచేయాలి. ప్రతితాలూకాను ఒకవ్యవసాయ కేంద్రంగా చేసి, వీటిని సప్లయి చేయించాలి. ఈనాడు ప్రభుత్వము agricultural loans తదితరతక్కావి మొదలైన లోన్సు తహశ్శీల్దార్లద్వారా ప్రభుత్వము యిప్పిస్తున్నారు. కాని పలుకుబడిగలవారికి ముందు అందుతున్నవి, సామాన్య రైతులకు ముట్టడంలేదు. ఇటువంటి అన్యాయాలను అరికట్టించాలి. ఈ విషయము

ప్రభుత్వము జాగ్రత్తగా పరిశీలించి రైతులకందరికి తరుణములో ఎరువులు, లోన్సు వగైరాలు అందజేయాలి. ఇంతవరకు జరిగేది చూస్తే, ఆవిధంగా జరగకపోవడమువల్ల రైతులు చాలా భాగము నష్టపడుతున్నారు. ఈ కార్యక్రమమంతా ప్రభుత్వము special గా ఒక ఆఫీసరును వేసి, యివన్నీ అందించడానికి ప్రభుత్వము కృషిచేయాలి.

రైతులకు అప్పులు యిచ్చే విధానములో రైతుకు పెంకుటియిల్లుగాని, పట్టాభూమిగాని వుంటేనే అప్పుయిస్తాము, లేకపోతే అప్పులు యివ్వము అని అంటున్నారు. ప్రతిరైతుకు పెంకుటియిల్లుగాని, పట్టాభూములుగాని ఎక్కడినుంచివస్తుంది ? ఇల్లుఅంటే, ఏదో పూరియిల్లు వేసుకొని వ్యవసాయము చేసుకుని జీవించేవారు వుంటున్నారుగాని, ప్రతివాడున్నూ పెంకుటియిల్లు కలిగివుండడము అసంభవముగదా ! వారివారి తాహతునుబట్టిని వారికి ఆర్థిక సహాయము చేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

వ్యవసాయానికి కాలవలద్వారా నీరు సరిగా అన్నిచోట్లకు అందడము లేదు. కాలువలు మరమ్మతుచేయించాల్సి వున్నది. P. W. D. వారివద్దకువెళ్లి, కాలువలు మరమ్మతు చేయించమని ఎన్నిసార్లు మొరపెట్టుకున్నప్పటికినీ పైనుంచి ఆర్డరు రాలేదు అని తప్పుకుంటున్నారు. మేమే తవ్వించుకుంటాము, దానికి అయ్యేడబ్బు మాకే లెక్కలుకట్టి శాంక్షనుచేయించియివ్వమని రైతులుకోరగా, అట్లా యివ్వము అని అంటున్నారు. పోనీయండి, నష్టము అయినప్పటికినీ, మేము త్రవ్వించుకుంటాము శాంక్షనుచేయించిన సొమ్మునే పుచ్చుకుంటాము, అని రైతులుఅడిగితే, అలాగే యిస్తామని చెప్పుచూ కాలయాపనచేస్తూ మొన్నటివరకూగూడా పెండింగులో పెట్టారు. ఆ సంగతినిగురించి యింతవరకు ఏమిఅయిందిన్ని తెలియలేదు. ఈ విషయము ప్రభుత్వము దృష్టికి తెస్తున్నాను. కొద్దిరోజులలోనే యీ విషయమునుగురించి ఒక విజ్ఞప్తి ప్రభుత్వమువద్దకుగూడా రానున్నది. అదివచ్చినప్పుడు మంత్రిగారు దాన్ని పరిశీలించి తగుచర్య తీసుకుంటారని ఆశిస్తున్నాను.

రైతులకు వ్యవసాయానికి అవసరమైనపనిముట్లు సప్లయిచేయడము co-operative basis మీద ఏర్పాటుచేయాలి. ఈ పనిముట్లు ప్రభుత్వంవారి యిప్పటివిధానమును బట్టి రైతులకు సకాలంలో అందడములేదు. దీనికి బ్లాకుమార్కెటు ఒకటితయారైంది, బ్లాకుమార్కెటు ధరపెట్టి రైతులుకొనలేక పోతున్నారు. ఈ విధంగా బ్లాకుమార్కెటుకు పోవలసినస్థితి రైతులకు పట్టించకుండా, సరసమైన ధరలకు యిప్పించేటట్లు తగు ఏర్పాట్లు చేయించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. కోఆపరేటివ్ సొసైటీలవారు, బ్యాంకునుంచి డబ్బుతీసుకొనివచ్చి, వారి స్నేహితులపేరుతోను బంధువులపేరుతోనూ

SRI D. Sreeramamurthi] [26th July 1955

బినామీగా సర్దుకొనడమువల్ల సామాన్యరైతులకు అప్పులు దొరకనివ్వడము లేదు. విత్తనాలుగూడా దొరకక చాలాయిబ్బంది అవుతున్నది. అందుచేత, ప్రభుత్వము వారు యీ విషయాలన్ని గమనించి రైతులకు సకాలములో సప్లయి అయ్యేటట్లు ఏర్పాటుచేసి యీ యిబ్బందులు తొలగించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుచున్నాను.

SRI S. NARAYANAPPA :—ఉపాధ్యక్షా, మన ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన వ్యవసాయ, చేపల పరిశ్రమకు సంబంధించిన ఈ డిమాండును నేను బలపరుస్తూ కొన్నిసూచనలు చేయుచున్నాను. ఆంధ్రదేశంలో వ్యవసాయము ప్రధానమైనదని ప్రభుత్వము గుర్తించింది. వ్యవసాయములో రెండుభాగా లున్నాయి. వ్యవసాయదారులు పండించేటువంటి పంట రెండురకాలుగా వున్నాయి. వాణిజ్య పంటలు, ధాన్యముపంటలు. వీటికి సక్రమమైనటువంటి ధరతూకములు, మార్కెటులో కావలసినటువంటి సౌకర్యాలు లభించడములేదు. వ్యవసాయమును అభివృద్ధి పరచుటకు ప్రభుత్వము ఎన్నోపథకాలు వేసినారు. కార్యక్రమాలు జరుపుతున్నారు. ఎరువులు, వ్యవసాయానికి సంబంధించినటువంటి మేలురకములైన విత్తనములు సక్రమంగా పంపకముచేసి, ఇంకా ట్రాక్టర్లు, బుల్ డోజర్లు ఇటువంటివి ఎక్కువగా hire purchase system క్రిందవారికి లభింపచేసి వ్యవసాయాభివృద్ధికి కావలసినంత దోహదము కలిగించవలసినదిగా కోరుతున్నాను. రసాయనిక ఎరువుల పంపకము విషయంలో చాలా గందరగోళము జరుగుతోంది. వీటికి ఒక ఏజన్సీని సక్రమమైన పంథాలో నిర్మించి ఎరువులు సక్రమంగా కేవలం సరసమైన ధరలకు రైతులకు లభించే విధానాన్ని అమల్లోపెట్టితే చాలా ఉపయోగకరంగా వుంటుంది. ఇతర మెట్టప్రాంతములలో నల్లరేగడి నేలల్లో కాటన్ పండించే సిస్టమును అమలుజరిపిస్తే రైతులకు భూముల్లో వర్షాకాలములో పడినటువంటి వర్షపాతమువల్ల వచ్చేధారలోఅంతా ఎరువులు, భూసారము తేలిపోతుంది. కాబట్టి కాంటూర్ బన్ డింగ్ సిస్టము మా ప్రాంతాల్లో అంటే ఆలూరు, గుత్తి, గుంతకల్లు ప్రాంతాలలో అమలుపెట్టారు. ఉరవకొండ ప్రాంతాల్లోకూడా అమలు జరిపిస్తే చాలా ఉపయోగంగా ఉంటుంది. ఆ ప్రాంతాలలో ఉన్నటువంటి నల్లరేగడిభూములో వ్యవసాయము చేయునటువంటి రైతులకు, ఈ విధానానికి సంబంధించినంతవరకు డబ్బు ఎక్కువగా కేటాయిస్తే బాగా ఉపయోగంగావుంటుంది. తరువాత వాణిజ్యపంటల్లో చెఱకు, వేరుశనగ ముఖ్యమైనటువంటివి. వేరుశనగ రాయలసీమలో ముఖ్యమైనపంట. దీనికి విత్తనము వేసేప్పుడు వున్నధర, విత్తనమువేసి, పైరుఎదిగి, కోసి, కల్లంచేసిన తరువాత ఉండదు. మార్కెటుకు వచ్చేటప్పటికి ధరపడిపోతుంది. గిట్టుబాటుధర రైతులకు లభించడములేదు. ఇది చాలా అన్యాయంగావుంది. ప్రభుత్వము వెంటనే దీనికి

మంచిధరను నిర్ణయించి రైతుకు గిట్టుబాటు కలిగేవిధానాన్ని అనుసరించాలి. అనేక మార్కెటు కమిటీలు ఉన్నాయి. వాటిద్వారా ప్రతివారికి ఎక్కువ పరపతి సౌకర్యములో ధనముగాని తదితర సహాయముగాని ఇచ్చి రైతు పండించినటువంటి వాణిజ్యపంటకు ఎక్కువ సౌకర్యములు కల్పించాలని నేను కోరుతున్నాను. వేరు శెనగపంటకు అప్పుడప్పుడు రోగాలు వస్తుంటాయి. వాటికి అగ్రికల్చరల్ డిమాన్ స్ట్రేటర్సు తీసుకొనేటువంటి చర్యలు సక్రమంగాలేవు. ఆ చర్యలు ఈ పంట అభివృద్ధికి ఏమాత్రము అనుకూలముగా వుండడములేదు. ప్రభుత్వము ఆ రోగ నివారణకు ప్రత్యేకమైనటువంటి ఒక విధానాన్ని అనుసరించి, ముఖ్యంగా వేరుశెనగ పండించే రయితులకు ఎక్కువ సహాయము కల్పించి, వేరుశెనగపంట నభివృద్ధి పరచుటకు ఒకవిధము అయినటువంటి రీసెర్చి స్టేషనులను ఏర్పాటుచేస్తే చాలా ఉపయోగంగా ఉంటుందనిచెబుతూ, తగినచర్యలు వెంటనే ప్రభుత్వంవారు తీసుకోవలసిందిగా మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU:—ఉపాధ్యక్షా, మన ముఖ్యమంత్రి అయిన గోపాలరెడ్డిగారు, పాపము, నీరుకొండ వెంకటరామారావు గారు పోయినతరువాత ఆఖాళీపూడ్చకుండా వారే ఈ బడ్జెటును చాలా శ్రమపడి తయారుచేసి మన ఎదుట ఉంచినందుకు కృతజ్ఞత తెలుపుతూ ఈ విషయమై కొన్ని సూచనలువారికి మనవిచేయదలచుకున్నాను.

ఇప్పుడు షుగర్ కేన్, షుగర్ ఫ్యాక్టరీలవిషయమై నాముందు మాట్లాడిన సూర్యనారాయణ రాజు గారు చాలా విషయాలు చెప్పారు. కొన్ని విషయాలు నేనుకూడ మనవిచేస్తాను. 2, 3 మైళ్ల ఏరియా ఇప్పుడు కొత్తగా fix చేసి, ఆ ఏరియాలోఉన్న గ్రామములలోనే మేము తప్పకుండా షుగర్ కేను ఫ్యాక్టరీకి allot చేస్తామని చెప్పి మంత్రిగారు ఆ విధంగా allot చేసినట్లు సెలవిచ్చారు. ఇదవరకు బెల్లంధర ఎక్కువ ఉన్నప్పుడు allot చేసినరైతులు వారి ఇష్టము ప్రకారముగా అమ్ముకోడానికి హక్కువున్నది. ఇప్పుడు వారు ఏమిచేస్తున్నారంటే బెల్లంధర తగ్గిపోయింది. మాకు చెఱకే తప్పకుండా తోలాలనిచెప్పి వాళ్లను నిర్బంధముచేస్తున్నారు. ఈ ప్రభుత్వము వారు ఇదివరకు ఏమిచేసినారోచెబుతాను. క్రిందటి సంవత్సరము 45 వేల టన్నులు మాకొప్పాక ఫ్యాక్టరీకి కేటాయించారు. ఒక సుగరుకేను స్పెషలిస్టును దీనిమీద నియమించారు. వారును ఈ విషయంలో ప్రోత్సాహం కలుగజేసి ఫ్యాక్టరీకి సరిపడే చెఱకును ఇప్పించలేకపోయారు. కాని ఈ సంవత్సరము బెల్లానికి ధర తగ్గిపోయింది. అందుచేత దూరంగా ఉన్న అసలురైతులు చెఱకు ఇవ్వలేక పోవడము

చేత రైతులచేత కంట్రాక్టులు వ్రాయించికొని స్వంతులదారుల దగ్గరతెచ్చుకొన్న చెఱకు ఆడకుండా ప్రభుత్వం fix చేసిన గ్రామాల్లో చెఱకును వారు తోలమని చెప్పడంలో ప్రతిబంధకము వస్తున్నది. ఫ్యాక్టరీకు చిక్కువస్తున్నది. ఇదివరకు ఈ ఫ్యాక్టరీమీద ఆధారపడ్డ రైతులకు చిక్కువస్తున్నది. అందుచేత మంత్రిగారు దూరము ఆలోచించి ఏఏరియా fix చేస్తారో ఆఏరియాలో బెల్లంధర తగ్గినప్పటికీ, హెచ్చినప్పటికీ కంపల్సరీగా చెఱకును ఫ్యాక్టరీకి ఇవ్వాలి, లేకపోతే ఎవరెవరివల్ల ఎగ్రిమెంట్లు వ్రాసుకొన్నారో వాళ్ళు కంపల్సరీగా ఫ్యాక్టరీకి ఇచ్చే లాంటి సూత్రమును Act లో చేరిస్తే చాలా అనుకూలంగా ఉంటుంది. రైతులకు ఫ్యాక్టరీవాళ్లకు తగాదాలు ఉండవు. మాబ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసులో ఇదివరకు 2 గోడౌన్లు కట్టారు. వ్యవసాయసామానులు పనిముట్లు అన్నికూడా అక్కడనుంచే సప్లయి చేస్తున్నారు. అది ఇప్పుడు అనవసరముగా అలాగే వుండిపోయాయి. పోనీ బ్లాక్ development ఏరియాల్లో ఆవిసెన్‌సెట్సుకట్టిన దగ్గర అయినాసరే అక్కడ రైతులకు అందరికి అందుబాటులో వుండేటట్లు ఎరువులు, వ్యవసాయసామానులు, అన్నికూడా ప్రభుత్వం సప్లయిచేయించే ఏర్పాటు చేయిస్తారని చెప్పి మనవి చేస్తున్నాను. Agriculture demonstrators కు ఆఫీసుపని జాస్తి అయింది. ఆఫీసుపనివల్ల రైతుల తాలూకు కష్టసుఖాలు, మంచిచెడ్డలు, తొలగించడానికి వారికి ఏవిధముగాను అవకాశము లేకుండా పోతున్నది. నాకు పూర్వం మాట్లాడిన సూర్యనారాయణరాజుగారు చెప్పినట్లుగా ఇదివరకు డిమాన్‌స్ట్రేటరు field మీద తిరిగి ఎలాగో రైతులకు ఉపకరించేవాళ్లు. ఇప్పుడుకూడా వారు అందరికి ఉపకరించే లాగా చేయాలని కోరుతున్నాను.

ఫిషరీస్ డిపార్టుమెంటులో చేపలు పెంచడంలో కొన్నికొన్నిచోట్ల ఏదో 500 చేపలు తీసుకువచ్చి వేసినట్లు 1000 చేపలు వేసినట్లు లెక్కవ్రాసుకోవడం జరుగుచున్నది. తరువాత ఏమైనా అభివృద్ధిచెందాయా అని ఆఫీసర్లను అడిగితే కొంతమంది ఏమి చెప్పుతున్నారంటే, చేపలు వేశాముగాని, చచ్చిపోయినాయని సెలవిస్తున్నారు. వేశాము చచ్చిపోయాయి అంటే దానికి ఇక అర్థములేదు. సాక్ష్యము ఉండదు. రుజువు ఉండదు. దానికి ఏమైనా స్ట్రిక్ట్ ప్రిన్సిపుల్సుమీద దానియొక్క మంచిచెడ్డలను తిరిగి తనిఖీచేసేవారినివేసే ఏమైనా అవకాశంవుంటే ఆ ఏర్పాటుకూడా చేయాలని కోరుతున్నాను.

MR. DUPUTY SPEAKER :—మీకు టయిము అయిపోయింది.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU:—ఉపాధ్యక్షా, తమరు ఈ స్థానాన్ని అలంకరించిన తరువాత నేను ఒక్కసారికూడా మాట్లాడలేదు.

ముఖ్యముగా వీరు అవకాశము ఇచ్చినట్లయితే మిమ్ములను అభినందించాలని చాలా కోరికగా వున్నది.

Mr. Deputy SPEAKER:- కొత్త విషయాలు ఏమైనా ఉంటే చెప్పండి.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU :— సెలవైతే మాట్లాడుతాను. లేకపోతే కూర్చుంటాను.

Mr. Deputy SPEAKER :— కొత్తవిషయాలు వుంటే చెప్పండి.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU :— ఇదంతా లోకంటిపాటేనండి. కొత్తవిషయాలు ఏమివుంటాయి ? ఒకరి తరువాత ఒకరు పాడేపాటే. ఒకరితరువాత ఒకరు అలాగే పాడవలసిందే. అన్నీ కొత్తవిషయాలు అంటే ఏలాగు కొత్తవిషయాలు వుంటాయి. పాతవిషయాలు వుంటాయి. ఎవరి నియోజకవర్గానికి అవి కొత్తవిషయాలే. కొత్తవిషయాలే అంటే అందరు ఎక్కడనుంచి కొత్తవిషయాలు తెచ్చి మాట్లాడుతారు ? తమరే సెలవివ్వండి.

*SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా ! వ్యవసాయము అభివృద్ధికావాలంటే వ్యవసాయకునికి చాలా ప్రధానమైన ఆర్థికస్థితి సరిగా వుండాలి. ఈనాడు వారు తయారుచేస్తున్నటువంటి వస్తువులకు ధరలు పడిపోతున్నాయి. దానికిగాను పరపతిఅవకాశాలు లేకుండాపోతున్నాయి. పరపతి అవకాశాలు కలిగించేవరకు వారికి నేడు మారటోరియం ఇవ్వడము అవసరమని తమకుచెప్పదలచుకున్నాను. దీన్నిగురించి ప్రావిన్షియల్ కాంగ్రెసుకమిటీకూడా తీర్మానము చేసినట్లు పత్రికలలో విన్నాము. అందువల్ల ఈవిషయము ముందుసూచించాలని చెప్పినాను. రెండవది ముఖ్యముగా వారికి ఏ సౌకర్యాలు ఇస్తున్నా, ప్రభుత్వము వారికి ఇబ్బందిగా ఉన్నప్పుడు వచ్చి ఆ అప్పులను వసూలుచేస్తున్నారు. కనీసం వ్యవసాయశాఖవారిచ్చిన ఎరువుల అప్పులు రెండువాయిదాలు గానో మూడువాయిదాలుగానో వసూలుచేస్తే బాగావుంటుందని తెలియజెపుచున్నాను. అసలు దరఖాస్తులు వ్రాసి యిచ్చేటప్పటికే చాలా గడువు దాటిపోతున్నది. గడువుదాటకుండా సే యిస్తారనుకోండి. ఆఖరురోజున ఇస్తారు. అందువల్ల మళ్లీ వసూలుచేసే టైమువచ్చికూర్చుంటుంది. కనుక ఆ గడువు కొంస్తాఎక్కువగావుండేటట్లుచూడడం అవసరం. ట్రాక్టర్లు అవన్నీ కూడాకొంత ఇస్తున్నారు. కొంతవరకు వాటినిసౌకర్యముగానే వాడుతున్నవారు కొందరువున్నారు. ఎక్కువ ఖరీదుపెట్టి వాటిని ప్రభుత్వము తీసుకువస్తున్నారు. మళ్లీ చిన్నబోల్టో ఏదో ఒకటివూడి మూలబడుతుంది. టెక్నికలు experts లేరనిచెప్పి కొన్నాళ్లు మూలపడ

[Sri Vavilala Gopalakrishnayya] [26th July 1955

వేయడము జరుగుతోంది. అటువంటివి జరిగినవెంటనే ఎక్కువకాలము వాటిని మూలబడనీయకుండా చూడడం మంచిది. అట్లా వాటినిగురించి ప్రభుత్వంవారు తగినచర్య తీసుకోవాలి.

రెండవది కాంటూర్ బండింగ్ చాలా ప్రధానమైనది. చాలా బాగుంటుంది. వర్షమువచ్చినప్పుడు అడవులలోవున్న సాయిల్ అంతా కొట్టుకుపోతున్నది. దానిని రిజర్వుచేయాలనిచెప్పి మేము ఫారెస్టులు పెంచుతున్నామంటున్నారు. సంతోషమే. అదే సమస్య ఇక్కడవున్నది. పొలాలలోని soil అంతా కూడా వరసనుకొట్టుకు పోతున్నది. Soil conservation వుండాలన్నట్లయితే వాటికి కావలసినటువంటిది కాంటూర్ బండింగ్ ఇవ్వాళనుంచి ఏర్పరచక పోయినట్లయితే భూసారాన్ని కాపాడుటలో విఫలం అవుతారనే విషయం నేను మనవిచేస్తున్నాను.

Marketing facilities ఏమీలేకుండాఉన్నవి. ఉదాహరణకు పొగాకు వేసుకొన్నచోట పొగాకు Marketing yard పెట్టుకున్నారు. కాని ప్రతిరైతు అక్కడే అమ్మవలెనను నిబంధనలేకపోవడంవల్ల చాలా రైతులు దెబ్బతింటున్నారు. అందువల్ల వీటిని రాష్ట్రవ్యాప్తంగా అమలుజరుపదలచినప్పుడే రైతులకు యిబ్బంది లేకుండా పోతుందిగాని ఒక్కచోట Marketing facilities పెట్టి మరోచోట పెట్టకుండాఉంటే రైతుకు నష్టమువస్తుందని మనవిచేస్తున్నాను. వేరుశనగకాయలు, ఉల్లిగడ్డలు, మిరపకాయలు నెయ్యివగైరాలకు ఈరోజున Marketing facilities ఏర్పరచవలసిన అవసరమున్నది. కొన్నిచోట్ల ఇవి నిలువఉండిపోవుచున్నవి. అదికాకుండా ఇప్పుడు అమెరికానుంచి మనదేశానికి నెయ్యి దిగుమతి అవుతున్నది. ఇది చాలా ఆశ్చర్యముగా వున్నది. ఇక్కడ నెయ్యి తయారై అమ్ముడుపోక వీళ్లు తన్నుకులాడుతున్నప్పుడు అక్కడనుంచి నెయ్యివస్తున్నది. మనము industries కు protection యిస్తున్నాము. కాబట్టి యితరదేశాలనుంచి మనకు నెయ్యిరాకుండా తగినఏర్పాట్లు చేయవలెను. వ్యవసాయములో రాజగోపాలనాయుడు గారు చెప్పినట్లు] shortcourse కాకుండా month course చాలా అవసరము. పూర్వము:నంద్యాల అటువంటిచోట్ల ఎక్కడెక్కడ farms ఉన్నాయో అక్కడ నేర్పుతూఉండేవారు. Agricultural demonstrators వల్ల చాలా ఉపయోగముగానున్నది. అయినా ఈ Agricultural demonstrators చదువుకొన్న తర్వాత రైతాంగానికి తగుసలహా సంప్రదింపులు చేయక పోయినట్లయిన వారి చదువు నిరుపయోగమేనని మనవి చేయుచుంటిని.

ఇక "పాడిపంటలు" పత్రిక చాలా ఉపయోగముగానున్నదని నాఅభిప్రాయము. అయితే దీనిని ఇంకా అభివృద్ధిపరచవలసిన అవసరము ఉన్నది. అయితే దీనిని compulsory గా కొనాలనేపద్ధతి బాగుండలేదు. ఒకసారి నేను Agriculture office కువెళ్ళితే అక్కడ ఒకనికి మూడుపత్రికలు (పాడిపంటలు) వచ్చినవి. అదేమిటి అని అడుగగా అక్కడ నేను మూడుసార్లు loan-తీసుకొన్నాను. అందువల్ల నాకు 3పత్రికలు వచ్చినవి అన్నాడు. ఎప్పుడైనా ఒకపత్రిక చదువుతాడుగాని మూడు పత్రికలు ఏమిచేస్తాడు?

THE HON. SRI B. GOPALA REDDI :— ఎవరికైనా చదువు కోడానికి యివ్వవచ్చుగా.

SRI VAVILALA GOPLAKRISHNAYYA :— Fishing విషయములో, వాటిని వీలైనంతవరకు co-operatives కు ఇవ్వాలని ఒకమాటచెప్పి నేను విరమిస్తున్నాను.

* SRI P. RAMACHARLU:—అధ్యక్షా! ఉత్తరసర్కార్సు జిల్లాలలో జీడిమామిడిపప్పు ఉత్పత్తి వ్యాపారములు విశేషముగా సాగుచున్నవి. దక్షిణ మలయాళమునందును అట్లే ఈచెట్లు అభివృద్ధిలోనున్నవి. అమెరికా ఈ పప్పును విశేషముగా కొనుచున్నది. ఫిలిప్పయన్ దీవులలో ఈ పప్పు 12 గింజలకు ఒకడాలరు వెలగా అమ్ముచున్నదని కోఆపరేటివు రిజిస్ట్రారు శ్రీరాయన్‌గారు ఒకచోట నుడివి యుండిరి. జీడిమామిడిచెట్లు ఏ వాతావరణములోనైనను ఏ నేలలోనైనను పెరుగునని వ్యవసాయశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అయినప్పటికీ ఆంధ్రదేశములో ముఖ్యముగా అనంతపురంజిల్లావంటి కరువుప్రాంతములలో ఈ చెట్లను విరివిగా పెంచుటకు వ్యవసాయశాఖ వారెందుకు ప్రయత్నింపరు ? ప్రభుత్వము ఈ విషయమున శ్రద్ధతీసు కోవలెనని కోరుచున్నాను.

మా జిల్లాలో ఉల్లిగడ్డలు విశేషముగా పండుచున్నవి. అవి రంగూన్ సిలోన్ ప్రాంతములకు ఎక్కువగా ఎగుమతి అగుచున్నవి. ఆ దేశములలో ఒక్కొక్క ఉల్లిగడ్డ రెండుమూడు అణాలుకు అమ్ముడు పోవునట !

కాని ఎగుమతి విధానములోని లోపములవలన ఉల్లిగడ్డలను పండించు రైతులు ఆ లాభమును పొందలేకున్నారు. ఎగుమతి లైసెన్సులు కొందరు వ్యాపారస్థులకును కొన్ని కోఆపరేటివు సొసైటీలకును ఇవ్వబడినవి. కాని అట్టి పర్మిట్లు గలవారు రైతులనుండి చౌకగా ఉల్లిగడ్డలనుకొని తాము ప్రియముగా అమ్మికొని లాభములను

[Sri P. Ramacharulu] [26th July 1955

గడింతురు. కొందరు ఉల్లిగడ్డలను రయితులనుండి కొనకుండగనే తమ పరిమిట్లను మద్రాసు వర్తకులకో మరెవరికో అమ్మి తేరగా వేనవేలు లాభము గడించుచున్నది గూడ లోకవిదితము.

ఎంతో ఆశతో తనకు కొన్నినండలు వచ్చునని కష్టించిన రయితునకు చివరకు ఆశాభంగముతప్పదు. ఒకొక్కసారి అతడు అర్ధరూపాయకు రూపాయకుగూడ మణుగు గడ్డల నమ్ముకొని నష్టపడుచున్నాడు. మధ్యవర్తులుమాత్రము లాభము గడించు చున్నారు.

ఆ విధముగనే వేరుసెనగకూడ. వేరుసెనగకు విదేశములలో గిరాకీ ఎక్కువ యున్నమాట వాస్తవము. కాని ఇండియాప్రభుత్వము ఆసరకును రవాణాచేయు పర్మిట్లు ఎప్పుడో ఎవ్వరికో ఇచ్చుచున్నది. ఈ ఆలస్యకారణముగా రయితులు విధి లేక తమసరకును మధ్యవర్తులకు అమ్మివేయుచున్నారు. సాహుకారులుకొని నిలువ చేసుకొన్నతర్వాత ఎగుమతి లైసెన్సులు వచ్చుచున్నవి. ఇందువలన లాభపడునది వర్తకులేగాని రయితులు కాదు. ఈ విధముగా ప్రతియేడును జరుగుచున్నది. రయితులు చాలకాలము ఓపికపట్టి సరకు నిలువచేసికోజాలరు. వారమ్ముకొన్న తర్వాతనే పర్మిట్లు ప్రకటింపబడును. ఇదియేదో గారడిగా తోచుచున్నది. లేక ఉద్దేశ్యపూర్వకముగా చేయబడుచున్నదేమో చెప్పలేము. కాని మా అనుభవమును బట్టి ఈ ఎగుమతి పర్మిట్లువచ్చునప్పటికి రయితులు సరకును అమ్ముకొని యుండుటయును తర్వాత ఆ లాభమును వర్తకులు అనుభవించుటయును జరుగుచున్నదని స్పష్టపడినది. కావున వ్యవసాయశాఖవారు, రవాణాశాఖవారు, ముఖ్యమంత్రియు, ఇండియాప్రభుత్వముతో సంప్రతించి లోపమెచ్చటనున్నదో కనిపెట్టి ఈ సరకులకు ఎగుమతివలన వచ్చులాభమును రయితులకును కొంత అందజేయవలెనని కోరుచున్నాను. ఏయే దేశమున కెంతసరకుకొనవలెనో ముమ్ముందుగా అంచెనా వేసికొని ఈ సరకునకీయేడింత ఎక్స్పోర్టులైసెన్సు లిచ్చెదమని ప్రభుత్వముముందుగా ప్రకటించినయెడల రయితు ఆ విధానమున కనుకూలముగా పంటలు పండించగలడు.

ప్రత్తి, చెఱకుపంటలవలనగూడ రయితు ఈవిధముగా నష్టపడుచున్నాడు. బెల్లమునకంటె చక్కెర ఒకప్పుడు చౌకగా అమ్మినది. ఇప్పుడు బెల్లముధర అడుగునకు పడిపోయినది ఇది అధికారులుచేయు గారడియా లేక సహజముగా మానవుని ఊహ కందనికారణములతో నిట్లగుచున్నదా, తెలియదు. ప్రభుత్వమువారు శ్రద్ధ వహించి ఈ లోపములను సవరించుచు రయితు పండించిన పంటలకు గిరాకీ ఉండు పద్ధతులను ఆలోచింపదగునని కోరుచున్నాను.

* Sri B. APPA RAO :—అధ్యక్షా ! ఈ డిమాండును బలపరుస్తూ రెండు సూచనలు చేయుచున్నాను. ముఖ్యముగా మన Chief Minister గారు ఈ వ్యవసాయ డిపార్టుమెంటు తీసుకొనుట నిజముగా రయితుల అదృష్టమే అని చెప్పవచ్చు. కారణ మేమనగా అన్నిటికి రైతే, శిస్తువేసినా రైతే, ముందు కన్పిస్తాడు. ముఖ్యముగా వ్యవసాయమును గురించిచూస్తే, నేనుకూడా వ్యవసాయిదారుడనే గనుక, జపాన్ పద్ధతి వల్ల ఎక్కువగా పంటపండించవచ్చు. ముఖ్యముగా రయితుబిడ్డలకు 1 నెల లేక 2 నెలలు grant యిచ్చి వ్యవసాయ demonstrators ద్వారా training ప్రతి తాలూకాలో యిప్పించాలని కోరుచున్నాను.

ఇక ఎరువులవిషయములో ఇవి పేద రయితులకు అంటున్నారుగాని పేద రయితులకు ఈ ఎరువులు ముట్టుటలేదు. కనుక వీరు ఈ రేటును తగ్గించి అందరికీ ముఖ్యముగా పేదరయితులకు ఈ ఎరువులు సరఫరా అయ్యేట్లు చూడాలని మనవిచేయుచున్నాను. ఈ జపానుపద్ధతివల్ల ఎకరమునకు 39 బస్తాలు పండించితిని. ఎరువులులేకుండా పండించితిని. Government వారు కొత్తగా compost ఎరువులని తయారుచేస్తున్నారు. వాటివల్ల రయితుకు తక్కువధరకు గిట్టుబాటై ఎక్కువ పంట పండించుటకు అవకాశము ఉన్నది. అమోనియాకంటే దీనివల్ల ఎక్కువపంట పండును.

ఇక fisheries సంగతి. మా తాలూకాలో 20 చెరువులను Government వారు తీసుకున్నారు. ఈ 20 చెరువులకు సంవత్సరమునకు రూ. 6000/- ఖర్చు అవుతున్నది. ఈ సంవత్సరము 11000 లోటు వచ్చినది కాని fish చాల చవుకగా, పౌను 0-8-0 కే, దొరుకుచున్నది. కనుక చెరువులు అన్నిటిని ప్రభుత్వమువారు తీసికోవాలని కోరుచున్నాను. ఇప్పుడు చాలా చెరువులు రెవిన్యూ క్రిందవున్నవి కనుక పలుకుబడికలవారు వాటిని పొందించుకొనుట జరుగుచున్నది. ఆ విధముగా జరుగకుండా ఉండులాగున చూడమని కోరుచున్నాను. కళింగపట్నంలో చేపలనుగురించిగవర్నమెంటువారు పరిశీలించారు. అక్కడ చేపలుబాగా పెద్దచేపలు దొరకునని మద్రాసునుంచివచ్చిన ఒక దొరకూడా చెప్పినారు. అటువంటి కళింగపట్నంలో fisheries department office పెట్టకుండా దానిని విశాఖపట్టణంకు తీసుకుపోవాలని proposals పెట్టారని విన్నాము. అట్లాకాకుండా ఎక్కడెక్కడ మంచి చేపలు, పెద్దచేపలు దొరుకునో అటువంటిచోట్ల ఈ fisheries department offices పెట్టమని ప్రభుత్వమును కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

1-30 P.M.

MR. DEPUTY SPEAKER :—సభమరల 3 గంటలకు సమావేశమవుతుంది.

(After lunch 3-00 p. m.)

* SRI N. C. SESHADRI :—అధ్యక్షా, ఎక్కువగా time లేదు. కాబట్టి నేను ఈ డిమాండును బలపరుస్తూ కొన్ని సూచనలు ప్రభుత్వంవారికి మనవి చేయదలచుకున్నాను. ఇందులో డిమాన్స్ట్రేషనుకు 3,94,000 లు డబ్బు కేటాయించారు. ఈ డిమాన్స్ట్రేషనుసరిగ్గా జరగడంలేదు. తాలూకా డిమాన్స్ట్రేటర్లు ఇనుపపరికరాలు, ఎరువులు, విత్తనాలు అమ్మడంతప్ప కార్యరంగంలో ఏ మాత్రం పనిచేయడంలేదు. పూర్తిపని కల్పించాలంటే ప్రతి తాలూకా Head-quarters లో Model farm స్థాపిస్తే డిమాన్స్ట్రేషనుకు అనుకూలంగా వుంటుంది. రైతులు ఏమైనా సూచనలు తెలుసుకోడానికి అనుకూలంగా వుంటుంది. విత్తనాలు, ఎరువులు అమ్మేవిషయంలో co-operative society కి కేటాయిస్తే Demonstrator పనిచేయడానికి వీలువుంటుంది. విత్తనాలు, ఎరువులు co-operative society కి కేటాయిస్తే ప్రతితాలూకాలో model farm స్థాపించవలసిన అగత్యంవున్నది. ఇంక వేరుశెనగ, వరి, ధరల స్థిరీకరణ విషయంలో ఈ ప్రభుత్వంవారు కేంద్రప్రభుత్వంతో సంప్రదింపులుజరిపి ధరలు స్థిరీకరణకు ప్రయత్నంచేస్తారు అని నేను ఆశిస్తున్నాను. Intensive manuring scheme కొన్ని తాలూకాలలో apply చేసినారు. దానిక్రింద అమోనియం సల్ఫేటు సప్లైచేస్తున్నారు. మా ప్రాంతాల్లో ఎక్కువ వరి పండించే భూములులేవు కాబట్టి దీని వాడకంవల్ల భూమి చవుడు తేలిపోతోందితప్ప లాభంలేక పోతోంది. దానితోబాటు Superphosphates, గానుగపిండి మొదలైనవి సప్లైచేయడానికి ప్రయత్నించాలి. Agriculture పద్దుక్రింద రు 2,63,400 లు కనిపిస్తొంది. ఆయిలు ఇంజన్లను రైతులకు చాక బాడుగమీద ఇవ్వాలని ఉద్దేశంతో దీన్ని స్థాపించారు. రోజుకు రు 3 లు బాడుగ, రు 2 లు Drivrei కు కూలీగా తీసుకుంటున్నారు. రైతులకు ఏమీ ప్రయోజనంలేదు. ప్రభుత్వానికి డబ్బుఖర్చు అవడమేకాకుండా దీని సహాయం పేదరైతులకు అందకుండావున్నది. దానిక్రింద కేటాయించబడే ఆయిల్ ఇంజనుల డిపార్టుమెంటు తీసివేయాలని కోరుచున్నాను. లారీలపద్దుక్రింద maintenance and upkeep లకుగాను లక్షరూపాయిలు కేటాయించబడింది. వీటిని దేనికి వాడుతున్నారో తెలియకుండావున్నది. ఇవి రవాణాచేయడానికితప్ప రైతులకు ఏవిధంగా సహాయం ఇవ్వకుండావున్నవి. రవాణాకు అవసరమైన, బాడుగలారీలద్వారా సరఫరాచేస్తే ప్రభుత్వానికి ఎంతో ఖర్చు మిగులుతుంది. Hire purchase system క్రింద ప్రతిజిల్లాకు కొన్ని Motor oil engines సప్లైచేయడానికి ప్రభుత్వం

ఉద్దేశించింది. అనంతపురంజిల్లాకు సంబంధించినంతవరకు 13 electric motors supply కేటాయించారు. అంటే తాలూకాకు 1½ మోటారువస్తుంది. యీ పద్ధతి ఏమి బాగాలేదు. కొబట్టి ముఖ్యంగా lift irrigation ఇక్కడ జాస్తీగా వున్నది కొబట్టి Land improvements loan క్రింద ఏ లక్షరూపాయిలో కేటాయిస్తే కనీసం 70, 80 pump sets కొనుక్కోడానికి అవకాశంవుంటుంది. ఈ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులవారికి నమస్కారములు తెలియచేస్తూ చున్నాను.

SRI T. RAMACHANDRA REDDI :— అధ్యక్ష మహాశయా, ముఖ్యంగా మనదేశం వ్యవసాయంమీద ఆధారపడినదేశం, ప్రతిరైతు పశుసంపదమీద ఆధారపడినదేశం. మనదేశంలో ఈ పశుసంపదను కాపాడే కేంద్రాలు బహుతక్కువ. గ్రామాలలో ఈ పశువులకు వస్తూండే జాడ్యాలు ఇత్యాది రోగాలకు సరియైన చికిత్సాలయాలులేక అనేకవేల పశువులు మనదేశంలో యీనాటికి రోగాలకు గురిఅవుతున్న విషయాలు మన కందరకు తెలుసు. కనుక ప్రతిఫిర్కాలోను Veterinary hospital కేటాయించాలని తమద్వారా మంత్రిగారికి విన్నవించుకుంటున్నాను. ఈనాడు పశువులు ఏరీతిగా వుండేది మనకు తెలుసు. పశువులు ఎక్కువధరలలో వున్నాయి. రైతులు పండించే పంటలకు ధరలు తగ్గిపోయినాయి. ఈ స్థితిలో పశువులను రైతు ఎక్కువగా కాపాడు కోవలసిన స్థితిలోవున్నాడు. పశువులు వ్యాధులకు గురై చనిపోతుంటే రైతుఎంత అధఃపతనం అవుతున్నాడో గుర్తుంచుకోవాలి. పశువులకు ఏమైనా రోగాలువస్తే వాటికి కొన్ని సదుపాయాలు చేయాలని తమద్వారా మంత్రిగారికి విన్నవించు కొంటున్నాను. గ్రామాలలో ఒకవిధమై వ్యాధులు వ్యాపిస్తున్నాయి. వాటినిగురించి Village munsif ద్వారా రిపోర్టుచేస్తే,ఆ రిపోర్టు జిల్లా కేంద్రంచేరి జిల్లా కేంద్రం నుంచి డాక్టరుగారు గ్రామానికివచ్చి వ్యాధికనుక్కొని తిరిగి జిల్లా కేంద్రానికివెళ్లి vaccine తీసుకువస్తారు, లేకపోతే 20 రోజులలో వస్తుందని చెబుతారు. ఇటీవల అనంతపురంజిల్లాలో ఇటువంటివ్యాధికి గొర్రెలు గురిఅవుతున్న విషయాన్ని జిల్లావెటన్నరి డాక్టరుగారికి విన్నవించుకున్నాను. వాక్సిన్ 20 రోజులకు వస్తుందని చెప్పినారు. ఈలోపుగా గ్రామాల్లో వుండేపశువులు నాశనం అవుతున్నాయి, సమయానికి వారికి సహాయం చేయకపోతే లాభంలేదు.

SRI P. BASI REDDI:—అధ్యక్షా, ప్రస్తుతం చిన్నరైతుకు ఋణం చాలా భరింపరానిదిగా వున్నది. దానికి ముఖ్యకారణం ధరలు తగ్గిపోవడమే. ఒకవిధంగా

[SRI P. Basi Reddi] [26th July 1955

రైతులకు కొన్ని ఖర్చులతో కూడుకున్న అలవాట్లుకూడా ఏర్పడినవి. ఇవికూడా ఒక విధంగా ఈ ఋణానికి కారణమేమోనని నేను భావించుచున్నాను. ముఖ్యకారణం ధరలు తగ్గడం, రెండవది, రైతులకు కనీసవస్తువుల ధరలు తగ్గకుండా వుండడం. ఈ కారణాన్నిబట్టి రైతులు ఋణం చేయవలసివచ్చింది. ఒక విధమైన ప్రమత్తతో కూడా ఈ ఋణాలు చేస్తారని నేను భావిస్తున్నాను. ఎందుకంటె ఏనాటికైనా ఈ ధరలు పెరుగుతాయి; మనం ఋణం తీర్చవచ్చుననే ఉద్దేశంతో ఋణాలు చేశారు. ధరలు పెరగకపోవడంవల్ల కనీసవస్తువుల ధరలు యథాప్రకారం వుండడంవల్ల ఋణాలు తీర్చేబదులు దినదినానికి ఋణాలు ఎక్కువైపోయినాయి. ఈ కారణంగా ఇప్పుడు వారిస్థితి కేవలం భరింపరానిదిగా ఏర్పడింది. వారికి ఋణంచేసే సదుపాయం తప్ప బడ్జెటులోటు తీర్చే వేరే ఉపాయంలేదు. గవర్నమెంటువారికి రెండు, మూడు మార్గాలున్నాయి. వారు taxes వేసి బడ్జెటులోటు తీర్చుకోవచ్చును. రైతులకు tax వేసే అవకాశాలులేవు. వారికి ఋణంచేసే మార్గం ఒకటే వున్నది. ఋణాలు చేశారు. తీర్చుకునే పరిస్థితులలో మాత్రం లేరు. వారికి వ్యవసాయఖర్చులకు డబ్బుదొరికే అవకాశాలు లేకుండా పోయినాయి. వారి credit సంపూర్తిగా నశించి పోయింది. ఋణబాధ ఎక్కువైనది. ప్రభుత్వంవారికి డబ్బుకట్టకపోతే కనికరంవుంచి వాయిదావేస్తుంది. వడ్డీవ్యాపారస్థులకు అమాదిరి కనికరం ఏమాత్రంలేదు. వారు బాధ పడుతున్నారు. ప్రభుత్వానికి మనవిచేసేది ఏమిటంటే తక్షణం మారటోరియం ప్రకటించి చిన్నరైతులకు తాత్కాలింగానైనా ఈ ఋణబాధనుంచి విముక్తి కలిగించాలని మనవి చేస్తున్నాను.

ఐతే మారటోరియమ్ ప్రకటించడమువల్ల రైతులకు క్రొత్త credit facilities కూడ కలుగజేయవలెను. అప్పు యిచ్చేవాండ్లు ఎవరు వుండరు. మారటోరియమ్ అమలులో వున్నంతకాలము ప్రభుత్వము credit facilities rural banks ద్వారా కలుగజేయాలని మనవిచేస్తున్నాను. అయితే వారికి చిన్న చిన్న అప్పులు యిచ్చేవిషయములోను యీ అప్పులు తీర్చుకోవలసినదానికి ఎక్కువ ఖర్చు లేకుండ చూడవలసిన బాధ్యత ప్రభుత్వముపైవుంది. ఒకొక్క రైతు నూరు రూపాయలు ఋణము తెచ్చుకోనేదానికి రు. 30 లు ఖర్చుపెట్టుకుంటున్నాడు, కాబట్టి ఇప్పుడు ప్రభుత్వము యివ్వదలచిన యీ కొద్ది సహాయమునైన రైతులకు కావలసిన అవకాశాలు కలుగజేయాలని మనవిచేస్తూ విరమించుతున్నాను.

SRI N. GOVINDARAJULU:—అధ్యక్షా, మన రాష్ట్రము వ్యవసాయిక రాష్ట్రము. మా వినుకొండతాలూకా వ్యవసాయంమీద వేక్కాకుండా forest

భూములు ఎక్కువగా వుండేదానివల్ల పశువులమీదగూడ ఎక్కువగా ఆధారపడి వుంటారు. వినుకొండ తాలూకాలో పశువులకు తగిన వైద్యసహాయము లేదు. ప్రతి పశువుకుకూడ ఏదో ఒక రోగమువస్తే అశాస్త్రీయముగా వాతలు పెట్టబడేటటువంటి పరిస్థితులు వినుకొండతాలూకాలో వున్నవి. తాలూకా మొత్తముమీద మామూలుగా ఏదో డాక్టర్ వుంటాడు. ఆడాక్టర్ జీతాలు పుచ్చుకొనే టంతవరకు మాత్రమే కాని మందులు మాత్రము వారిదగ్గర వుండవు. కాబట్టి వినుకొండతాలూకాలో తక్షణం ఒక పశువులవైద్యశాల నిర్మించాలని మనవిచేస్తున్నాను. కాని చందాలువేసే పరిస్థితిలో వినుకొండతాలూకా రైతులు లేరు. కనుక ప్రభుత్వమే వినుకొండ తాలూకా మొత్తము centre లో ఒక పశువైద్యశాల నిర్మించాలని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఈ మధ్య రెండు మాసములక్రిందట గూరవాపు అని పారుడు వ్యాధి అని వ్యాధులు వచ్చినాయి. ఆ విషయమై డాక్టర్ గారికి చెప్పితే మందులు లేవు, వ్రాస్తాను అన్నాడు. చిట్టచివరకు ఆ మందులువచ్చేసరికి ఎంతో ఖరీదుగల పశువులు అన్ని చనిపోయినాయి. అక్కడ బొత్తిగా వైద్యసహాయము లేదు. వినుకొండ తాలూకాలో బిడ్డలకంటెకూడా గొడ్లనే ఎక్కువగా ప్రేమిస్తారు కాబట్టి, వినుకొండ తాలూకా వెనుకబడినందున ప్రస్తుతము అక్కడ ఒక్క వైద్యశాలనైన కట్టించాలని మనవి చేస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS:—అధ్యక్షా, ఈనాడు మనము చర్చించబోవు యీ డిమాండు చాలముఖ్యమైంది. కనీసము 10 నిమిషాలు అయిన నాకు అవకాశం వుంటుంది అనుకున్నానుగాని తమరు 3 నిమిషాలుమాత్రమే యిచ్చారు. ఈ వ్యవసాయ budget విషయములో మనము చాలప్రధానమైన విషయాలు చర్చించవలసివుంది. వ్యవసాయమును అభివృద్ధిచేయాలంటే అనేకమైన విషయాలు మనము చర్చించుకోవాలి. అందుకు ముఖ్యముగా వ్యవసాయ అభివృద్ధిజరుగనిదే ఆంధ్రదేశముగాని భారతదేశము గాని అభివృద్ధిచెందదు అంటే, ప్రతివారు నాతో ఏకీభవిస్తారని నేను ఆశిస్తున్నాను. ఐతే యీ వ్యవసాయాభివృద్ధికి ఐదుసూత్రాలు ప్రభుత్వము పరిగణిస్తేగాని మనము ఏ మాత్రముకూడ ముందుకు వెళ్లలేము. వ్యవసాయము అభివృద్ధిచెందలేదు సరికదా, అది ఏ మాత్రము లాభదాయకము లేకుండ పోతుంది. దానికి ముఖ్యంగా నేనుసూచించిన యీ ఐదుసూత్రాలు ప్రభుత్వము గమనించాలని మంత్రులందరికి నేను హృదయపూర్వకముగా మనవిచేస్తున్నాము. మొట్టమొదటిది : irrigation facility తర్వాత, credit facility, marketing సౌకర్యాలు, minimum rate, crop insurance, యీ ఐదు సౌకర్యాలు మనముకలిగించినప్పుడే మనవ్యవసాయము అభివృద్ధిచెందుతుంది. మనము యీ

[Sri L. Lakshmana Das] [26th July 1955]

నాడు యితరదేశాలలో జరుగుచున్న అభివృద్ధివిషయాలు తెలుసుకుంటే అర్థమౌతుంది. అమెరికాదేశములో ఒకనికి 10 ఎకరాల భూమివున్నప్పుడువాడు ఒక motor car ను వుంచుకోవడమే కాకుండ 10 ఎకరాలు లోనే 2 ఎకరాలువ్యవసాయముచేయకుండా 8 ఎకరాలలోనే తనకు కావలసినపంటను పండించుకొనును. ప్రతిసంవత్సరము రెండు ఎకరాలకు rest యిస్తూ పోతున్నాడు. అక్కడి ప్రభుత్వముకూడ యీ credit విషయములోగాని, తక్కినవిషయాలలోగాని, అనేకవిధాల సదుపాయాలు చేస్తూనేవుంది. అదేవిధముగా మనప్రభుత్వము యీ నీటివసరుల విషయములో కాని, credit విషయములోకాని మార్కెటు విషయములో కాని, minimum rate విషయములోకాని, crop insurance విషయములోకాని, ఎక్కడా ఆలోచనలుజరిగినట్లు కన్పించడములేదు. ఇంతవరకుకూడ మనము ఎన్ని భూసంస్కరణలు చేసినాకూడ ఎంత వ్యవసాయమునుగురించి ఎన్నిసార్లు మాట్లాడినా కూడవ్యవసాయము అభివృద్ధిచెందలేదు. మనము గత 50-100 సంవత్సరములుగా రయితు యొక్క ఆర్థికస్థితి తెలిసికొంటే రోజురోజుకు రయితు ఏ విధంగా క్షీణించి పోతున్నది అందరికి తెలుస్తుంది. 100-కి 50 మంది రయితు కుటుంబాలనుండి వచ్చినవాండ్లే గనుక ప్రతిఒక్కరికికూడ రయితు రోజురోజుకు క్షీణిస్తున్నాడని తెలుసు. తాను పండించినపంటను అంతను తానుచేసిన ఋణాలకు వడ్డీలరూపకముగా యిచ్చుకుంటున్న సంగతి అందరికి తెలిసినవిషయమే. వ్యవసాయ డిపార్టుమెంటులో demonstrators ను వేస్తున్నారు. బ్రిటిష్ ప్రభుత్వము మనదేశములో మేముకూడ వ్యవసాయానికి ఏదో అభివృద్ధిచేస్తున్నామని చూపించడానికి వేశారు. కాని యీ demonstrators కు యితరపనులు కల్పించకూడదు. వీరు గ్రామాలకు పోయి యే విధముగా పండిస్తే పంట ఎక్కువపండుతుందని సూచనలుచేస్తే సక్రమముగా పండించడానికి అవకాశము వుంటుంది. యీమధ్యనే జపాను మొదలైన వరిసాగులు మనకు చెప్పినారు. ఎకరాకు రెండుగరిసెలు మూడు గరిసెలు పండించే పద్ధతులుకూడవున్నాయి. అదేవిధముగా వ్యవసాయక్షేత్రాన్ని స్థాపించి ఆక్షేత్రములో పలువిధములైన పంటలుపండించి ఏది రైతుకులాభదాయకమని సూచించడానికి ప్రభుత్వము పూనుకోవాలి అని నేను మనవిచేస్తున్నాను. ఈ వేళ కాకపోయిన 8 సంవత్సరాలైనతర్వాతగాని ఈ వేళ కేటాయించిన మొత్తానికి 10 రెట్లయిన కేటాయించాలని నేను కోరుతున్నాను. అవకాశమిచ్చినందులకు అధ్యక్షులవారికి నా ధన్యవాదాలు.

* **SRI N. VENKAIAH** :—అధ్యక్షా, ఎక్కువకాలము మాట్లాడానికి అవకాశములేదు. కాబట్టి ప్రగడకోటయ్యగారు రాజగోపాలనాయుడుగారు చెప్పిన అంశాలను బలపరుస్తూ ప్రత్యేకంగా మూడువిషయాలుమాత్రము మనవిచేయదలచు

కున్నాను. ఒకటి, Demonstrators అన్ని తాలూకాలలో వున్నప్పటికికూడ కొన్ని తాలూకాలు చాల విశాలమైనవి. అనుక కొన్ని గ్రామాలకు అందలేకుండవున్నారు. Asisstants ను కొన్నిచోట్ల నియమించాలి. కాని తాలూకాకేంద్రమునకు కాగితములు వెళ్లవలసివున్నందున ప్రజలకు అందుబాటులో లేదు. ప్రతి నియోజకవర్గములోను ఒక Demonstrator ను appoint చేసి అతనికి office యివ్వవలసినదిగా కోరుతున్నాను. అలాగే వ్యవసాయ ఎరువులకు విత్తనాలకు ప్రతి నియోజకవర్గానికి ఒకచోటనైన stores ఏర్పాటుచేయాలని కోరుతున్నాను. రెండవది, అప్పులు సకాలములో అందడము లేదు అనేకఫిర్యాదులు అందుతున్నాయని అందరు ఆక్షేపిస్తున్న విషయమే అయితే అప్పులు యివ్వాలంటే గ్రామ మునసబు గ్రామ కరణాల సంతకాలు వుంటేనే వ్యవసాయశాఖాధికారులు గ్రామస్థులకు డబ్బుయిచ్చెదరు. లేకుంటే Demonstrator గారిదగ్గరకుగాని జిల్లాఆఫీసరుగారి దగ్గఱకుగాని వెళ్లినను ఏమి జరుగదు. అయినపుడు గ్రామాధికారులుసంతకం చేసినతర్వాత తాలూకా Demonstrator గారు ప్రభుత్వమువారు తాలూకాకు నిర్ణయించిన మొత్తానికి హెచ్చుకాకుండా అన్నిగ్రామాలకుకూడ దామాషా అందేలాగు అప్పుధరఖాస్తులు మంజూరుచేయడానికి జిల్లా వ్యవసాయశాఖాధికారివరకు కాగితములు వెళ్లకుండ అవకాశము యిస్తే వారు వెంటనే మంజూరుచేసి ఆ అప్పులు సకాలములో అందించడానికి వీలువుంటుంది. ఈ మార్పులు చాలత్వరలో చేయవలసిందిగా కోరుతున్నాను. మన ఆంధ్రదేశములోనే కాదు ప్రతిజిల్లాలోకూడ ఒకమూలకు ఇంకొకమూలకు వాతావరణములో చాల మార్పులు ఉన్నాయి. అందువల్ల జిల్లాకురెండైనా Research stations కాని pilot station farms కాని వుండడము చాల అవసరము. ఒకటి మెట్టకున్న మరొకటి మాగాణికున్న ఉండవలెను. పైర్లను పరిశోధించడము అవసరము. ఎన్నెన్ని రకాల ఎరువులో ఎన్నెన్నిరకాల విత్తనాలనో సంక్రమణచేసి నూతనజాతుల సృష్టించడానికి వీలుండును. అలాగే ఎరువులను ఏవిధంగా వినియోగించుకుంటే ఉపయోగకరమో ఇవి అన్నికూడ తెలిసికోడానికి పరిశోధన farms వుండాలి. ఇప్పుడు farms లో పరిశోధనలకు తగినంతడబ్బు లేదని వెళ్లిన ప్రతిచోట ఫారమువారు చెప్పుతుంటారు. మనము ఇంకా అభివృద్ధిచెందవలసివుంది. పరిశోధనవల్ల ఎంతో మనకు ఉపయోగమువుంది. ప్రత్యేకించి ఎంతో ఎక్కువ పరిశోధనకు శ్రద్ధ తీసికుంటారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

SRI P. SURYANARAYANA :— అధ్యక్షా, శ్రీకాకుళంజిల్లాలో ధనవంతమైన పంటలు వరి, రాగి, వేరుసెనగ మొదలైనవి హెచ్చుగా పండుతూ ఉంటాయి. అక్కడ వ్యవసాయిక పరిశోధనాకేంద్రం నిర్మించడానికి ప్రభుత్వం

చాలా కాలంనుండి ఆలోచిస్తున్నారు. దానికి శ్రీకాకుళం దగ్గర రాగోలనిచెప్పి అక్కడ చాలా పెద్దజాగాఉన్నది. అజాగాలో ఒకపరిశోధనా కేంద్రం నిర్మిస్తారని కొన్నివదంతులు వచ్చినవి. ప్రస్తుతం ప్రభుత్వం దానికి ఒక పరిశోధనా కేంద్రం నిర్మించవలెనని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. శ్రీకాకుళందగ్గర కళింగపట్నం అనే గ్రామమున్నది. అది సముద్రపు ఒడ్డు. అక్కడున్న చేపలవారు చాలా ఇబ్బందులుపడుతూ, చీకాకులుపడుతూ ఉన్నారు. అక్కడ ఒక పరిశోధకుడు వచ్చి చేపలను deep sea fishing అని చెప్పేసి సముద్రంలోపలకు ఒక Boat తీసుకువెళ్ళి చేపలుపట్టగా పెద్దచేపలు చాలా హెచ్చుగాపడ్డాయి. అవి తీసుకు వచ్చారు. అక్కడ ఒక cold storage plant నిర్మిస్తే బాగుంటుందని ఒకటి తీసుకువచ్చి ఆమదాలవలసలో ఉంచారు ప్రభుత్వం శ్రద్ధతీసుకుని దానిని అక్కడ నెలకొల్పవలసినదిగా ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

Sri P. SATYANARAYANA :— అధ్యక్షా, ఈ వ్యవసాయం, మత్స్య పరిశ్రమ అనే demandను ప్రతిపాదిస్తూ ప్రధానమంత్రిగారు మత్స్యపరిశ్రమభాగానికి సంబంధించినంతవరకూ ప్రభుత్వం ఏమిచెయ్యాలో తోచడంలేదు, సరియైన సలహాలు శ్రద్ధగా ఇవ్వవలసినదన్న ధోరణిలో చెప్పారు. అంతేగాక ఏదో అడవులలో యుండే ప్రజలసమస్య తెలుసుకుందామంటే ఏదో Malayappan Committee report అంటూ ఒకటి ఉంది. అది ప్రభుత్వానికి ప్రతిపక్షానికీకూడా problems pose చేసి యున్నది. వారి అభిప్రాయం వారు చెప్పుకొనుటకు ఇప్పుడు ఆ గిరిజనులకంటె తక్కువ సంఖ్యకాదు. సముద్రంమీద బ్రతికే మత్స్యకారులకు సముద్రంకూడా చాలా potentialities ఉన్నటువంటి వస్తువ. ఒక ఎకరంలో వ్యవసాయంచేస్తే ఎంత ఆదాయం తీయవచ్చునో ఒక ఎకరం చెరువు ఉంటే అంత ఆదాయం తీసుకోవచ్చునన్నే మాత్రం సర్వసామాన్యంగా అందరికీ తెలిసినటువంటి విషయమే. అంత resourceful వస్తువును పూర్తిగా exploit చేయడానికిగాని అంత ఎక్కువ జనసంఖ్య కల్గినటువంటి మత్స్యకారుల వర్గాన్నిగురించిన సమస్యలు సాకల్యంగా తెలుసుకుని ఒక దృక్పథం ఏర్పర్చుకొని, ఒక plan ఏర్పర్చుకొని పనిచేయడంగాని ఏవిధమైన, పరిశోధన, కృషి ఇంతవరకూ జరగలేదు. మన Legislature libraryకి వెళ్ళి దీన్నిగురించిన సమాచారం కోసంఏదైనా పుస్తకం వెదుకుదామంటే ఎక్కడా దొరకలేదు. అందువల్ల ప్రథమంగా ప్రభుత్వాన్ని కోరేది ఏమిటంటే అనేక కమిటీలు వేశారు. Education Committee అన్నారు. Kuppuswami Committee అన్నారు, అట్లా ఏదైనా ఒక కమిటీవేసి కొన్నిపనులు చేసినా చేయకపోయినా కనీసం ఒక దృక్పథం ఏర్పడడానికి, తెలుసుకుందుకు కనబడడానికి ఆ విషయాలకోసం Experts Committee

26th July 1955] [Sri P. Satyanarayana

ఒకటి వేసి Non-officials తో కూడా సంప్రతించి ఒక report అతికాలంలో తయారుచేస్తే చక్కగా ఉంటుంది. చేపలనేటటువంటిది ప్రస్తుతం available per capita 3½oz. లకంటె దేశంలో లేదు అని 1951 లో Planning Commission వారు వ్రాశారు. దాన్ని 1955 నాటికి 5 oz లకు వృద్ధి చెయ్యాలన్నారు. దానికోసం allotments తయారుచేశారు. ఆంధ్రరాష్ట్రానికి 21 లక్షల రూపాయలు వచ్చింది. ఇప్పటికి 4½ సంవత్సరాలు అయిపోయింది. ఆఖరు సంవత్సరంలో మనం ఉన్నాము. మొత్తం 5 సంవత్సరాలు ఖర్చూ budget estimates అన్నీకలిపితే 10 లక్షల లోపుమాత్రమే యున్నది. మీరు ఇచ్చిన budget estimates ప్రకారం ఇంకా 11 లక్షల రూపాయిలవరకూ మిగిలిపోయింది. దాన్ని బట్టి మనం ఏమీ సాధించలేకపోతూ యున్నామనేటటువంటిది, స్పష్టం అవుతోంది. ఖర్చయిన 10 లక్షలలోకూడా సామాన్యంగా 8 లక్షలరూపాయిలు establishment కు అయిపోతూన్నది. అనిఅంటే దానిలో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. సమస్యలుమాత్రం చాలా దారుణమైన సమస్యలు సముద్రప్రాంతంలో ముఖ్యంగా చేపలుపట్టేవాళ్లు ఎక్కువగాయున్నారు. అట్టివారికి ప్రధానంగా కావలసిన Transport facilities, cold storage facilities, loans, వాళ్ల పరికరాలకు subsidies ఏర్పాటుచేయాలి. తరువాత Loans విషయంలో ఏదో కొంత అయినా హామీ లేకుండా loan ఇవ్వరు. హామీ అంతఎక్కువగా ఉండదు. ఈ పరిశ్రమకు కొంచం ఖరీదైన పనిముట్లు కావలసివస్తాయి. కాబట్టి పెద్దఓడలు, పెద్దబోట్లు అద్దెకుఇచ్చేపద్ధతిలో ప్రభుత్వం స్వయంగా Co-operative సంస్థను పెట్టడం అవసరం. ఈ 5 ప్రధానమైన హంశములలో మన 8 సంవత్సరాల పరిపాలనా వ్యవహారం ఒక inch కూడా పురోభివృద్ధి గాంచినట్లు ఎక్కడా కనిపించడంలేదు.

అందుచేత Fishermen co-operative societies పెట్టమని కొంత మంది గౌరవనీయులైన సభ్యులు ఇక్కడ సూచనలు చేశారు. కాని చాలాచోట్ల Co-operative society లు ఉన్నాయి. మా గ్రామంలో ఒక co-operative society ఉన్నది. అది కొంచం పెద్దఎత్తున ప్రారంభించడం జరిగింది. దానికోసం సుమారు 40 వేలరూపాయిలు కిమ్మతైన ఒక పెద్ద Van ను మూడు సంవత్సరాలక్రిందట ఏర్పర్చారు. కాని ఆ 3 సంవత్సరాలనుంచీ ఇంతవఱకూ ఒక్కరోజుకూడా Co-operative society దాన్ని వినియోగించలేదు. కారణం ఏమిటంటే ఆ Society సక్రమంగా పనిచేయడంలేదు. పనిచేయకపోవడానికి

[Sri P. Satyanarayana] [26th July 1955

కారణం అసలు పరిశ్రమ చేసేవాళ్ళలో విద్య, విజ్ఞానం చాలాతక్కువ. కట్టుబాటు చాలా తక్కువ. Technology చాలా తక్కువ. అంత వెనుకబడినజాతులలో ఆధునికమైన నాగరికతగాని, పరిశ్రమగాని ప్రవేశపెట్టడం చాలా కష్టమైనపని. అందుచేత మనం ఇక్కడ కూర్చుని మీకు ఒక Society register చేశామని ఒక పెద్ద plan వేసి వాళ్ల మొఖానకొట్టేసినంతమాత్రాన ఏమీపని జరగదు. Registration చేయడంతోపాటు efficient గా పనిచేయడం వారికి చెప్పాలి. అందుచేత నా అనుభవంలో తోచిందేమిటంటే చిన్న చిన్న Co-operative units ఎంతమాత్రం పనిచేయవు, unworkable కూడా అనేక గ్రామాలుకలిపి ఒక unit గా తయారుచేసి అందులో సగంవఱకూ Shares ఆ Co-operative society లో ప్రభుత్వం తీసుకొని కేవలం ప్రభుత్వం assistance ఇవ్వడమే కాకుండా participant గా మారి Co-operative movements లో కూడా efficient తో management చేస్తూ economic unit అయ్యే టట్లుగా దాన్ని తయారుచేసి, ఆధునిక పరికరాలన్నీ సమకూర్చినట్లయితే తప్ప కుండా అది అభివృద్ధిలోనికి రావడానికి సావకాశంఉన్నది. ప్రతిజిల్లాలోనూ ఏవో కొన్ని ఆదర్శమైన ప్రాంతాలుంటాయి. ఉదాహరణకు మొత్తం ఆంధ్ర రాష్ట్రంఅంతాకూడా తీసుకుంటే ఎక్కువ Fishermen కల్గినది, తూర్పుగోదావరి జిల్లా. జనసంఖ్యనుబట్టి ఆ ప్రాంతంలో అన్నిటికంటె ఆదర్శప్రాంతమైన గ్రామం ఉప్పాడ. సరాసరి సముద్రం లోపలికి Tar road ఉంది. Transport facility కల్గించితే అక్కడ deep sea fishing కు అవకాశాలున్నాయి.

అందుచేత ఆలాంటిదేదైనా ఒక ప్రాంతము తీసుకొని model గా పెట్టి ఆవిధంగా పనిచేసిన చక్కగా ఉంటుంది. తరువాత ఇంకొక ప్రధాన సమస్య ఉన్నది. కోస్తా ప్రాంతాలలో ఉండేటటువంటి fishermen సమా జానికి సమీపంలో ఉంటున్నామా లేదా అనే ఆలోచనే లేకుండా సముద్రం పొడువునా వాళ్ల నివాసాలు ఏర్పరచుకుంటూ వస్తారు. వాళ్ల వృత్తియొక్క అవసరం కొద్ది వాళ్లుపోతారు. పోనుపోను అసలు main road కు 5 మైళ్లు, 6 మైళ్లు, 10 మైళ్లు, దూరమువరకుకూడ పోతారు. త్రోవలో వారికి, కాలువలు నదులు అడ్డమువస్తాయి. వారికి transport facilities ఉండవు. గనుక చాలా కష్టంగా ఉంటుంది. ఈ సమస్య district planning level లో నేను District Collector తో ఈ విషయం ప్రస్తావించాను. Planning ఎప్పటికైనా Village upwards కావాలికదా. అయితే preference చూస్తే కేవలం మత్స్యకార్మి కులకుసంబంధించినటువంటి item ఎక్కడా కన్పించలేదు. అది ఏమిటి అంటే

మాకు తెలియదు అని వాళ్లు అన్నారు. సరేపోని, ఇక్కడ ఏదైనా State level లో department కు మంత్రులకు మధ్యన ఒక స్కీము తయారై సిద్ధంగా ఉన్నదా, అంటె వాళ్లు బడ్జెటు ప్రవేశపెట్టేటప్పుడు అదేమి కన్పించలేదు. ఏమైనప్పటికీ Planning గురించి నా అనుభవం చెప్పుచున్నాను. ఇప్పుడు ఈ కర్నూలుప్రాంతమే ఉన్నదనుకోండి. ఇక్కడ చేపలు చాలా అవసరము. దానికి ఇక్కడ మంచిరేటు ఉన్నది. హైదరాబాదు, సికింద్రాబాదులోకూడ చాలా రేటు ఉన్నది. కాని అక్కడ సముద్రప్రప్రాంతములో అమ్మకోలేక అవస్థపడు తున్నారు. అక్కడ ఉప్పాడలో పౌను చేప నాలుగు అణాలు అమ్మితే దానికి సరిగా మూడుమైళ్లదూరములోనే ఉన్న ప్రదేశములో ఆ చేప రెండు అణాలకు మాత్రమే అమ్ముచున్నారు. రోడ్లు లేకపోవడమే దీనికి ప్రధానకారణమని చెప్పవలసియుంటుంది. ఇపుడు ఈ First Five Year Plan లో మనకు ఇంకా 10 లక్షలరూపాయలు మిగిలిపోయింది. కాబట్టి కేవలం fisheries కోసం మాత్రమె కాకుండా ఆ fishermen కు కావలసిన ఇతరసదుపాయాలుకూడ మనంచేయాలని కోరుతున్నాను. కొంత విస్తృతమైన భావంతో ప్రవర్తించి వాళ్లకు రోడ్లువేయడంకూడ అందులోనే ఒకభాగముగా తీసుకొంటె బాగుంటుంది. తరువాత కోసపేట అనేవోట, చుట్టు ప్రక్కల 7,8 వేలు జనాభా ఉన్నది. అక్కడ fisheries department వారు ఒక school పెట్టారు. దానికి కాకినాడనుంచి ఒక teacher వెళ్లాడు. వచ్చి అయిదు రోజులయిందో లేదో పారిపోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు. అతనికి అక్కడ ఉండడానికి సాధ్యం కాకపోయింది. అతని భార్యపిల్లలకు ఏదైనా జబ్బుచేసినప్పుడు కొంచెము పాలు కావలసివస్తే, ఆ చుట్టుప్రక్కల ఎక్కడాకూడ పాలు దొరకవు. అంతేకాదు, ఆ చుట్టుప్రక్కల ఎక్కడా గడ్డిపెరిగే ప్రదేశమేలేదు. అందుచేత అక్కడ పశువులులేవు. ఆ ప్రాంతములో 5 మైళ్లు లోపల పశువులు ఉండడానికి వీలులేదు. అందుచేత నేను పారిపోతానని అంటాడు. ఇటువంటి కష్టాలు ఉంటాయి. కేవలం సినిమాలు లేవని పారిపోతారు. ఈ Single teacher schools లాభములేదని వారిమీద అనవసరంగా నెపమువేయడం భావ్యంకాదు. అందుచేత అక్కడవరకు ఒకరోడ్డు గనుక వేసినట్లయితే చాలా అనుకూలంగా ఉంటుంది. ఎవరైన వచ్చిపోవడానికి వీలుగాఉంటుంది. కొంచెము నాగరికత జీవితానికి కావలసిన అవసరాలు కాకపోయినప్పటికి కనీసం ఒకమానవుడుగా బ్రతుకడానికి కావలసిన అవసరాలైనఉంటె, ఇక్కడనుంచి అక్కడికి ఎవరైన వెళ్లడానికి సావకాశం ఉంటుంది. అందుచేత రోడ్డు construction కూడా ఈ scheme లో ఒక భాగంగా తీసుకొని దానికి కొంతడబ్బు sanction చేయాలని కోరుతున్నాను.

Sri P. Satyanarayana] [26th July 1955

తరువాత Fish curing yards అనిఉంటాయి. ఈ విషయంలో budget estimate చూచినట్లయితే, salt subsidies క్రింద 1,60,000 రూపాయలు grant ఉంటే, 70 వేలు, 10 వేలు, 15 వేలు మొత్తాలు ఖర్చుఅయినాయి. చాలా మిగిలిపోయింది. సముద్రపుప్రాంతాలలో ఉండేటటువంటి పల్లెటూళ్లలో మత్స్యకార్మికులు తప్ప మిగతావాళ్లు చాలా బాధపడుతున్నారు. వాళ్ళకు సరియైన fish curing yards ఉండవు. అవి లేకపోవడంవల్ల తమ ఇండ్లదగ్గరనే చాలా దుర్గంధభూయిష్టమైన తొట్లు అన్నీ పెట్టుకొని ఊరంతా damage చేస్తున్నారు. ఆ yard లోకి తీసుకుపోమ్మంటే, ఆ yard అయినా సరియైన order లో ఉండదు. ఇప్పుడు salt subsidies క్రింద చాలా డబ్బు మిగిలిపోతున్నది. ఆ డబ్బును ఈ fish curing yards కు వినియోగించి వారికి సరియైన సదుపాయాలు కల్గించినట్లయితే, వాళ్లు ఇండ్లదగ్గర fish curing పెట్టుకోకుండా తప్పకుండా yard లోకే వెళ్లుతారు. వాళ్ళకు సరియైన Fish curing yards ఉండవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఒక్కొక్కప్పుడు చేపలు ఒకే గుంపుగా వచ్చినప్పుడు, వారు ఒకతూరి ఊరిలోకి వచ్చినతరువాతకూడ ఇంకా చేప అక్కడ ఉన్నదంటే, మరల ఆ రాత్రేపోయి తీసుకువస్తారు. తీసుకువచ్చి ఆ yard లోపడవేస్తామంటె, అక్కడ lighting facilities లేవు. అందుచేత ప్రతి yard కు lighting facilities ఉండాలి. ఈ వేళ electricity అక్కడ ఉన్నదిగాని, lighting అంతవరకు extend కాలేదు. అందుచేత, ఈ wire-netting arrangements, lighting facilities, cement tubes, ఈ విధమైనటువంటి ఏర్పాట్లను సక్రమంగా yards లో తయారుచేసినప్పుడే, గ్రామాలను పాడుచేయకుండా చేప అంతాకూడ yards లోకి వెళ్ళడానికి వీలంటుంది.

తరువాత silk industry కూడ ఈAgriculture Demand లో నేవస్తుంది. Central Silk Board అనేది ఢిల్లీలో ఉన్నది. అది చాలాకాలంనుంచి పని చేస్తున్నది. ఎక్కడైనా ఏకొద్ది silk పరిశ్రమ ఉన్నప్పటికిని, వాళ్లు grant ఇస్తారు. మన రాష్ట్రంలో మనం ఈ grant ను ఏమాత్రము తెచ్చుకొంటున్నట్లు కన్పించదు. మన ఆంధ్రదేశంలో, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, అనంతపురం, ఈ మూడు జిల్లాలలోను silk పరిశ్రమ ఉన్నది. ఈ ప్రాంతములలో కోటి రూపాయల turn over కు పైగానే pure మలబార్ సిల్కు ఉత్పత్తి అవుతున్నది. 1940 సంవత్సరం ఆ ప్రాంతములో సామర్లకోట agricultural farm లో silk cacoons పెంచేటటువంటి ఏర్పాటు ఉండేది. రెండు మూడు సంవత్సరాలైన

తరువాత ఎందుకో అది తీసివేశారు. కాని నేను అక్కడకు వెళ్లినప్పుడు అక్కడ ఉన్న సూపరెండెంటును ఆ file చూపించమని అడిగితే, ఆయన కష్టపడి ఆ file తీసియిచ్చాడు. ఆ file చూచినప్పుడు, అందులో concluding remarks లో "ముఖ్యంగా తూర్పుగోదావరిజిల్లాలో టస్సార్ అనబడేటటువంటి silk విపరీతంగా తయారుచేయడానికి, సరియైన సదుపాయాలు, సౌకర్యాలు ఇక్కడ ఉన్నవి." అని అందులో వ్రాయబడింది. కాని ఈనాడు ఎందుచేత అదితీసివేశారో నాకు తెలియకుండా ఉన్నది. అక్కడ, చుట్టుప్రక్కలను కాకినాడ, పెద్దాపురంలోకూడ silk ఉత్పత్తి చేయవచ్చు, ఆముదపుచెట్టు ఆకుతోటి టస్సార్ శిల్కు తయారవుతుంది. కోటిరూపాయలు turn over ఇదివరకే మన ఆంధ్రదేశములో ఉన్నది. ఇప్పుడు ఇతరరాష్ట్రములనుంచి తెప్పించుకొని ఎంతో అవస్థపడుతున్నాము. అందుచేత దీన్నిగురించి ప్రత్యేకశ్రద్ధతీసుకొని, ఇక్కడ మన రాష్ట్రంలో local గానే cacoons పెంచి ఆటస్సార్ సిల్కును ఉత్పత్తిచేసేటటువంటి సదుపాయము చేయవలసిందని నేను కోరుతున్నాను.

4 P.M.

THE HON. SRI B. GOPALA REDDI :— అధ్యక్షా, ఈ డిమాండు యొక్క ప్రాశస్త్యము సభ్యులందరు గుర్తించి అనేకమైనసూచనలు చేశారు. చాలా సంతోషమయిన విషయము. ఇందులో కొన్నిసూచనలు, యీ డిమాండుకు సంబంధించినవి కాకపోయినను, పశువులు, వెటరినరీ హాస్పిటల్ విషయముకూడా చెప్పారు. బహుశ ముందుగా యీ వెటరినరీ డిమాండు చర్చిస్తామో లేదోనని ఉద్దేశ్యముతో, కాబోలు, పశువులకు సంబంధించినంతమటుకు ఈసమయంలో చెప్పడము కొంతవరకు సమంజసమేమో ననికూడా అనుకుంటున్నాను. గౌరవసభ్యులు సత్యనారాయణగారు కేవలము 10, 15 నిమిషాలపాటు fisheries ను గురించి ఎన్నో సమస్యలు మాట్లాడడము చాలా సంతోషమైనవిషయము. ఒక్కటేవిషయము తీసుకొని అందులో కొంతవరకు ఉపేక్షింపబడిన యీ Fisheries శాఖనుగురించి ఎన్నో సంగతులు వారే చెప్పినందులకు చాలాసంతోషించాను. అదేమాదిరిగా కొందరు గౌరవ సభ్యులు కొన్ని చిన్నచిన్న departments ను గురించి specialise చేసి వానియొక్క మంచిచెడ్డలు అన్నీ పరిశీలించి వాటిమీదవచ్చిన రిపోర్టులుఅన్నీ చూచి, ఆఫీసర్లతో మాట్లాడుతూ, ఆయా డిపార్టుమెంట్లసంగతి అప్పుడప్పుడు గమనిస్తూండడము చాలా సంతోషకరమైన విషయము. ఈవిషయములో వారు మాట్లాడినందులకు నేను వారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. అయితే ఒకవేళ మనం మత్స్యపరిశ్రమ విషయములో ఇంతవరకు ఎక్కువగా చేయలేకపోయినామేమోగానీ, రాబోయే ద్వితీయపంచవర్ష ప్రణాళికలో fisheries depart-

[SRI B. Gopala Reddi] [26th July 1955

ment ను గురించి కొంత శ్రద్ధవహించి, సభ్యులుచెప్పిన విషయాలన్నీ గూడా చేయటానికి వీలులేకపోయినా కొంతవరకు అయినాచేయడానికి పూనుకుంటాము. ఈవిషయాలు అన్నీ గూడా ప్రభుత్వమువద్దవున్నవి. కాని ధనాభావము వల్ల అనుకోండి, లేక మరొక కారణమువల్లననుకోండి, ప్రభుత్వమువారు యివి ఒక్కొక్కటే తీసుకోలేకుండా పోతూన్నారు. ఇప్పుడు రోడ్లు ఎక్కువగా వేయాలని సత్యనారాయణగారు ఎక్కువగా చెప్పారు. ఆ విషయముకూడా ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఆచరణలో పెట్టబడుతుంది. "Provision for drinking water facilities in fishing villages" అని ఒకటి వున్నది. తరువాత "Introduction of new types of fishing nets, opening of 100 schools for fishermen's children" ఇటువంటివి అన్నీకూడా వున్నవి. ఇవన్నీకూడా కొంతవరకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వేసుకొని దాదాపు 55 లక్షలరూపాయలు ఖర్చుచేయాలని ప్రభుత్వమువారు నిశ్చయించుకున్నారు. వాటికి తగిన ప్రణాళికలుగూడ తయారుచేసికొని వున్నారు. కాని అక్కడ ప్లానింగు కమిషనువారు వీటిని ఎంతవరకు మంజూరుచేస్తారో, మన ప్లానుయొక్క సైజు ఎంతవరకువుంటుందో, అదంతాకూడా యిప్పుడే నిశ్చయంగా చెప్పలేకుండా వున్నాము. ఒకవేళ అది తగ్గినప్పుడు యిదికూడా కొంత కోతబడివస్తుందేమోగాని, యీవిషయములో కొంతవరకు plans తీసుకుని, 55 లక్షలరూపాయలు వచ్చే అయిదేండ్లలో యీద్వితీయపంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేలోపుగా ఖర్చుపెట్టటానికే అంచనాలు వేశారు. ఈప్రణాళికలోనే సత్యనారాయణగారు చెప్పిన అనేకవిషయాలు రావడానికి వీలుంటుంది.

ఇక seri culture విషయము తెలియజేస్తాను. బహుశ యిది Industries Department లో వున్నది అని అనుకుంటాను. నాకు తెలిసినంతమటుకు Agriculture Department వారుకన్న దీన్ని Industries Department లోనే దాన్ని deal చేస్తూంటారు. Industries demand వచ్చినప్పుడు దీన్ని గురించి చెప్పవచ్చును. కాబట్టి దీన్నిగురించి ప్రత్యేకంగా యిప్పుడు నేను చెప్పనక్కరలేదు. Agriculture విషయములో Demonstrators చేయవలసిన విద్యుక్తధర్మములను విస్మరించి ఎరువులు అమ్మడము, పట్టాలు అమ్మడము, వగైరాపనులు అన్నీ చేస్తున్నారు, వారేపనికి నియమించబడ్డారో ఆపని చేయడములేదు, అని గౌరవసభ్యులు ఉపన్యాసాలలో చెప్పారు. ప్రభుత్వమువారు యీవిషయము పదేపదే ఆలోచిస్తూనే వున్నారు. కొంత కాలమునుంచి ఎరువులు, పట్టాలు అన్నీగూడా యీడిమాన్స్ట్రేటర్సే అమ్ముతూ

వచ్చారు. కాని వారు Technical people గా వుండి Agriculture Graduates గావుండి, కేవలము salesmen గా వుండడము మంచిదికాదన్నే వుద్దేశ్యముతో మనము మద్రాసులో వున్నప్పుడే, యీపని Co-operative department కు యివ్వడంకూడా జరిగింది. అందువల్ల యీ demonstrators యీనాడు కేవలము ఆఫీసువర్కు చేస్తున్నారు. నెలకు 20 దినములు వారు tour చేయాలనిన్నీ, గ్రామాలలో ప్రచారము చేయాలనిన్నీ instructions వున్నవి. ఇంకను యీ demonstrator's కు సంబధించినంతవరకూ, ప్రతితాలూకా demonstrator's office లోనూ ఎరువులు అమ్మడానికిమాత్రము ప్రత్యేకంగా ఒక clerk వున్నాడు. అతను యీ పనిఅంతా చూచుకుంటూ వుంటాడు. Demonstrator నెలకు 20 రోజులు tour చేసి వ్యవసాయపరికరాలు రైతులకు కావలసినంతమటుకు యివ్వడం, వారికివున్న సంశేహాలుతీర్చడం, యిదంతా చేయించటానికి ప్రభుత్వము ప్రయత్నించుచున్నారు. అందువల్ల యీ విషయములో సభ్యులకు వున్నటువంటి అనుమానాలు కొంతమటుకు తీరిపోగలవని నమ్ముతున్నాను. ఎరువుల విషయము కో ఆపరేటివు డిపార్టుమెంటువారికి యివ్వడమో లేక మరియింకా agri-culture department ద్వారా యిదివరకు మాదిరిగాచేయడమో, అది అంశమూ కూడా గమనించవలసి వున్నది. అది గమనించి కేవలము యిది వ్యవసాయప్రచారానికి ఎక్కువగా ఉపయోగించటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుంది.

ఇక manures విషయములో అదనుకు సరిగా దొరకడములేదని, తరువాత యివి bottle-necks గా వుంటున్నాయని, దీనివల్ల రైతులకు చాలా యిబ్బందులు కలుగుతున్నాయని నాకు కొన్నికొన్నిచోట్లనుంచి టెలిగ్రాములుకూడా వచ్చినవి. దానిమీద యీ విషయము Government of India వారికి తెలిపి, సింధ్రీఫాక్టరీ వారిదగ్గరనుంచి ఇరవై వేలటన్నుల ఎరువులు మనకు వచ్చేట్లుగా ఏర్పాట్లు చేస్తున్నాము. ఇదికాకుండా మనకు సింద్రి ఫాక్టరినుంచి ప్రతిదినము కొన్ని టన్నులప్రకారము యీ 20 వేల టన్నుల ఎరువులు రావటానికికూడా ఏర్పాటుచేశారు. నిన్ననో యీరోజో యీ ఏర్పాట్లు అన్నీ finalise చేస్తూ, ఎరువులు సింద్రీఫాక్టరీనుంచి రావటానికి వీలుకలుగజేస్తున్నాము. అందువల్ల 20 వేల టన్నుల ఎరువులు సింద్రిఫాక్టరీనుంచిన్నీ, యింకా అయిదువేలటన్నులు foreign imported manures కూడా యిక్కడ మన జిల్లాలకు వస్తాయి. దానివల్ల యిప్పుడువున్న అలజడి కొంతతగ్గుతుందనికూడా తలుస్తున్నాము. దానివల్ల railway bottle-necks మొదలైనవన్నీకూడా తీర్చి

పోతాయి అని అనుకుంటున్నాను. పోయినసంవత్సరము మనకు 75 వేల టన్నుల ఎరువులు సింద్రిఫాక్టరీనుంచి వచ్చినవి. అందువల్ల ఈ సంవత్సరముకూడా వస్తాయి అని, రైతులకు యివ్వటానికి కావలసిన సౌకర్యాలు జరుగుతాయని నేను ఆశిస్తున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు మార్కెటింగు పద్ధతులను నేర్పట agriculture graduate courses లో ఒకభాగముగా వుండాలని చెప్పారు. ఇప్పటికిప్పుడే agriculture colleges లో final year class లో marketing course వున్నదని చెబుతున్నారు. కాబట్టి వచ్చే Demonstrators కొంతవరకు marketing ను గురించి చదివి తరఫీదై వస్తారు. ఇప్పుడు అన్ని జిల్లాలలోనూ commercial crops వేస్తున్నారు. Commercial crops వున్నచోట్లలో marketing societies ప్రభుత్వమువారు ఏర్పాటుచేసి notify చేశారు. ఒక్క నెల్లూరుజిల్లాలలోతప్ప తక్కిన అన్నిజిల్లాలలోను commercial crops వుంటున్నవి. కాని నెల్లూరుజిల్లాలో commercial crops వేయడములేదు. అందువల్ల అక్కడ మార్కెటింగు సొసైటీపెట్టలేదు. ఇటీవల యీ వారములో కాకోలు పశ్చిమగోదావరిజిల్లాలో కూడా కొన్ని commodities కొరకు notify చేశారు. గుంటూరు జిల్లాలో పొగాకువున్నది. కృష్ణాలో పొగాకు వేరుశనగ ; తూర్పుగోదావరిజిల్లాలో పొగాకు, కొబ్బరికాయ ; కర్నూలులో ప్రత్తి, వేరుశనగ; అనంతపురంలో ప్రత్తి, వేరుశనగ; విశాఖపట్టణములో వేరుశనగ, బెల్లం; శ్రీకాకుళం జిల్లాలో వేరుశనగ, జనుము, కడపజిల్లాలో మిర్చి, వేరుశనగ, పసుపు, చిత్తూరుజిల్లాలో వేరుశనగ, బెల్లం, పశ్చిమగోదావరిజిల్లాలో పొగాకు; ఈ crops కు అన్నిటికీకూడ marketing societies పనిచేస్తున్నవి. నెల్లూరుజిల్లాలో తప్ప తక్కిన అన్నిజిల్లాలలోగూడా మార్కెటింగు సొసైటీలుపెట్టి, అక్కడ ఉత్పత్తిదార్లకు సరియైన సౌకర్యాలు కలుగచేయడానికి ప్రభుత్వమువారు ప్రయత్నిస్తున్నారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— మార్కెటింగు బోర్డులు ఏర్పాటుచేస్తే వాటిక్రింద marketing yards విషయముగూడ వస్తుంది. ఇప్పుడు పొగాకువచ్చినచిక్కు యేమిటంటే, రెండుమూడు yards ను ఏర్పాటుచేసి తక్కినవి వదలి వేస్తున్నారు. అందువల్ల కొనుగోలుదారు యిక్కడ మార్కెటులో కొనకుండా బైటకువెళ్లి రైతులదగ్గర కొంటున్నాడు. అందువల్ల మార్కెటుచేసేవారు దెబ్బతినవలసి వస్తున్నది.

THE HON. SRI B. GOPALA REDDI :—గుంటూరులో మార్కెటింగు యార్డు పెట్టివున్నారు. దానికివున్న సౌకర్యాలు అసౌకర్యాలు అన్నికూడా మొన్న శ్రీ టి. టి. క్రిష్ణమాచారిగారువచ్చినప్పుడు వారికిచెప్పారు. ఆయార్డునుచూచి అన్ని సంగతులు స్వయముగా వారు తెలుసుకున్నారు. అయ్యన వచ్చినప్పుడు ఈ marketing yard ను గురించి పెద్ద ఆందోళనచేశారు. కారణమేమిటంటే, ఒక yard పెట్టినపుడు, రైతులు తమ crops ఆ యార్డుకు తీసుకొనివచ్చి, అక్కడనే అమ్మవలసింది, యితరచోట్లలో అమ్మకూడదు, అని చెప్పితే యీ condition ను ఒక్కొక్కసారి మనము ఎక్కువగా impose చేసి నిర్వహించలేకపోతాము. దానివల్ల అనేక కష్టసుఖాలు ఉంటాయి. ఆ విషయము మనము క్రమేణ చూచుకోవలసిందేగాని, ఒకేసారిగా వాటిని సరిదిద్దుకోవడం కష్టం. మనకు yard ను ఏర్పాటుజేశారు, అంతా జరుగుతుందని సంతోషపడితే లాభములేదు. ఇది క్రమేణ జరగవలసిన విషయము. Marketing facilities కోసం ఎన్ని సదుపాయాలు చేయవలెనో అన్నీ చేయవలసి యుంటుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Marketing ను control చేయకపోతే అది సాధ్యముకాదని నా అభిప్రాయము.

THE HON. SRI B. GOPALA REDDI:—తరువాత agricultural prices విషయముకూడా సభ్యులు చాలామంది మాట్లాడుతున్నారు. ఈ విషయములో చాలామటుకు ఆందోళగానే వుంటున్నదనికూడా నాకు తెలుసు. ఇటీవల 10, 15 రోజులుగాకొంతవరకు agricultural pricesకు upward tendency వున్నట్లు కనబడుతున్నది. నాకు తెలిసినంతమటుకు బియ్యంధరగాని, యితరవస్తువులధరలుగాని కొంచెము పైకిపోతున్నట్లు వున్నది. ఈ విషయములో మన ప్రభుత్వమువారు కేంద్ర ప్రభుత్వమువారితో చేయవలసిన సంప్రదింపులు అన్నీ చేశారు. ఈ విషయములో కేంద్ర ప్రభుత్వమువారు యిటీవల ఒక కమిటీని వేశారు. వారుచెప్పింది సభ్యులకు కూడా కొంతవరకు తెలిస్తే బాగుంటుందేమోనని నేను అనుకుంటున్నాను. Government of India వారు

**"The position is being watched and suitable corrective action will be taken if need arises. It may however be realised that the prices of rice, have of late been showing an upward trend. And it is not necessary at this stage to**

[Sri B. Gopala Reddi] [26th July 1955

start price support operations, as has been done in the case of wheat and some coarse grains" అని చెప్పారు. కాబట్టి అది మనము జాగ్రత్తగా పరిశీలిస్తున్నాము. ఇప్పుడు ధరలు కొంచెము పైకి పోయేటట్లుగా కన్పిస్తున్నవి. అందువల్ల యిప్పుడు rice pricess కు support operations అన్నీ గూడా వెంటనే చేయవలసిన అవసరము లేదేమోనని చెబుతూ, మరల వారు ఒక కమిటీని ఏర్పాటుచేశారు. ఈ agricultural prices ఒకచోట వున్నవి యింకొకచోట లేవు. ఈ variations అన్నిటికీ కారణము ఏమిటో ఆలో చించాలి. దీని విషయములో ఏమి చేయాలి అనేదానికే ఈ కమిటీని వేశారు.

An. hon. MEMBER :—రైతులు తమయొక్క stock అమ్మవలసిన తరుణములో మంచిరేటు రాదు. ఇప్పుడు రైతులు వున్న సరుకు అమ్ముకున్నారు. సరుకు చేతులలోనుంచి దాటిపోయింది. సరకు అంతా యిప్పుడు business people చేతులలో వున్నది. ఇప్పుడు ధర పెరుగుతున్నట్లు కనబడుతున్నది. ఆరంభంలో వేరుశనగకు ధర 3 రూపాయలు వున్నది. ఈ ధర యిప్పటివరకూ వున్నది. ధర పెరగదని, యింకా తగ్గిపోతుందని రైతులు సరకు అంతా అమ్ముకున్నారు. ఈ సరుకు అంతా business people, చిన్న చిన్న మిల్లర్లు కొనడమువల్ల, వాళ్లచేతులలో యీ సరకు వుండిపోయింది. రైతుచేతులలో నుంచి దాటిపోయింది. ఇప్పుడు ధర పెరిగింది, 4 రూపాయలు అయింది. అదికాకుండా యిప్పుడు రైతులు విత్తనాలు కొనవలసిన సమయము. కాబట్టి యీ టైములో పెరిగిందని సంతోషించటానికి వీలులేదు. దానివల్ల సంతోషించవలసిన టైము పోయింది, దుఃఖించవలసిన టైము వచ్చిందని చెప్పవలసియున్నది.

The Hon. Sri B. GOPALA REDDI :—మనము దీనికి కావలసినటువంటి మార్కెటింగు ఫెసిలిటీసు ఎక్కువ చేసుకోవలసివుంటుంది. క్రెడిట్ ఫెసిలిటీస్ కూడా ఎక్కువ చేసుకోవలసిన అవసరంవుంటుంది. ఇంకా అనేకవిషయాలు దీనికి సంబంధించినవివున్నవి. ధరల కంట్రోలు విషయములో మాత్రము కేంద్ర ప్రభుత్వమువారు ఒక కమిటీని వేసినారు. మనబోర్డు మెంబరు శ్రీ పాయిగారినికూడా వారితోపోయి ఆంధ్రదేశములోని విషయములు అన్నీ పరిశీలన చేయవలసినది అని ప్రభుత్వమువారు చెప్పినారు.

ఇటీవల చాలామందివచ్చి సుగరు కేను విషయము నాకుచెప్పినారు. ఉన్న పరిస్థితులను కొంతవరకు సవరిస్తే బాగుంటుందనికూడా కొందరు చెప్పినారు. ఇప్పుడు

ఉన్నటువంటి నిబంధనల ప్రకారం రిజర్వు ఏరియాల్లోనివారు తమ ఇష్టమువచ్చినప్పుడు ఫ్యాక్టరీకి చెరుకుఇస్తే వాళ్లుతీసుకునితీరాలి. వాళ్లమీద ఫ్యాక్టరీకి ఇచ్చితీరాలి అన్న ఆబ్లిగేషను ఏమీలేదు. బెల్లముధర పెరిగినప్పుడు ఫ్యాక్టరీ ఏమైనప్పటికినీ మాకు సంబంధము లేదన్నరీతిగా చెరుకుపండించే రైతులు బెల్లము తయారుచేసుకుంటారు. మళ్లీ బెల్లము ధరలగ్గినప్పుడువచ్చి మా చెరుకే తీసుకొని తీరాలి అని ఒత్తిడిచేస్తున్నారు. ఒక్కసారి ఫ్యాక్టరీవాళ్లుకూడా వాళ్లప్లానుప్రకారం సరుకుతీసుకోలేకుండా పోతున్నారు. ఇది సరిగాలేదు. యాక్టును సవరించమని కొందరు చెబుతున్నారు. మొదటనే షుగరు కేను గ్రోయర్సుకు సహాయముచేస్తున్నామనే ఉద్దేశ్యంతో వాళ్లకు ఎట్లాకావాలంటే అట్లా అప్షనుఇచ్చి పనిచేసుకుంటూ వచ్చారు. కాని ఇప్పుడుఉండే పద్ధతిప్రకారము పనిబాగా జరుగడము లేదు. అనకాపల్లి ఏరియాలోని వారంతాకూడా రిజర్వు ఏరియాబయటకుపోయి మేము షుగరుకేను కొనుక్కుంటాము మమ్ములను allow చేయండి అంటే ఒక్కొక్కసారి allow చేస్తుంటాము, లేకపోతేలేదు. ఇది చట్టవిరుద్ధం. ఈ మాదిరిగా కొన్ని ఇబ్బందులు ఉన్నాయి. ఆ విషయములో ప్రొడ్యూసరులతో ఫ్యాక్టరీవాళ్లతో సంప్రతించి అందరికి క్షేమకరంగా వుండేపద్ధతి మనము ఏర్పాటు చేసికోవలసివుంది. బొబ్బిలి, శీతానగరము ఫ్యాక్టరీల విషయంలో అగ్రికల్చరు డైరక్టరుగారు ఆగస్టు మొదటివారములోపోయి వారితో సంప్రదిస్తారు. అక్కడ ఎన్నెన్ని గ్రామాలు రిజర్వు ఏరియాలో పెట్టుకోవాలో, లేకపోతే రాయగడకు పోవడానికి అవసరమైతే ఎటువంటి సౌకర్యాలు కలుగజేయాలో, ఇవన్నికూడ నిర్ణయం చేసుకోవలసి వున్నది. ఎందుకు అంటే, ఈ నాడు బొబ్బిలి, శీతానగరము వారికి కావలసిన షుగరుకేను కన్నాకూడా ఎక్కువగా ఉత్పత్తి అవుతున్నది. ఉత్పత్తిచేస్తున్న వాళ్లందరూ అవసరమైతే ఫ్యాక్టరీలు మొత్తము అన్నింటికికూడా సప్లయి చేస్తాము తీసుకోవాలిఅన్న మాటగా చెప్పారు. ఒక్కొక్కసారి బెల్లముధర ఎక్కువగా ఉన్నప్పుడు వారు బెల్లము తయారుచేసుకుంటారు. ఇది బహుశః అక్కడ ఎక్కువలేదేమో అనుకుంటాను. అనకాపల్లిలో ఎక్కువగా ఉన్నది. మొత్తమువీద దీనివిషయములో ఏమి చేయాలో ఆలోచించి అందరికి న్యాయముగా ఉండేటట్లు, ఎవరికి కష్టముకలుగనట్లుగా మనముచేసుకోవలసిన తరుణమువచ్చింది. ఒక్కొక్కచోట సర్‌ప్లస్ ప్రొడక్షను కూడా జరుగుతోంది. దీని విషయము మనము శ్రద్ధగా చూసుకోవలసి ఉన్నది. ఇంకా మనరాజుగారు ఈ షుగరుకేను సెస్‌ఫండు సక్రమముగా వినియోగించాలన్నారు. దీనిమీద పోయినసంవత్సరము నాలుగున్నర లక్షల రూపాయలు వచ్చింది. 1953 సం॥ము అక్టోబరుముందు మనకు రావలసిన డామాషా

మద్రాసు గవర్నమెంటులో ఇంకా విభజనకాలేదు. అది విభజన అయినతరువాత ఈ ఫీడరురోడ్లు విషయములో, షుగరుకేను రీసెర్చి విషయంలో కొంత సొమ్ము ఖర్చు పెట్టాలని ప్రభుత్వమువారు ఆలోచిస్తున్నారు. ఈ ఫీడరురోడ్లు విషయములో అగ్రికల్చరల్ డిమానుస్ట్రేటరు ఇప్పటికి రిపోర్టులు పంపించిఉన్నారు. కొంత మొత్తము రోడ్లకోసము ఖర్చుపెట్టుతామని హామీ ఇస్తున్నాను. ఆ విషయములో ఎలాంటి అపోహ అవసరములేదు.

ఇంకా ట్రాక్టర్ల విషయముచెప్పినారు. ట్రాక్టర్ల విషయములో కొంతమంది అప్పుపద్ధతిలో తీసుకొంటున్నారు. Hire purchase basis లో కొంత జరుగు తున్నది. కాని ఒకసారి అందరకు ట్రాక్టర్లను ఇవ్వలేకపోతున్నారేమో అనిపిస్తోంది. ఈ ట్రాక్టర్లకు ఇప్పుడు చాలా ఎక్కువధరలు వున్నాయి. అవి మామూలు వాళ్లకు అందుబాటులో లేవనికూడా చెబుతున్నారు. అని తగ్గించాలంటున్నారు. వాటిమీద పెడుతున్న సొమ్ము, ఇంటరెస్టు, ప్రిన్సిపల్ వగైరాలు, working expenses ఇవన్నీకూడా చూచుకున్నప్పుడు అద్దె తగ్గించడానికి వీలులేకుండా పోతున్నాము. ఇప్పటికీకూడా ఆ విషయములో ఇంకా దీర్ఘంగా ఆలోచించి ఏమి చేయడానికి వీలవుతుందో అది చేసుకోవలసివుంది. ట్రాక్టర్లు చెడిపోయినప్పుడు రిపేరు చేయడానికి తగిన సదుపాయములు లేవని కొందరు సభ్యులు అన్నారు. ఇంతకుముందు ఉమ్మడి మద్రాసురాష్ట్రములో కోయంబత్తూరులో ఒకటి. బాపట్లలో ఒకటి వీటికోసము అగ్రికల్చరలు వర్కుషాపులు వుంటూవచ్చాయి. ఇప్పుడు మనకు కోయంబత్తూరులేదు కాబట్టి, బాపట్లలో ఒకటి ఉన్నది. రాయలసీమకు సంబంధించినంతవరకు ఒకటి శాంక్షను చేసినారు. అది త్వరలోనే వస్తుంది. ఇక్కడ రాయలసీమ ప్రాంతములో వున్నటువంటి మరమతులు చేయడానికి అన్నీ అసౌకర్యంగా వుంటుంది అని అనుకొంటున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—సర్కారులలో వున్నది ఒక మూల వున్నది కాబట్టి, శ్రీకాకుళం, విశాఖజిల్లాలవారికి అందు బాటులో వుండేట్లుగా ఒకటి శ్రీకాకుళములో పెట్టాలి.

THE HON. SRI B. GOPALA REDDI :—అదికూడా ఆలోచించవలసిన విషయమే. ఎందుకంటే, శ్రీకాకుళమునుంచి బాపట్లకు పంపాలంటే చాలా దూరము అవుతుంది. అందువల్ల వీలైతే ఉత్తరజిల్లాలలోకూడా ఏదైనా ఒకటి పెట్టడానికి ఆలోచించవలసి ఉంటుంది. ఇంకా రిఫ్రెషర్ కోర్సులనుగురించి గోపాలకృష్ణయ్యగారు చెప్పారు. అవి ఇప్పటికే ఉన్నాయి. కాని వాటిని చదువుకునే

వారు తక్కువ అవుతున్నారు. వాళ్లకు మేము స్టైఫండు ఇచ్చి మీరందరూ నచ్చిచనువుకోండి, ఆరునెలలకోర్సు ప్యాసుకాండి, అంటేకూడా ఎవరూకూడా అప్లై రావడము లేదు. ఎక్కువమంది అప్లయిచేయడము లేదు. అందువల్ల ఆ విషయములో కొంత ప్రచారము జరుగవలసిన అవసరము ఉంది. అనేక మంది ఈ ఆరునెలలకోర్సు ప్యాసు అయితే మంచిదనే ఉద్దేశ్యముతో గవర్నమెంటువారు వాటిని ఏర్పాటు చేస్తున్నారు. అయినప్పటికీ ఎవరు రావడములేదు. ఇంకా రీసెర్చి స్టేషనులు వగైరాలు అన్నిటిని గురించి చెప్పారు. దాదాపు ఎన్నో ప్రాంతాలలో 23 రీసెర్చి స్టేషనులు ఉన్నాయనుకుంటాను. ఇవన్నీకూడా ఇంకా జిల్లాకు 1,2 చొప్పునఎక్కువ చేయాలని వెంకయ్య గారు చెప్పారు. ఇది కొంతవరకు అక్కడ ఢిల్లీప్రభుత్వము వారితో కూడ, ఇంపీరియల్ అగ్రికల్చరల్ రీసెర్చి కౌన్సిలు వాళ్ళతోకూడా, మాట్లాడి ఇంకా ఎక్కువచేయడానికి మేము ప్రయత్నము చేస్తున్నాము. ఎందుకు అంటే, ఈ నాడు అనేక కొత్త విషయాలు వస్తున్నవి. అనేక ప్రాంతాలలో అనేక కొత్తకొత్త పంటలు వస్తున్నవి. అవన్నీ వేసినప్పుడు- కొత్తసదుపాయాలుకూడా మనము చేసుకోవలసి వున్నది. రేపు మనకు ప్రాజెక్టులు ఎక్కువ అయినప్పుడు కేవలము మనము రైస్‌మీదనే ఆధారపడి ఉండడానికి వీలులేదు. అనేక రకములైనటువంటి, నూతనమైనటువంటి కమర్షియల్ క్రాప్సు అన్నీకూడా మనము పెంపొందజేసుకున్నప్పుడే మన ఆర్థిక స్థితి సరిగావుంటుందిగాని లేకపోతే మనము తయారుచేసే బియ్యముఅంతాకూడా ఏమవుతుందో అని అనుకోవలసివస్తుంది. ఇప్పటికి మూడు లక్షల టన్నులు సర్‌ప్లస్‌లో ఉంటోంది. రేపు ఈ ప్రాజెక్టులు అన్నీకూడా వచ్చినప్పుడు కొన్ని లక్షలు ఎక్కువ అవుతుంది. అందువల్ల మనము ఎక్కువ రైసు మీదనే ఆధారపడడానికి వీలులేదు. మనము diversified agricultural ను కూడా చేసుకోవలసిన అవసరము ఉన్నది. ఈవిషయములో రైతులందరుకూడా ఇప్పట్నుంచి కొంత ఆలోచించి దీనికి తగినటువంటి సహాయము డిపార్టుమెంటువారి వద్ద నుంచి పొంది కొత్తరకమైనటువంటి పంటలుకూడా వారు పెంపొందచేసుకోవాలని కూడా మనవి చేస్తున్నాను.

Sri P. GOPALA REDDI :—మెన్యూర్సు డిస్ట్రిబ్యూషను గడచిన సంవత్సరము చేసినట్లుగా వెండరు ఫరమ్సు ద్వారా చేయిస్తారా లేక ఎవరిచేతనైన ఇప్పించేవిధానం అమలు చేస్తారా? పోయిన సంవత్సరము వెండరు ఫరమ్సుద్వారా వచ్చిన మెన్యూర్సు ఆయా జిల్లాలలో సరిగా కాకుండా బార్డరుఏరియాల్లో ప్రక్క రాష్ట్రాలకు పంపబడింది. అది ప్రభుత్వ దృష్టికివచ్చినది. ఇప్పుడు ఏదైనా సవరణచేసినట్లు మంత్రిగారు సెలవిస్తే బాగుంటుంది.

[The Hon. Sri B. Gopala Reddi] [26th July 1955

ఇప్పుడు ఉన్నటువంటి ఏర్పాటు డిశంబరు ఆఖరువరకు వుంటుంది. నాకు కూడా ఆపద్ధతి అంత తృప్తికరంగాలేదు. చాలామంది ఇప్పుడు వున్నటువంటి ఆరేంజిమెంటు బాగా లేదని చెబుతున్నారు. మద్రాసులో కూడా నాకు దీని విషయము తెలుసు. ఆమాదిరిగా ఎరువుల డిస్ట్రిబ్యూటర్లు చేస్తారన్న విషయములో చాలామాట్లు చెప్పినారు. ఇంతేకుముందు అగ్రికల్చర్ డిపార్టుమెంటువారు ఎరువుల పంపకం చేస్తున్నప్పుడు వాళ్లకు ఇంకా వేరేపని లేకుండా, ఈ ఎరువులు అమ్మడమే పనితప్ప అగ్రికల్చ డిపార్టుమెంటు ఇంకేమీచేయడము లేదనే విమర్శ కూడా వచ్చింది. అందువల్ల డైరెక్టుగా కేవలం గవర్నమెంటు ఏజన్సీ ద్వారా చేయడానికి కొంతవరకు ప్రతిఘటన వున్నది. అందువల్ల ఈ కో-ఆపరేటివు సొసైటీలద్వారా గాని, టెండరుఫరమ్సుద్వారా గాని, అమ్మించాలని ప్రభుత్వము వారు నిర్ణయించారు. ఇప్పుడు ప్రయత్నము జరుగుతోంది. కాని కేవలము గవర్నమెంటుద్వారా చేయడమునకు చాలా ఇబ్బందులు వున్నాయి. అందువల్ల ఏ పద్ధతినచేస్తే బాగుంటుంది అనే విషయము తప్పకుండా ఆలోచిస్తాము.

A Hon. Member:—SRI P. GOPALA REDDI:—ఆ విధానములో ఈ టెండరుఫరమ్సు అనేవాటి మీద ప్రభుత్వమునకు ఎలాంటి అధికారము కూడా ఉండదు. డైరెక్టరు అంతటి పెద్దమనిషిని, పెద్ద ఉద్యోగస్థుని ఈ నేరాలు ప్రత్యక్షముగా చూపిస్తాము రండి అని అడిగేదానికి నాకు అధికారములేదు. ప్రభుత్వానికి అధికారములేదు అని చెప్పడములో ఆ లోపంవుంది. ప్రక్క రాష్ట్రానికి అంతా మూటలు పోతూవుంటే మేము చూస్తూవున్నాము. మాకు కావలసినటువంటి నవంబరు, డిశంబరు కాలములో మూటలు లేకుండా మేము అవస్థలు పడుతూ ప్రక్కరాష్ట్రములకుపోయి హెచ్చువెలపెట్టి తెచ్చుకుంటున్నామని మనవి చేస్తున్నాను. దానిలోవుండే లోపం ఇది అని మంత్రిగారికి సెలవిస్తున్నాను.

4-00 P. M.

THE HON. SRI B. GOPALA REDDI:—ఈ విషయములో వాళ్లు నిరంకుశముగా ఉండకూడదు. కొనుగోలు ధర రైతులకు యివ్వవలసిన ధర Government of India వాళ్లునిర్ణ యిస్తున్నారు. ఆ ప్రకారము అమ్మవలెనుగాని ఇంకొక రేటుకు అమ్మకూడదని, రు. 345/ కన్న ఎక్కువకు అమ్మకూడదని Government of India వాళ్లు నిర్ణయించారు. ఈ విషయములో Government of India వారితో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచున్నాము. రైతులకు అమ్మేధర తగ్గించడానికి ప్రయత్నిస్తున్నాము అని Government of India

వారు చెప్పుచున్నారు. ఏమైనప్పటికీ, అట్లా ఉంటే బాగుండునో ఆవిధముగా మనము ఆలోచించిఆవిధముగా మనము నడచుకొనుటకు ప్రయత్నించాలి. ఇక ప్రగడ కోటయ్యగారు తదితరులు ఉల్లిపాయలు నిరపకాయలను గురించి చెప్పారు. దాని విషయములో ఎవరూఅప్రమత్తగా లేకుండా ప్రభుత్వమువారుకూడా Government of India వారితో సంప్రదించి న్యాయంగా రైతులకు export license తెప్పించడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ విషయములో Government of India వారు అంతా పరిశీలించి చాలా ఉదారముగా మనకోర్కెను మన్నిస్తారని ఆశిస్తున్నాను. ఆ విషయములో ప్రభుత్వమువారువాళ్లతో correspond చేస్తున్నారు.

ఈ సంవత్సరము Agricultural College లో సీట్లుకు మనము అనుకొన్న వాటికంటె ఎక్కువ applications వచ్చినవి. పోయిన సంవత్సరము 80 సీట్లుకు 46, 47 opplications వచ్చినవి. కాని ఈ సంవత్సరము మనకు వచ్చిన information వల్ల మనము అనుకున్నదానికంటె applications ఎక్కువగా రావడమేకాకుండా వాళ్లు చాలా ఉత్సాహమును చూపిస్తున్నారు. ఒక Veterinary College కూడా బాపట్లలో ఈ మధ్య పెట్టడము జరిగింది. వెటర్నరీ ఆస్పత్రులను కూడా ఎక్కువచేయడానికి ప్రభుత్వంవారు ప్రయత్నము చేస్తున్నారు. ఒక ఆసుపత్రిని వినుకొండతాలూకావారు కావలయునని అడిగినారు. ఇది అంతా చాలా నెమ్మదిగా చూచుకోవలయును. అన్నిచోట్లకూడా పశువైద్యసౌకర్యములుకూడా కలుగజేయవలెనని ప్రభుత్వమువారు అనుకొనుచున్నాలు. అది dairy farm వగైరాలతోపాటు co-operative societies లో కొంత animal husbandry కూడా జరుగుచున్నది. Co-operative societies ఎక్కువచేయడానికిప్రభుత్వము ఆలోచిస్తున్నది. Dairy farms ఒక్కతాంతోను విశాఖపట్టణంలోను కాకుండా ఇతరచోట్లకూడా పెట్టడానికీ ప్రభుత్వము వారు ఆలోచిస్తున్నారు. ఇది ఈ department కు సంబంధించింది కాకపోయినప్పటికీ దానిని నేను చెబుతున్నాను.

SRI P. SUNDARAYYA :— ఒంగోలులోకూడా ఒక Veterinary College పెట్టాలి.

THE HON. SRI B. GOPALA REDDI :— ఒంగోలును దగ్గరలో 40 మైళ్ళలో బాపట్లలో ఒకటి ఉన్నది. ప్రతి ఊరిలోను కాలేజీ పెట్టడము చాలా కష్టము. శ్రీకాకుళంలోకూడా ఒక Fruit Research Station పెట్టమని అడిగినారు. ఈ సంవత్సరము కాకపోయినా ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నైనా తప్పకుండా చేస్తాము.

[26th July 1955

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—ఈ కాలేజీలో సీట్లు ఎక్కువచేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI:—దాదాపు 80 సీట్లువున్నవి. ఇంకా ఎక్కువ చేస్తే అందరికి employment యివ్వడము కష్టము అవుతుంది. కాని రైతులబిడ్డలు చదువుకోడానికి ఈ కాలేజీలకువస్తే బాగుంటుంది. అందువల్ల మన requirement చూచుకొని మన Second Five Year Plan లో ఎంత కావలెనో చూచుకొని దానిమూలంగా మనము కాలేజీలు పెట్టడము తటస్థిస్తుంది. విశాఖపట్టణంలోకూడా కోడూరులోవలె fruit research station పెట్టవలెనని కోరినారు. ఇవన్నీకూడా planning లో వస్తాయి. అది ఇప్పుడే చెప్పితే ఏదో బడాయికి చెప్పుతున్నారని అనుకొంటారని నేను చెప్పడము లేదు. ఇంకా శేషాద్రి గారు లారీలను గురించి చెప్పినారు. దాని విషయము విచారించి తప్పకుండా అవి అవసరములేకుండా ఉంటే withdraw చేయడానికి సిద్ధముగా ఉన్నాము. బహుశా ఈ Agricultural Department విత్తనములు distribute చేయుటకు ఉపయోగిస్తున్నారనుకుంటున్నాను. ఆదేవిధముగా అనేకమంది వారికి తోచిన సలహాలను ప్రభుత్వానికి చెప్పినందులకు వారికి నాదన్యవాదాలు అర్పిస్తున్నాను. ఇంకా fisheries గురించి సత్యనారాయణగారు చెప్పినందుకు సంతోషిస్తూ demand ను అట్టే కోత లేకుండా ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

SRI P. VENKATASAMI REDDI :— ప్రతి ఎసెంబ్లీ నియోజక వర్గమునకు ఒక demonstrator ను పెట్టాలి.

THE HON. SRI B. GOPALA REDDI :— ప్రతితాలూకాకు 1, 2 ఉన్నాయి. మరి మీరు క్రొత్తగా Assembly Constituency అని కొత్తగా పెడుతున్నారు. దానివిషయం ఆలోచించాలి. అంటే demonstrators కును, ఆసెంబ్లీ మెంబరుకును అట్టే... .....

SRI RAJA SAGI SURYANARAYANA RAJU:—అధ్యక్షా, మన ముఖ్యమంత్రిగారు అన్నివిషయాలనుగురించి ఆలోచిస్తామంటున్నారు. అందులో ముఖ్యంగా ఆలోచించేది ఒకటున్నా వున్నదా ?

**All the cut motions were, by leave of the House, withdrawn.**

Mr. SPEAKER : I shall now put the main Demand to the vote of the House. The question is :

That Government be granted a sum not exceeding Rs. 82,96,200 under Demand XVIII-Agriculture and Fisheries.

The motion was carried and the grant was made.

(2) DEMAND IV—FORESTS.

THE HON. Sri B. GOPALA REDDI : Mr. SPEAKER, Sir, I beg to move :—

" That Government be granted a sum not exceeding Rs. 30,64,900 under Demand IV—Forests."

Mr. SPEAKER :—Motion moved.

That Government be granted a sum not exceeding Rs. 30,64,900 under.

DEMAND IV—FORESTS.

I think one cut motion will do for discussion.

(The House expressed agreement to the suggestion.)

So the other cut motions shall be deemed to have been withdrawn.

SRI P. SUNDARAYYA :

To reduce the allotment of Rs, 30,64,900.
for Forests by Rs. 100.

ఫారెస్టు ఉద్యోగస్థులు, ప్రజలకు కలుగచేసే ఇబ్బందులను తొలగించనందున, అడవులకు సమీపములోవున్న గ్రామస్థులకు కొంత మేరకయినా ఉచితంగా పశు గ్రాసము, ఎరువుఆకు, వంటచెఱకు కోసం ఎండు పుల్లలు తెచ్చుకొనే సౌకర్యము కలుగజేయనందున.

Mr. SPEAKER :—Now the main demand and the cut motion are before the house for discussion.

SRI B. RAMA REDDI :—అధ్యక్షా, కొండలప్రక్కన నివసించేవారము కాబట్టి ఈ forests గురించి మాకు వున్న కష్టాలను సవివరంగా మనవిచేయదలచు

కున్నాను. ముఖ్యంగా దీనికి సంబంధించినంతవరకు మా వైపు కేవలం పూరిగుడిసెల్లో వుండేవారు ఎక్కువ. మా వైపుఅంటే, బద్వేలుతాలూకాలో అన్నమాట. అప్పుడప్పుడు వేసవిలో పూరిగుడిసెలు అగ్నికి ఆహుతి అవడం పరిపాటిగా జరిగే విషయం. Forest Actలో ఇండ్లు దగ్గంఅయితే వారికి ఉచితంగా కావలిసిన కలప సప్లయిచేసే నిబంధన వున్నది. కాని సర్వసాధారణంగా ఇది జరుగడానికి ఆరు మాసాలకు తక్కువ పట్టదు.

SRI S. BRAHMAYYA :—On a point of information, Sir, ఇపుడు చర్చజరిగేది Veterinary గురించా, Forests గురించా?

MR. SPEAKER :— ఫారెస్టులు గురించి.

SRI B. RAMA REDDI :— ఈజాప్యం ఎందుకు కలుగుతోంది అంటే అసాధారణమైన పరిస్థితులలోకూడా red-tapism అవలంభిస్తున్నందువల్ల. ప్రభుత్వం ఇచ్చే రక్షణ వారికి అందేలోపుగా వారు నానాఅవస్థలుపడి కష్టపడడం జరుగుతోంది. ఇటీవల మా constituencyలోఉన్న మల్లేపల్లిలో 50 హరిజనులు పూరి ఇండ్లు దగ్ధమయితే, కలెక్టరుగారిదగ్గరకు District Forest Officer గారి దగ్గరకు నేను వెళ్లి ఉత్తరువువేయించినా, ఈనాటికి Range officerకు ఈ కలపకు నంబర్లు ఇవ్వడమే కష్టంగా వున్నది. ఇండ్లు దగ్ధమైన వెంటనే Revenue Inspector గారు పోయి తాసిల్దారుగారికి రిపోర్టుఇస్తే కలెక్టరుగారికి చెబితే వారు Forest Department కు పంపినవెంటనే ఎలాంటి మధ్యవర్తిత్వం లేకుండా పోటాపోటిగాపోయి తక్షణం Range officer గారికి report చేస్తే ఆలస్యంలేకుండా పని జరుగుతుంది. అపుడే ప్రభుత్వంవారు ఇచ్చే సహాయం వారికి సంపూర్ణంగా ముట్టుతుందని నా మనవి. ఇలాంటిది ప్రజల సౌకర్యానికి సంబంధించినది కాబట్టి Forest Actలో నిబంధనలుఏమైనావుంటే వాటిని సడలించే విధానం గురించి ముఖ్యమంత్రిగారు ఆలోచించాలని కోరుతున్నాను. సాధారణంగా పర్వతప్రాంతాలలో వుండేవారు అడవికి దగ్గరగావుండే జనం పేదరైతులై వుంటారు. ముఖ్యమైన అవసరం ఎండు కట్టెలు. Forest Department వారి దయాదాక్షిణ్యాలపై రైతులు ఎండుకట్టెలు తెచ్చుకోవలసియున్నది. Guards మొదలైనవారి ఇష్టంవుంటే తెచ్చుకోనిస్తారు. లేకపోతే కేసుపెట్టి 0—8—0 పుల్లలకు రు. 6 లు జరిమానా పడేటట్లు చేస్తున్నారు. ఆ కనీససౌకర్యంలేకపోతే వారుజీవించేదానికిమార్గంలేదు. డబ్బుంలో కొనుక్కోడానికిఅవకాశం లేదు. వారికి అందుబాటులో వుండవు. పెద్దపెద్ద రైతులు వుంటారు. సేద్యాలువదలి తెచ్చుకోవాలంటే దగ్గర ఎండుకట్టెలు తీసుకోడానికి అవకాశాలు యుండికూడ అక్కడకుపోయి తెచ్చుకోవడం చాలా కష్టంగా

వుంటుంది. ఎందుకు కట్టెలు కొట్టేదానికి డబ్బు ప్రధానం. డబ్బునష్టం వస్తుంది అనుకుంటే మోపు ఒకటికి అణా, రెండణాలు పన్ను విధించి రెడ్డిద్వారా వసూలు చేయించి కష్టపరిస్థితులలో రైతులకు సౌకర్యం కలిగించక పోతే చాలాకష్టం. దిక్కుదివాణాలేని పేదవాళ్లమీద కేసులు పెడితే, మేజస్ట్రేటుకోర్టులో వాళ్లు పడేబాధలు చాలా ఎక్కువగావున్నాయి. ఇది చాలా ముఖ్యమైన విషయంగా ముఖ్యమంత్రిగారికి మనవిచేస్తున్నాను. రివెన్యూకోసము తగిన నిబంధనలు చేసి వారికి కట్టెలు అందుబాటులో వుండేట్లా చేయాలని కోరుతున్నాను. పచ్చిఆకు ఎరువు రైతులకు చాలా కావాలి. వీటి విషయంలో పర్మిట్లు ఇవ్వడంలో చాలా కష్టాలు కలుగుతున్నాయి. వ్యవసాయానికి పచ్చిఆకులు ముఖ్యమైనవి కాబట్టి వీటిని ఇప్పించాలని కోరుతున్నాను. Unreserved ప్రాంతంలో పసువులు మేపుకునే దానికి సౌఖ్యంగా వుంటుంది. రిజర్వుఫారెస్టులు గ్రామాలకు దగ్గరగా కాకుండా దూరంగా వుండేట్లా ప్రసాదించాలని కోరుచున్నాను.

*SRI D. RAMABRAHMAM :— అధ్యక్షా, ఆ అటవీ శాఖపద్దును నేను బలపరుస్తున్నాను. ఈ అడవుల పరిపాలన విషయంలో మొన్న ప్రధాన మంత్రిగారు అడవులువున్న భూసంపదలో 33% వుండేట్లా ఎక్కువ చేయాలని చెప్పారు. అట్లాచేస్తేనే మనదేశం సస్యశ్యామలంగా వుంటుందనికూడా వక్కాణించారు. వాస్తవమే. ఇపుడు వున్నటువంటి అడవులు సక్రమంగా అటవీ పాలకులందరూ పరిపాలిస్తున్నారా అనేవిషయం గుర్తించాలి. ఇటీవల చాలా బయలు ప్రదేశాలు అయిపోయినాయి. ఇందులో చెట్లు ఎక్కువగావుండి వాటివల్ల అడవిని అభివృద్ధిపరచుకుంటే మనదేశంలో వర్షాధిక్యత ఎక్కువ అవుతుందని అందరూ అనుకున్నదే. మన Forest ఉద్యోగులు గ్రామపోలిమేరలలో చెట్లునాటి, ఆ గ్రామంలోవుండే రైతులను వారి ఆధీనంలో పెట్టుకుని, తమ అడుగుజాడల్లో నడిచేట్లా చేయడానికి, అదుపుఆజ్ఞలలో వుండేదానికి plots వేస్తారు. ఇందులో కొలుబాగంకూడా చెట్లు మొలవడంలేదు. అయినా పశువులు ఇందులోపడితే వారి నిర్బంధాలకు గురిఅవుతుంటారు. మొన్న Conservator వచ్చినపుడుకూడా చెప్పాము. బైలుప్రదేశంలో అంతాకూడా అడవులువున్నాయి. చెట్లునాటి ఆ అడవిని అభివృద్ధి చేయవచ్చును. శ్రీగంధం చెట్లు, బూరుగుచెట్లు, చింతచెట్లు వంటి మంచి మొక్కలునాటి forest సంపదను అభివృద్ధిచేయవచ్చు. కేశనార్ చెట్లునాటడంవల్ల forest సంపదపెరగదు అనిచెప్పాం. వారు ఒప్పుకున్నా అడవుల్లో చెట్లునాటే Rangers, foresters ఒప్పుకోడంలేదు. రోడ్డుప్రక్కనే వుంటే మాపెద్దవారలు, D.F.O.లు Conservator వచ్చి తనిఖీచేయడానికి వీలుగా

SRI D. Ramabrahmam] [26th July 1955

వుండాలని చెబుతున్నారు. ఇది తనిఖీఏర్పాట్లు చేసుకోడం కోసమా, లేదా రైతులదగ్గర అప్పుడప్పుడు లంచాలు గుంజుకునే దానికోసమా వారు ఈ ప్లాట్లు వేస్తున్నారు? ప్రభుత్వంవారిని గ్రామసమీపాల్లో వీటిని వేయకుండా విశాలమైన ప్రదేశంలో చెట్లునాటే ప్రయత్నం చేసేదానికి తగినఏర్పాట్లు చేయాలనికోరుతున్నాను. మాది జమీందారీప్రాంతాలు. జమీందారీ ప్రాంతాలను తీసుకున్న తరవాతకూడా రైతులకు ఇదివరకు వుండేహక్కులు అనుభవించవచ్చునని అప్పటి మంత్రివర్గంలోనివారు అనేక ఉపన్యాసాలు ఇచ్చారు. ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న తరువాత రైతులకు ఉన్నహక్కులకు భంగంకలిగింది. Reserve, unreserve అని ఏమిలేదు. జమీందారులు వదలిన unreserveలు అంతా ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నతరువాత, ఎన్ని ప్రత్యేక మెమోరాండాలు ఇచ్చుకున్నా, ఎందరు రైతులుపోయి మొరపెట్టుకున్నా, లెక్క చేయకుండా unreserveను Reserveగా మార్చేస్తున్నారు. రైతులను చాలా ఇబ్బందులు పెడుతున్నారు. ఇదివరకు జమీందారీ ప్రాంతాల్లోవున్న అడవుల్లో మేకలు ఎక్కువగా మేపుకునేవారు. అక్కడ భూసారాన్ని ఎక్కువచేసుకొనేవారు. మేకలవల్ల forests నాశనం అవుతున్నాయి. అందువల్ల మేకలు మేపుకోకూడదు అని ప్రభుత్వంవారి నిషేధం వున్నది. మేముకూడా గుర్తించాము. మా ప్రాంతాలు చాలా శీతలప్రాంతాలు. అడవులలో గొర్రెలను మేపుకోవాలంటే శీతకాలంలోను, వర్షాకాలంలోను ఒకరకమైన జబ్బువస్తుంది. ఎక్కువగొర్రెలు చనిపోయే అవకాశంవున్నది. మేకలు మేపుకునేదానికి పూర్తిఅయిన వసతులు కలుగచేయాలని కోరుతున్నాను. Reserve forest లో మేకలు మేపుకొనకపోయినా, ప్రత్యేకమైన కుప్పలువేసి మేకలు మేపుకునేదానికి సదుపాయాలు చేయాలని కోరుచున్నాను. సరిహద్దుల్లోవున్న జమీందారీ ప్రాంతంమాది. ఒకవైపు సేలంజిల్లా, మరొకవైపు North Arcot జిల్లా వున్నాయి. మనకుచేరిన అడవులను ప్రక్కనవుండే రాష్ట్రంవారు నాశనంచేసి, అన్యాక్రాంతంచేసి పట్టాభూములు లేకుండా వ్యవసాయంచేస్తున్నారు. వాళ్ళ కార్యాలు వారు సాగిస్తున్నారు. ఈవిషయమై ప్రభుత్వంవారికి అనేకమెమోరాండాలు ఇచ్చివున్నాము. అయినా ప్రభుత్వం ఉత్తరువులుపంపి అక్కడవున్న Forest సిబ్బందికి తగుసహాయముఇచ్చి రిజర్వులతో వ్యవసాయం చేయువారిని తొలగించడానికి సరియైన ప్రయత్నాలు జరుపలేదు. మనరాష్ట్రానికి చెందిన forest ను ఇతర రాష్ట్రాలవారు ఆక్రమించుకొనియున్నారు కాబట్టి మన boundaries ఎంతవరకు వున్నవో ప్రత్యేకమైన సర్వేచేయించి boundaries సరిచేయవలసిందిగా ప్రభుత్వం వారిని కోరుచున్నాను. సెలవు.

26th July 1955]

* SRI P. GOPALU REDDI :—అధ్యక్షా, ఇంతకుముందు 2-3 demands మీద మాట్లాడవలెనని అభిలాషవుండింది కాని అవకాశము దొరకలేదు. అధ్యక్షులవారు ఆదేశించినందులకు తప్పనిసరిగా మాట్లాడాలి అనే అభిలాషతో వచ్చాను. Forest ప్రాంతీయుడను కాకపోయిన కొంత అనుభవముతో నేను విన్నంతవరకు complaints మాత్రము కొన్ని వున్నాయి. వాటిని ప్రభుత్వానికి తెలియజేయవలెను. జమీందారీప్రాంతాలను ఇటీవలప్రభుత్వము స్వాధీనము చేసుకొన్న తర్వాత మాకు వచ్చిన యిబ్బంది ఏమిటంటే ఆప్రాంతాలలో వుండే పొడిచెట్లు ప్రదేశాన్ని అంతాకూడ forest గా declare చేశారు. ఆ యిబ్బందులలో forest సిబ్బందులు వచ్చినారు. ప్రతిరైతుకట్టెలను బస్తీలకు తోలుకు రావలసివుంటే స్వంత ఉపయోగానికి ఒక permit కావాలని అంటారు. దానిని District Forest Officer నుంచి తెప్పించుకోవలసి వుంటుంది. ఐతే free permit అని చెప్పుతారు. ఐతే యీ విషయము జమీందారీ యిలాఖాలో వుండేటటువంటి ప్రజలకు ఏమాత్రము తెలుపనందున చాల యిబ్బందిపడుతున్నారు. ఐతే యీ మధ్యలో ఏవో మార్పులుకూడా జరిగినాయని విన్నాము. ఆ మార్పులవల్ల మాకు యిబ్బందులు చాల అయినాయి. రెండవది యీ pasture lands అనేవి అడవిప్రదేశములో చాల దగ్గరగా Forest line కొట్టిన కారణముచేతపశువులను మేపుకోనేదానికవీలులేని పరిస్థితులలో ఈ forest guards వల్ల వచ్చిన అవస్థ చాల వుందని మేము చెప్పుకోవలసి వస్తుంది. forest line forest interior లో దట్టముగావున్న ప్రాంతములో వుండినట్లయితే చుట్టుప్రక్కల వుండే మిగతా ప్రాంతాలను pasture lands గా ఉపయోగపరచుకొనేందుకు అవకాశముంటుంది. ఏనాడో ఈ జమీందారిశకములో వున్న estate లో అనగా తిరుపతి దేవస్థానము estate లో గ్రామాలకు సంబంధించినటువంటి అడవిలో forest line ను రైతుభూముల ప్రక్కనే కొట్టిన కారణముచేత ఇక pasture land లేకుండ రైతులు చాల అవస్థపడుతున్నారు. ఈ విషయాన్ని ప్రభుత్వము పరిశీలించి ఆ లైనును కొంత interior ప్రదేశానికి మరలించి వేరొక కొత్త forest line కొట్టించి నట్లయితే ఆరైతులకుండే కష్టాలు తీరుతాయి. Forest అభివృద్ధికిగాను మన రామబ్రహ్మముగారు చెప్పినట్లు చింత, పనస, ఇటువంటి ఫల వృక్షములను ఉత్పత్తి చేయకుండాయే గ్లయిరసీడియా, సస్బేనియా, మొదలైన చెట్లు మన అడవుల అభివృద్ధికి ఏమాత్రము తోడ్పడవు. రంగూను టేకు మన అడవి ప్రదేశములో అత్యద్భుతముగా ఉత్పత్తి ఔతుందని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. అటువంటి టేకు చెట్లను అభివృద్ధి పరచినట్లయితే కొంత కలపకున్నూ కొంత యింటి సామానుకున్నూ ఉపయోగపడుతుంది. కట్టెకొట్ట కూడదనే ప్రయత్నములో

SRI P. Gopalu Reddi] [26th July 1955

రైతులకు కావలసిన మడకలు బండి సామానువగైరా కొట్టుకోడానికి free permits grant చేయడానికి కూడా ప్రభుత్వము అనుమతించవలెనని కోరుతూ ఈ అవకాశము యిచ్చినందులకు అధ్యక్షులవారికి నావందనాలు అర్పిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

*SRI P. RAMACHARLU:—అధ్యక్షా, ఒకసారి సాక్షి ఉపన్యాసములో "బర్హాంపూరు చౌటిపర్రలనుంచి బళ్లారి బోడికొండలవరకు" అని ఆయన ఆంధ్రదేశాన్ని వర్ణించాడు. మరి బర్హాంపూరు పోయింది. బళ్లారీ పోయింది. కాని అనంతపురము జిల్లాలోమాత్రము Bellary కి సంబంధించిన కొండలు వుండనే వున్నాయి. అవి ఏవి పెరగడములేదు. కొన్ని రిజర్వులుకూడ వున్నాయి. కాని వాటినంతకూడ కొట్టి పడ వేశారు. అక్కడ పూర్వము నారవేపచెట్లు అనేవి వుండేవి. అవి దూలాలకు స్థంభాలకు కూడ పనికివచ్చేవి. వాటినన్నిటిని కొట్టివేశారు. అక్కడ వట్టి బోడిగా కనిపిస్తుంది. ఆ కారణముచేత చిన్నరైతులు యిండ్లు కట్టుకోవలసిన కూడ Teak, మత్తి, ఏదేశము నుండో తెప్పించుకోవలసివుంది. కాని అక్కడక్కడ ఏ వూరిలో వుండేవాండ్లు అక్కడనే వాండ్లయిండ్లకు కావలసిన కలప వేసుకుంటే వాండ్లకు చౌకగాను అడవులు పెరగడానికి అక్కడవున్న అడవిని పూర్తిగా కొట్టివేయకుండా వుండడానికి కారణమాతుంది. Forest లను పెంచకుంటే మానె, వాటిని నాశనము చేయకుంటే వాటంతట అవే పెరుగుతాయి. కాపుదారి గనుక చేస్తే పదిఏండ్ల లోపల దివ్యమైనచెట్లు పెరుగుతాయి. ఒకచోట ఇటీవల Forest Officer చూపెట్టాడు. ఒక చోట ఎంచగా అక్కడ అనేక వేల చెట్లు ఉన్నాయి. ఆప్రకారముగా లెక్కవేస్తే 2, 3 చదరపు మైళ్లలోనే 10 లక్షల చెట్లవరకు పెరగడానికి అవకాశము వుండే చోట్లను చూశాను. ఆవిధముగా పెంచితే ఆంధ్రరాష్ట్రానికి డబ్బువచ్చేదికాక ఆంధ్రలో అడవులు పెరుగుతాయి. తర్వాత బీదలకు కలపదొరుకుతుంది. Western ghats లో ఉండే కలప ప్రియముగా కొనడమువల్ల దానిని నాశనముచేయనక్కరలేదు. కాబట్టి ఈ విషయాన్ని గమనించాలని ప్రభుత్వాన్ని కోరుతూ నా ఉపన్యాసాన్ని చాలిస్తాను.

Sri M. MATCHA RAJU :— అధ్యక్షా, మా గూడెము Agency ప్రాంతము Forest విషయము చాల అల్లరిగా వుంది. ఎందుచేతనంటే అది అంతా జమీందారీ area. అందులో ప్రతివారికికూడ Agency పోడువ్యాపారముతప్ప ఇంకొకపని వాండ్లకు చేతకాదు. పోడుకొట్టితే Forest వారు fine వేయడము వల్ల యీ Agency Tribes చాలా బాధపడుతున్నారు. వారికివచ్చే ఫలసాయము

10 పుట్లు,5 పుట్లు అయితే ఒక్కొక్కరికి వంద,ఏబదిరూపాయలు fine వేస్తున్నారు. Government వారు అటువంటి కొండ రిజర్వులను unreserve చేసి రైతులకు కొంత సదుపాయముచేస్తారని ఆశిస్తున్నాను. అదికాకుండ పోడు cultivation చేసినపుడు వందో ఏబదిరూపాయలో fine యిచ్చినను అంతటితో ఊరుకోక పోడు శిస్తు రైతువద్ద రెండురూపాయలు చొప్పున collect చేస్తున్నారు. యీ రెండు రూపాయలతో యీ బాధపోతుంది. ఫారెస్టువారువచ్చి 50 రూపాయలు fine కూడా వేస్తున్నారు. కేసుపెట్టిన పదో ఐదో రూపాయలు దానికి విలువకట్టి ఏర్పాటుచేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అందువల్ల రిజర్వులను అన్‌రిజర్వులుచేస్తే tribes వారు అందరు సేద్యముచేస్తారు. అలాగుచేయమని ప్రభుత్వాన్ని కోరుతూ నేను విరమిస్తున్నాను.

4-30 p. m.

* Sri S. K. V. KRISHNAVATARAM:— నేను ఈ demand ను బలపరుస్తూ కొన్నివిషయాలుమాత్రం ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. Forest administration సరియైన క్రమపద్ధతిని నడవడంలేదని నా అభిప్రాయం. దాని మీద సరియైన control కూడా ప్రభుత్వం చూపడంలేదనిచెప్పి నా అభిప్రాయం. ఇటీవల forest administration లో forest guards, Rangers ప్రజలను నానా హింసలు పెడుతున్నారు. మామూలుగా బీడుభూములనుంచికూడా రైతు forest produce పుల్లనిమిత్తం, మామూలు పంటచెరకునిమిత్తం, ఇతర ఉపయోగాలనిమిత్తం తీసుకుపెడుతూయుంటే ఆబళ్ళనుకూడా పట్టుకుని అపుచేసి కొన్ని నెలలు అవి దగ్గర ఉంచుకుని వారిని చాలా హింసిస్తున్నారు. ప్రత్యేకంగాఈ విషయం ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. ఏ గ్రామాధికారిగాని లేక Revenue Inspector గాని కనీసం ఇది private భూమిలోనిది, వ్యక్తికి సంబంధించిన private భూమిలోనిది అని certify చేస్తే దానిజోలికి ఈ అధికారులు రాకుండా చేయునట్లు department కు instructions ఇవ్వవలసినదిగా నేను కోరుతున్నాను. దానివల్ల వచ్చే అనర్థకాలు ఏమిటంటే అది మునసబుకు అప్పగించడం ఇటీవలనే రెండుమూడు నెలలలో ఫున కొన్నివందల కేసులు నాదృష్టికి వచ్చినవి. ఆబళ్ళనుపట్టుకోవడం, వారు హామీ ఇస్తామన్నప్పటికీకూడా, వెంటనే మునసబుకు అప్పచెప్పడం జరుగుతున్నది Third party security ధనవంతులైనవాళ్ళు ఇస్తే కూడావాటిని వదలివేయకపోవడంవల్ల ఆబళ్ళు అక్కడనుండిపోవడం వ్యవసాయకుడికి ఆబళ్ళులేకపోవడంవల్ల ఎంతో ఇబ్బంది కల్గడం జరుగుతోంది. ఎట్లాంటి హామీలుకావాలో అట్లాంటి హామీలు పుచ్చుకుని వెంటనే ఆబళ్ళను వప్పగించవలసినదిగా instructions ఇవ్వవలసిందని మనవిచేస్తున్నాను. లేని ఎడల District forest

SRI S. K. V. Krishnavataram] [26th July 1955

Officer దగ్గరకువెళ్లడం compounding fees కి వీళ్లు agree అవడం ఇదంతా జరిగేసరికి మూడునెలలవుతోంది. ఒకవేళ compounding కుదరనియెడల cases Court లో పెట్టేసరికి మరో మూడునెలలు అవుతోంది. కాబట్టి దాని విషయమై ప్రత్యేక శ్రద్ధతీసుకోవలసినదిగా ప్రభుత్వాన్ని నేను కోరుతున్నాను. ఈ estate గ్రామాదులలో అన్యాక్రాంతములు జరగకుండా, Estate Abolition Act అమలు పెట్టేటందుకుపూర్వం "Madras Preservation of Private Forests Act" మరి Madras Prohibition of alienation of Forest Banjar and Communal lands అనేవి కొన్నిశాసనాలు 1946-47 లో ప్రభుత్వం చేసినారు. Abolition act ను ముందుగానే కనిపెట్టి దానియొక్క మంచి provisions నూ, లాభదాయకమైన provisions నూ defeat చేసే నిమిత్తం ante-dated and spurious pattas, అనగా దొంగపట్టాలను 1947 కు పూర్వమే సృష్టించి పట్టాలకు registration అవసరంలేని సావకాశం తీసుకుని కొందరు జమీందార్లు అలాంటిపట్టాలను అమలులోనికి తీసుకువచ్చారు. ఏలూరు తాలూకాలో ముండూరు అనే గ్రామం ఉంది. అక్కడ 257 ఎకరాల పైచిలుకు forest ఉంటే estate village లో ఉన్న మొత్తం 257 ఎకరాలు ఒక్క ఎకరంకూడా లేకుండా private ఆసాములకు పట్టాలు ఇవ్వడం జరిగింది. ఇల్లాగే ఏలమర్రు estate లోయున్న కామవరపుకోట గ్రామంలో, తరువాత చల్లపల్లి estate లోయున్న పెదపేగి గ్రామంలో ఇంకా కొన్నాళ్ల వగైరా గ్రామాదులలో మొత్తం గ్రామంలోయున్న forest భూమి అంతా ఒక్క cent ఐనా మిగలకుండా అన్యాక్రాంతాలు జరిగినవి. ప్రభుత్వానికి ఎన్నో మెమోరాండాలు, petition లు ఇప్పించినప్పటికీ ఈవిషమై ప్రభుత్వం ఆ పట్టాలరద్దు నిమిత్తం ఏట్టిచర్యలూ తీసుకోవడంలేదు కాబట్టి ఆ విషయం ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. అంతకుమునుపు estate గ్రామాలలో nominal గా పుల్లరి ఇచ్చినట్లయితే పశువులను మేపుకొనుటకును ఇతర వ్యవసాయ పనుల నిమిత్తం, చిన్నచిన్న పనిముట్ల నిమిత్తంనుకొనే నిమిత్తం, ఇతర domestic consumption నిమిత్తం కొంతసామగ్రి కొంత వంటచెఱుకూ తెచ్చుకునే సదుపాయాలు ఉండేవి. కాని estates abolition ఐనతరువాత గవర్నమెంటు ఈ villages తీసుకున్నతరువాత ఈ పదుపాయాలన్నీ కూడాపోయి ప్రజలుచాలా ఇబ్బందిపడుతున్నారు. చాలా గోడుగాయున్నది కాబట్టి ఈవిషయంలో ప్రభుత్వం శ్రద్ధతీసుకోవలసినదని మనవిచేస్తున్నాను. తరువాత forest లు coupe లుగా మార్చి private వ్యక్తులకు అమ్ముతున్నారు. ఆ వ్యక్తులు చెట్లనుకొట్టివేసి ఇతర forest

produce తో సహా ఎక్కువ demand వచ్చేపోట్లకు పంపకం జరుగుతోంది. దగ్గరున్నవారికి సదుపాయాలు లేకుండా పోతున్నవి. కాబట్టి వెంటనే price control ఆ wood కి కూడా పెడితే బాగుంటుందనిచెప్పి సలహా ఇస్తూ forest guards, forest rangers చేసే అక్రమాలను అరికట్టవలసినదిగా మరొకసారి విజ్ఞప్తిచేస్తూ ఇంతటితో సెలవుతీసుకుంటున్నాను.

* SRI C. P. THIMMA REDDI :— అధ్యక్షా మహాశయా! ముఖ్యంగా ఈ అడవులనుగురించి చెప్పవలసివచ్చినప్పుడు అడవులు చాలా ప్రాముఖ్య మైనవి అనే విషయం. అందరూ గమనించవలసియున్నది. వీటివల్ల చాలా ఉపయోగం ఉన్నది. ప్రతిదానినీ కేవలం మనకోసం ఉపయోగపఱచుకుంటాం అనుకుంటున్నారు కాని ఉపయోగపఱచవలసిన పద్ధతికూడా తెలుసుకోవలసినది. చెట్లకు ఆకాశంమీద పోయే మేఘాలను ఆకర్షించేశక్తి ఉన్నది. మేఘాలు ఆవిరిగా మారిత ద్వారా వర్షాలు ఆయాప్రాంతాలలో వస్తున్నదన్నమాట. ఎక్కడెక్కడ శీతల ప్రదేశం ఉంటుందో, ఎక్కడెక్కడ నీటి ప్రదేశం వుంటుందో, ఎక్కడెక్కడ చెట్లు చేమలు ఎక్కువ వుంటాయో అక్కడ వర్షాలు ఎక్కువగా వస్తూఉంటాయి. అందువల్ల ఆ మేఘాలను ఆకర్షించడానికి చెట్లు ఒక యంత్రసామగ్రి అన్నమాట. దేశం దానిమీద ఆధారపడియున్నది. చెట్లను అభివృద్ధి చేసేదానిలోకూడా ముఖ్యంగా గమనించవలసింది అడవులేకాదు ఆయా గ్రామాదులనుకూడా అభివృద్ధి చెయ్యాలి. కాని ప్రతిగ్రామంలో 100 ఎకరాలు అక్కడక్కడ పొరంబోకులు ఉన్నాయి. ఎన్నో వనాంతరాలుంటూవచ్చాయి. కాని అవన్నీ నశించాయి. ఇదివఱకు వాటిమీద భక్తిఉండేది. వాటిని నరకడం పాపమని అని శాస్త్రయుక్తంగా ఉండేది. ఇప్పుడు చట్టబద్ధం చేస్తూయున్నారు. ధర్మం నశించి పోయింది. కాబట్టి ప్రతి వ్యక్తికూడా ఆ బాధ్యత వహించడానికి సరియైనవిధానం లేకుండాపోతుంది. అందువల్ల మన పెద్దలు వేపచెట్టు ఎల్లమ్మదేవత అన్నారు. ఏదో కొన్ని దేవతలపేరు పెట్టారు. కాని ఈ రోజు మాత్రం మనకు పిచ్చిగా అగుపించవచ్చును. కాని వాళ్లుచేసిన విధానం వాటికి దెబ్బతగల కుండా ఉండే పరిస్థితి చేస్తూవచ్చారు అన్నమాట. అందువల్ల శాస్త్రం ధర్మానికి అంటకట్టి అదిచేయడం బాగులేదు ఇదిచేయడం బాగుంటుంది అనే విషయం ప్రబోధిస్తూ వచ్చిందన్నమాట. లేదా ఫలసాయం కల్గినటువంటివాన్ని కొడితే దానివల్ల ఈ పాపంఉంది. ఎందుకంటే దానిమీద పక్షులూ మృగాలూ అంతా బ్రతుకుతున్నాయి కనుక ఫల వృక్షాలనుమాత్రం ఏమీ చేయ

SRI C. T. Thimma Reddy] [26th July 1955

కూడదని చెప్పింది. పచ్చిచెట్లు కొట్టకూడదని శాస్త్రం చెప్పింది. ఎటువంటిచెట్లు కొట్టాలంటే కేవలం ముసలివైపోయి క్రిందపడేదానికి సిద్ధమైనదానిని కొట్టవచ్చును కాని అంతవరకూ కొట్టకూడదనేది శాస్త్రము ప్రబోధించింది. ఏ కొండప్రాంతంలోకూడా దాన్ని ముట్టకూడదన్నమాట. ఇన్ని సంవత్సరాలు జీవించిన తరువాత వాటికి చావు వచ్చినతరువాత వాటినిమాత్రం ఖండించి వాటిని మానవుల ఉపయోగార్థం వినియోగించుకోవాలిగాని ఎప్పుడుపడితే అప్పుడుమాత్రం కొట్టడానికి వీలులేదు అని చెప్పింది. ప్రకృతి మానవునికోసం సృష్టింపబడినమాట నిజమేకాని అదికేవలం తమ ఇష్టానుసారం వుపయోగించకూడదు. కొన్ని నిబంధనలకులోబడి మాత్రం ఉపయోగించుకోవాలి. ప్రతిదానికి ఒక rule ఉన్నది. Road మాది అని విచ్చలవిడిగా పోయేందుకు వీలులేదు. కాని directions ప్రకారం పోవచ్చును. కారులో పోవచ్చును. నడకలో పోవచ్చును. బండిలో పోవచ్చును. లేకపోతే ఇంకోదాంట్లోపోవచ్చును గాక. అట్లనే మానవుడు ప్రపంచంలో ప్రవర్తించేదానిలో ప్రపంచమంతా నాదేనని చెప్పడానికివీలులేదు. ధర్మయుక్తంగా గాని, చట్టబద్ధకముగా గాని ఉండా లన్నమాట. నేటిరోజులలో ప్రతిదానికి చట్టం అంటగడుతున్నారు. చట్టం ఎప్పుడు మానవుని బాగుపరుస్తుందంటే, offence చేసినతరువాత వీలైతే తప్పించుకోడానికి, కాకపోతే అప్పుడేదో చూస్తాంలే అంటాడు. కాని ధర్మం అట్లాకాదు. చేసేదానికి ముందుగానే హృదయం ప్రబోధిస్తుం దన్నమాట. జాగ్రత్త! పైన భగవంతుడు చూస్తున్నాడు. సర్వత్రా సర్వకాల సర్వావస్థలయందు భగవంతుడు ఉన్నాడు. జాగ్రత్త చూసుకో అన్నప్పుడు ఆ వ్యక్తి ఏమీ చేసేదానికి వీలులేని పరిస్థితి ఏర్పడిపోతోంది. నాకు time దయచేసి 5 నిమిషాలు ఎక్కువిస్తే బాగుంటుదని అధ్యక్షుల వారికి నేను మనవిచేసుకొంటున్నాను. కొంచెం కొంచెం దైవికసంబంధం ఉంటుంది కాబట్టి దయచేసి టైము ఇస్తేనే బాగుంటుంది. నా కదే భయంగా ఉంది. ఎట్లయినా adjust చేసుకోవాలని ప్రయత్నంచేస్తున్నాను. వీలైనంతవరకు adjust చేసుకుంటాను. కాని అవకాశం కల్గినప్పుడు కొంచెం ఇస్తారని మనవిచేస్తున్నాను. కాబట్టి ప్రతిమానవుడికి నిజాయితీ కావాలి. ఇది కనక నష్టమైతే ప్రపంచానికే కాదు, సంఘానికేకాదు, నాకుకూడా నష్టంఉన్నది. నష్టంచేయడానికి వీలులేదనే నిజాయితి కల్గినప్పుడుమాత్రమే ఇది సాధ్య మవుతుంది. లేకపోతే సాధ్యంకాదు. అది ప్రతిమానవుడి హృదయంనుంచి రావాలిగాని, ఇవి ఎవరో చెప్పేమాటలు కావు. ఏ శాస్త్రం చెప్పింది, ఎవరంటున్నారు, ఏ చట్టం ప్రబోధిస్తూ ఉంది అనేటటువంటి విషయంమాత్రం కాదు. ఒకవేళ

26th July 1955] [SRI C. P. Thimma Reddi

భౌతికవిషయము పట్టుకుంటే లంచం ఇచ్చి దాన్ని తప్పించుకొంటామని అనుకుంటాడు. లేకపోతే చూడకుండా చేస్తానని అనుకుంటాడు. ముఖ్యంగా చెట్లు అంటే లేదా మృగాలంటే ఇవన్నీ మనకెంతో ఉపయోగార్థంగా ఉంటాయి. మనం విడిచిన బొగ్గుపులుసుగాలి అవి తీసుకుంటాయి. చెట్లు మనకు ప్రాణవాయువు ఇస్తున్నాయి. అందువల్ల చెట్లలో ఒక మహత్తరమైన శక్తిఉంది. మానవుడు నిష్కామ కర్మ చెయ్యాలి. మనం ఎవరివల్లా ఏమీ అపేక్షించకుండా ఇచ్చేది ధర్మం అని చెబుతున్నది. చెట్లు చూడండి. ఈ చెట్లు చేమలు మనం ఏమిస్తే అవి తీసుకుంటున్నాయి. మనం అడిగింది మనకు ఇస్తున్నాయి. ఇదీ వాటిలో గొప్పతనం. అంటే వాటికున్న విజ్ఞానంకూడా మనకు లేదేమోగాని వాస్తవం చెప్పవలసివచ్చినప్పుడు ఇదే నిష్కామ కర్మ అన్నమాట. ఈ పరిస్థితులలో ప్రతివ్యక్తి బాధ్యతవహించాలి. ఏది చేసినట్లయితే దేశం సౌభాగ్యవంత మవుతుంది, ఇవి ఎందుకోసం సృష్టింపబడినాయని సంపూర్ణంగా ఆ మూలాగ్రంగా అర్థంచేసుకుని ప్రవర్తిస్తే బాగుంటుంది. పశువులకు మేత అవసరం. అవి మనకు పాలిస్తున్నాయి. వాటికన్ని సౌకర్యాలూ మనం కలగచెయ్యాలి. ప్రతి గ్రామంలో 100 ఎకరాలో 200 ఎకరాలో చెట్లు అభివృద్ధిచేసి, బీడుప్రదేశాలు పెట్టి పశువులకు మేతలకు కల్పించాలి. అడవులలో టేకని, ఇవి అవీ అని ఏవో కొన్ని చెట్లు వేస్తున్నారు. ఫలవృక్షములు వేయడంలేదు. అవి లాభదాయకం కాదంటారు. టేకు, మద్దివగైరా వేయవచ్చును. వాటిని అభివృద్ధిచేసి రక్షించేవిధానం ఉన్నది. వన మహోత్సవాలు జరుగుతున్నాయి. లెక్కచూస్తే కొన్నిలక్షలలో కోట్లలో ఐనట్లు కనిపిస్తుంది. సంవత్సరాంత మందు చూస్తే ఏవీ అగుపించడం లేదు. ఇది భక్తివల్ల కాదు. ఏదో ఆర్భాటంకోసం చేసినట్లుంటుంది. కాని కేవలం పెంచితీరాలి. బుచ్చన్న ఒక చెట్టు వేశాడంటే ఇది బుచ్చెన్నచెట్టు అని శాశ్వతంగా ఉండిపోతూ వచ్చేది. వారు పేరు ప్రఖ్యాతులకోసం ధర్మంకోసం చేస్తూవచ్చారు.

నేనుచెప్పేది బహుశా మీగతా సభ్యులకు కొంచెము కష్టముగా ఉంటుందేమో. కాని వీటిని కొంచెము మూలాగ్రంగా, లోపలికిపోయి ప్రారంభంనుంచి అర్థంచేసుకొంటె బాగుంటుంది. ప్రారంభం విడిచిపెట్టి పైపైనే మెరుగు చూస్తే ప్రపంచం బాగుపడడానికి వీలులేదు. కాని అంతదూరము పోయేదానికి వీలులేదు అంటె నేను చెప్పేదేమిలేదు. కనుక నేనుకూడ కొంత అటు కొంత ఇటు చెప్పడానికి ప్రయత్నిస్తున్నాను. ముఖ్యంగా ఈ Forest Department వ్యవహారములో కొన్ని లోపాలున్నాయి. గడ్డి తీసుకోవడానికి ఏదో ఒక పర్మిట్ కావాలట. దానికిగాను రేంజరు ఎక్కడుంటే అక్కడికిపోయి డబ్బుపెట్టి అది తీసుకోవాలి. మళ్లీ దాన్ని return చేస్తే, మరల డబ్బు ఇస్తారన్నమాట. దీనికోసం అక్కడికిపోవడం,

SRI C. P. Thimma Reddi] [26th July 1955

మరల దీన్నిచ్చి రావడం, దీనివల్ల ఎంతడబ్బు ఖర్చుఅవుతుందో, ఎంత ఇబ్బంది ఉంటుందో గమనించాలి. ఆ గడ్డి కోసుకొంటేమాత్రం ఏమిటా అంటాను దానికి ఇంత దొంగతిరుగుడు ఎందుకు అని అడుగుతున్నాను. గడ్డికోసం ఇంత చేయవలసిన అగత్యంలేదు. గడ్డి తెచ్చుకొంటున్నారంటె పశువులకో లేక కొట్టాలు కట్టుకోడానికో తెచ్చుకుంటారు. దానివల్లకలిగే చెడుపు ఏమిలేదు. కనుక వీలైనంతమట్టుకు ఈ పద్ధతిని సవరించవలసిందని మనవిచేస్తున్నాను. అంతేకాకుండా రైతుకు ఇబ్బందులు చాలాఉన్నాయి. కొండకు వెళ్లుతాడనుకోండి. అక్కడ తనకు కావలసిన వస్తువు, ఒకవ్యవసాయపు పనిముట్టుకు పనికివచ్చేదో లేక ఇల్లుకట్టుకోడానికి పనికివచ్చేదో ఏదో ఒకవస్తువు కన్పింస్తుందనుకోండి దాన్ని తెచ్చుకోనడం కష్టంగా ఉంది. ఎట్లాగూ కట్టేలకోసం బండి తీసుకపోయిఉంటాడు. అప్పుడే ఆ వస్తువు తీసుకురావడానికి ఎంతోసులభంగా ఉంటుంది. అట్లు గాకుండా మరలదానికి ప్రత్యేకంగా బండి బాడుగపెట్టుకొని డబ్బుపెట్టి తెచ్చుకోవాలంటె చాలకష్టంగా ఉంటుంది. వ్యవసాయానికి పనికివచ్చేటటువంటి వెలమ, బిల్లువెలమ వగైరా జాతులున్నాయి. అవి వ్యవసాయ పనిముట్లు చేసుకోడానికోఒక నాగలిచేసికోడానికో ఉపయోగపడుతాయి. అటువంటి ఒకతుంట కన్పడితేదాన్ని తెచ్చుకోడానికి అవకాశం లేదు. బండి ఎట్లాగూ ఇంటికి వెళ్లుతుందికదా, మరలా దీనికొంకు బాడుగ 3,4 రూపాయలు పెట్టుకొని తెచ్చుకోనేదానికంటె, ఇప్పుడే తెచ్చుకొంటే ఎంతో అనుకూలంగా ఉంటుందనుకొంటె, దాన్ని తీసుకు రావడానికి అవకాశం లేకుండాఉంది. రైతు తనవ్యవసాయపు పనిముట్లకు కావలసిన ఇటువంటి చిన్నచిన్న వస్తువులను ఎంతో ప్రాణప్రదంగా, ఎంతో ఉత్సాహంగా తీసుకొంటాడు. తన వ్యవసాయంకోసం ఏ చిన్నవస్తువునుకూడ బ్రహ్మాండంగా తీసుకుంటాడు. కనుక ఇటువంటి చిన్నచిన్న అవకాశాలు రైతుకు ఇవ్వాలి.

ఆ విధంగానే కొన్నికొన్నిచోట్ల గుట్టలు ఉంటాయి. వాటిమీద చెట్లేవి మొలచే అవకాశంలేదు. పట్టిగడ్డిమాత్రం మొలుస్తుంది. కాని అక్కడికి పశువులనుగాని మేకలనుగాని పోనివ్వడంలేదు. చెట్లుచేమ లేనటువంటి ఆ తిప్పలలోకూడ ఎందుకు పశువులు మేయడానికి అవకాశ మివ్వకూడదో అర్థంకాదు. రామతీర్థమనే తిప్ప ఉన్నది. అదికొన్ని నూర్లు ఎకరాలు ఉంటుంది. అక్కడ చెట్టుచేమలేదు. దాంట్లో కొంచెముమే కావలసివస్తే తీసుకోడానికి అవకాశంలేదు. మేకలు జీవాలుకూడ మేయడానికి అవకాశంలేదు. అక్కడేమయినా పనికివచ్చే చెట్లున్నాయంటే ఏమి లేదు. కనుక అటువంటి ప్రాంతాలలోకూడ పశువులను మేయనివ్వకపోతే అవి ఎక్కడమేయాలి. ఎక్కడో ఒక్కచోట అవిమేయాలి కదా.. అక్కడ

కూడ వొద్దంటె, ఇంకెక్కడకు పోగలవు. కనుక అటువంటి సమస్యను కల్పించాలని ప్రభుత్వము ఈ విషయాలలో ఎక్కువ శ్రద్ధతీసుకొని సహాయం చేయాలని ప్రార్థిస్తూ విరమిస్తున్నాను.

* SRI G. SURYANARAYANA :— అధ్యక్షా, revenue forest area ను అభివృద్ధి చేయడంలో ప్రభుత్వము అనుసరించే demarcation విధానాలవల్ల ఆయా ప్రాంతములో ఉన్న అమాయకపు ప్రజలు చాలా కష్టాలకు గురి అవుతున్నారు. Forest area ను reserve చేయడంలో రైతులు పట్టాభూముల మీదనుంచే వారు సరిహద్దును ఏర్పాటుచేస్తున్నారు. అంతేకాదు. ఆప్రక్కనే ఉన్న గ్రామాలనుంచీకూడ ఈసరిహద్దును ఏర్పాటుచేస్తున్నారు. ఆ గ్రామాలలో ఉన్న పశువులుగాని గొర్రెలు మొదలైనటువంటివి ఆరిజర్వు ప్రాంతాలకుపోతే లేనిపోని అనవసరపు కలహాలను పెట్టి వారిమీద అనేక కేసులుపెట్టి అనేక కష్టాలు పెడుతున్నారు ఈ forest ఉద్యోగస్థులు. అంతేకాదు, ఆయా ప్రాంతములలో ఉంటున్న పేదప్రజలు forest area బయటనుంచీ వంటచెరుకు అనగా కట్టెలు తీసుకొని వస్తూన్నప్పటికి, అవి forest తాలూకు కట్టెలన్ని ఆ అమాయకపు ప్రజల మీద అనేక కేసులుపెట్టి సకలబాధలు పెట్టుచున్నారనే విషయము ప్రభుత్వదృష్టికి తీసుకొని వస్తున్నాను. అంతేకాక, ఆయా ప్రాంతాలలో ఉంటున్నప్రజలు ఈ ఆఫీసర్లు ఎన్ని కష్టాలుపెట్టుచున్నా, ఆ కష్టాలకు గురి అయి, అటువైపు కంట్రాక్టర్లు ఇటువైపు Forest officers ఉండడంవల్ల, వీరిమధ్యన తగుల్కొని, వారికష్టాలు ఎవరితోను చెప్పుకోడానికి వీలులేకున్న పరిస్థితి ఈనాడు. ఏర్పడింది అంతేకాదు. ఆ forest లో వేలకొలది ఎకరాలు బంజరుభూములు ఉన్నాయి. మనదేశంలో ఈనాడు వనమహోత్సవం చేసినట్లే, ఆ Forest లో ఉన్న వేలకొలది బంజరు భూములలో వృక్షజాతులు వేస్తున్నారు. ప్రజలకు ఆహారకొరత ఎప్పుడు తీరుతుందా అని ఎదురుచూస్తున్న ఈ సమయంలో అక్కడ లేనిపోని వృక్షములు వేస్తున్నారు. పోనీ అవి ప్రజలకు ఏమైనా ఉపయోగపడతాయా అంటే లేదు. అంతేకాక, ఆ వృక్షజాతులను కాపాడటానికి అక్కడ ఇద్దరుముగ్గురిని నియమిస్తారు. వారు వాటికి నీరుకూడ పోసేదిలేదు. ఆవృక్షములు ఎందుకూ పనికిరాని పరిస్థితిలో ఉన్నాయి. వేలకొలది బంజరుభూములలో అనవసరంగా ఈ వృక్షజాతులను వేసే దానికన్నా ఆయా ప్రాంతాలలో ఉన్న పేదప్రజలకు ఆ బంజరుభూములు ఇచ్చి వాటిని సాగుచేసుకొనుటకు Co-operative Society మార్గమును ఏర్పాటుచేసి వారికి కొంతధనము సహాయంచేసి, అవిధంగా బీదప్రజలకు జీవనాధారమును కల్పించి,

[SRI G. Suryanarayana [26th July 1955

మన దేశముయొక్క ఆహారకొరతను తీర్చుడానికి ప్రభుత్వము కృషి చేయవలెనని కోరుచూ విరమిస్తున్నాను.

SRI G. YELLAMANDA REDDI :— అధ్యక్షా, ఈ బడ్జెటునుబట్టి చూస్తే, ముఖ్యమంత్రిగారు ఈ forest గురించి ఏమిశ్రద్ధ కనుపరచినట్లులేదు. ప్రశ్నోత్తరసమయములోకూడ ఈ విషయం గురించివేసిన ప్రశ్నలకు చూస్తాము అని చెప్పి, దీనిని serious గా study చేయకుండా, పట్టించుకోకుండా ఉన్నారని నేను భావిస్తున్నాను. ఈ forest సమస్య, ఈ డిమాండు చిన్నదే కావచ్చును. కాని యిది ఆంధ్రరాష్ట్రములోని రైతాంగాని కంతటికి సంబంధించినటువంటిది. అందువల్ల, ఈ విషయంలో ప్రభుత్వము సరియైనటువంటి విధానాన్ని అవలంబించి ఒక నూతన పద్ధతిలో ఈ సమస్యను పరిష్కారం చేయకపోతే చాలా ఇబ్బందులున్నాయని మనవి చేస్తున్నాను. ముఖ్యంగా ఈ Forest బంజర్ల సమస్య ఉన్నది. ఇప్పుడు ప్రభుత్వానికి, ఈ వనమహోత్సవాలు జరుపడం, ఈ మృగ మహోత్సవాలు జరుపడం ఈవిధంగా ఒక mania ఉంటున్నది. ఇందులో వచ్చే complications గురించి ప్రభుత్వంగాని అధికారులుగాని ఆలోచించకుండా ఉన్నారు. కేవలం మన బుర్రలలో పుస్తకాలమీద plans వేసుకొని, వీటి నుంచి వచ్చేఫలితాలను difficulties ను గురించి ఆలోచించకుండా ఉండే విధానాన్ని ఈ ప్రభుత్వము అవలంబిస్తున్నందుకు చాలా విచారిస్తున్నాను. ఈ సందర్భంలో ముఖ్యంగా Forests develop చేయాలని చెప్పుతున్నారు మన ప్రభుత్వలెక్కలప్రకారం ఇప్పటికే 78·55 లక్షల ఎకరాలు అడవులు ఉన్నాయి, సాగుకు లాయకుగాని barren lands 59·54 లక్షల ఎకరాలు, చెట్లు పెంచడానికి వీలు అయిన ప్రాంతాలు 7·2 లక్షలు ఎకరాలు ఉన్నాయి. తరువాత చెట్టు చేమగల ప్రాంతాలు 5·3 లక్షలు ఎకరాలు ఉన్నాయి. మొత్తం చూచినట్లయితే 150·83 లక్షల ఎకరాలు ఈరకంగా చెట్టుచేమ పెంచడానికిగాను, అనుకూలంగా తయారైంది.

ఈ పరిస్థితులలో యింకా యీ అడవులను పెంచాలనిఅంటే, మొత్తముమీద మన ఆంధ్రదేశములలోవున్న విస్తీర్ణములో 37% భూమిని యీవిధంగా చెట్టువేసి పెంచటానికి యిప్పటికే అవకాశము కలిగివున్నదన్నమాట. ఫారెస్టుక్రింద లేకుండా వున్నటువంటి 59 లక్షల యకరాల బంజరుభూమి, అంతాకూడ సాగుకు లాయకీగా అయినది కాబట్టి, ఆ భూమిఅంతేయునూ సాగుకు యివ్వమంటే యివ్వకుండా, యీ

26th July 1955] [SRI G. Yellamanda Reddi

భూమిలో మరల Forest ను పెంచాలని అంటున్నారు. కాని సాధారణంగా రైతులుగాని, ఎసెంబ్లీసభ్యులుగాని, ఫారెస్టు ఉద్యోగస్థులుగాని అడవులు లేకపోతే వర్షాలుగాని, పశుసంపదగాని వృద్ధికాదుఅని చెబుతారు. అందువల్ల అడవులు పెంచాలని అంటారు. నిజమే దానికి మేము కాదనడంలేదు. కాని యిప్పుడు బంజరుగా వున్న ప్రాంతాలలో చెట్లు పెంచటానికిగాని లేకపోతే forest ను develop చేయటానికిగాని ప్రభుత్వము యింతవరకూ ఏమిచర్యతీసుకున్నది, ఎంతవరకు కృషి చేస్తున్నది, దానివల్ల ప్రభుత్వము ఎంతవరకు ఫలితాలను సాధించగలిగింది, అని నేను ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను. మనము అనేక అడవులుచూస్తున్నాము. మా ప్రాంతాలలోగూడ అడవులువున్నవి. కాని అనేకచోట్లలో చెట్లు యేమీలేవు అని మన మిత్రులు యిక్కడ శాసనసభలోగూడా నివేదించారు. కాబట్టి మనకు వున్న అడవులను పూర్తిగా అభివృద్ధిచేసుకోవడం, ఆ రకంగా అడవి సంపదను పెంచుకోటానికి ప్రభుత్వము ప్రయత్నించకుండా, వారి యిష్టమువచ్చినట్లు Administration Report లో మాత్రం విస్తీర్ణము యింతవుందని వ్రాసుకోవడం, యీ సంవత్సరము 20 వేల ఎకరాలు చెట్లుపెంచాము, యీ సంవత్సరం 30 వేల ఎకరాలు చెట్లుపెంచాము అనేమాదిరిగా యిష్టమువచ్చినట్లు ఏదో నామకః రిపోర్టును తయారుచేసిపంపడము కనబడుతున్నది. ఇంతేకాకుండా యీ రిపోర్టులు, యీ సంవత్సరము యిన్ని మొక్కలు వేశాము, యిన్ని బ్రతికాయి అంటూ కానరాని లెక్కలు అన్నీవ్రాస్తూవుంటారు. నిజానికి ఎన్నిమొక్కలు వేశారు. ఎన్ని బ్రతికాయో ఎన్నిచచ్చాయో, గూడా ఎవరికి తెలుసు ? Forest Department వారు వ్రాసినదే లెక్క. అది సరియైన లెక్క అవునో కాదోగూడా ఎవరు యిందంతా పరిశీలించేది ? కాబట్టి దీన్నిబట్టిచూస్తే ప్రభుత్వము ఫారెస్టు డిపార్టుమెంటు సక్రమమైన రిపోర్టులు పంపుతున్నారాలేదా అనేది గమనించినట్లు లేదు. అందువల్ల కేవలము విస్తీర్ణముకోసం అడవులను పెంచాలనే mania తప్ప అసలువున్న forest ను devolop చేసుకోవాలా, అక్కరలేదా అనేది తేల్చుకోటానికి ప్రభుత్వము ఒక స్పష్టమైన విధానము అవలంబించాలని అంటున్నాను. ఇదివరకువున్న ప్రభుత్వము చాలా ప్రాంతాలలోవున్న బంజరు భూములను, వందల కొలది ఎకరాలను పేదప్రజానీకానికి, ప్రైవేటులకు సాగుకుయిచ్చింది. కాని యీ ప్రభుత్వము అటువంటి విధానము మార్చుకోవాలని మనస్సులో పెట్టుకొని, యీ భూముల విషయములో యిదివరకువున్న G. O. ను రద్దుచేసి, యిదివరకు యిచ్చిన భూములను వాపసు తీసుకోటానికి యిప్పుడు తయారుఅవుతున్న దన్నమాట. అందువల్ల యీ రోజున మన ఆంధ్రదేశములో, మనకు కావలసిన

SRI G. Yellamanda Reddi] [26th July 1955

అడవుల విషయములో విస్తీర్ణమునుబట్టి, అభివృద్ధి చేసుకోటానికి కావలసిన forests కు తగిన విస్తీర్ణమువున్నది. Technical experts చెప్పినట్టు మూడవవంతు అంటె దాదాపు 37% భూమి మనకువున్నది. దానిలో మనకు కావలసిన చెట్లు చేమ పెంచుకోటానికి అవకాశమువుంటుంది. కాబట్టి ఆ రకంగా అడవులను వృద్ధి చేయాలేగాని, కేవలం అడవుల విస్తీర్ణం పెంచుకునే విధానముకాకుండా, ఏదో విస్తరణగావుండే భూమిని సాగుకు లాయికీఅయినభూమిని అడవుల పెంపకము అనే పేరుతో కుంచింపచేసే విధానము ప్రభుత్వం తప్పకుండా మానుకోవాలి. తరువాత ఎస్టేట్సులోవున్న అడవుల విషయము వున్నది. ఇది అసలు ముఖ్యమైన సమస్య. ముఖ్యంగా మన ఆంధ్రదేశములో నూటికి 33 వంతులు అడవి యీ estates లో వున్నవి. Estates Abolition Act ఇచ్చినతరువాత, ప్రభుత్వము కొన్ని estates ను స్వాధీనము చేసుకొన్నది, ఇంకా కొన్ని స్వాధీనము చేసుకోలేదు. అందువల్ల ఈ Estates "Taken over Estates" "Not Taken Over Estates" అని రెండు విధాలుగా వుంటున్నవి. ఈ Taken Over Estates అనేవి అన్నీ ప్రభుత్వము స్వాధీనపరుచుకున్నది. స్వాధీనపరచుకొని Forest Manual వీటికి apply చేస్తున్నది. అందువల్ల ఈ estates లో ప్రతిసెంటు సాగుచేయని భూమిని Reserve Forests క్రింద వుంచబడ్డది. ఈ నాడు Forest Manual apply చేసినందువల్ల; Forest అధికార్లకు ఈ Reserve Forest మీద అధికారము సంక్రమింపజేసింది. అందువల్లి గ్రామాలలో సాగుచేసిన భూమికాకుండా, యితర భూమిమీద forest అధికార్లకు అధికారాలు ప్రభుత్వము యిచ్చింది. ఏ కొద్దో గొప్పో బంజరుభూమి వుంటే, అందులో రైతుయొక్క పశువులుగాని, మేకలుగాని, ప్రవేశించినట్లయితే ఫారెస్టు అధికార్లు కేసులు పెట్టటానికి సంపూర్ణమైన అధికారము ప్రభుత్వము యిస్తున్నది. అందువల్ల గ్రామాలలో రైతులకు అనేక విధాలుగా యిబ్బందులు కలుగుతున్నవి. Forest మంత్రిగారు నెల్లూరుజిల్లాలో పర్యటించుచున్నప్పుడుగాని, లేక యిక్కడ శాసనసభలో ఉపన్యాసము చేసేటప్పుడుగాని, అవకాశము తీసుకొని, ఈ ఫారెస్టు ఆఫీసర్లవల్ల రైతులకు కలిగే యిబ్బందులను గురించి వారిదృష్టికి తీసుకొనిరావడ మయింది. ఈ విషయము గత మంత్రివర్గము ఎదుట వున్నప్పుడు ఏవిధంగా పరిష్కరించాలి అనే సంగతి వచ్చినప్పుడు, మంత్రివర్గము దీని విషయములో చాలా తీవ్రంగా ఆలోచించి, ఫారెస్టు రిజర్వు విషయములో ఫారెస్టు అధికార్లు అధికారము చెలాయించేందుకు రిజర్వుకుగాను వేసిన rough lines వల్ల కలిగే లోపాలనుగురించి ఆలోచించి, చివరకు

taken over forests లో కేసులు యికమీదట పెట్టకూడదని, రైతులను బాధించకూడదని, వారిని ఏదో నోటీ జెసిరించుతో రక్షించాలి అని వుత్తరువులు పంపించారు. అందుమీదట ఫారెస్టు అధికార్లు పెట్టిన కేసులన్నీ వెంటనే withdraw చేశారు. దానివల్ల కొంతవరకు రైతులమీద ఫారెస్టు అధికారులు కేసులు పెట్టడము మేశారు. దీనివల్ల రైతుల ఆందోళన తగ్గి పోయింది. కాని యిటీవల ఈ మంత్రి వర్గము వచ్చినతరువాత యిదివరకు యిచ్చిన ఆర్డర్సు అన్నీ cancel చేసి యధాప్రకారంగా ఫారెస్టు అధి కార్ల వారికి వున్న అధికారాలను మరల force లో పెట్టారు. ప్రభుత్వము ఈవిధంగా ఆర్డర్సును మార్చడమువల్ల రైతులకు మరల యిబ్బందులు ప్రారంభమైనవి. అందువల్ల యిప్పుడు రెవిన్యూ డిమాండు వచ్చినప్పుడుకూడా ఈ సర్వే సెటిల్ మెంటు పూర్తికావటానికి సుమారు ఏ10, 12 సంవత్సరాలలో పట్టుతుందని అనుకొంటున్నారు. కాబట్టి రిజర్వుకు పర్మనెంటుగా లైన్సు వేయటానికి పది పన్నెండు సంవత్సరాలు పట్టు తుందేగాని యింతకులోపల ప్రభుత్వానికి సాధ్యము కాదని తెలుస్తున్నది.అలాంటప్పుడు ఈ పది పన్నెండు సంవత్సరాలవరకూ రైతులయొక్క యిబ్బందులను తొల గించటానికి Forests లోని రిజర్వుకుగాను వేసిన rough lines ఫారెస్టులైన్సుగా ఏర్పాటుచేసి, అందువల్ల ఎలాంటి యిబ్బందులు రైతులకు కలుగకుండా ప్రభు త్వమునుంచి ఆర్డర్సు పంపవలసియున్నది. లేకపోతే, రైతులమీద ప్రతిరోజు గూడా యీ ఫారెస్టు అధికార్లు, గార్డులు కేసులుపెట్టుతునే వుంటారు. రైతులు వానివల్ల చాలా యిబ్బందులకు గురికావలసి వస్తుంది.

సర్వే సెటిల్ మెంటుచేసే విధానము చాలాపెద్దది. ఇదివరకు మనము మద్రాసు ప్రభుత్వములో యీ సర్వే సెటిల్ మెంటు చేసేటప్పుడు సాగుచేసుకొన బడే బంజరుభూములు రైతులకే వదిలిపెట్టాలనే విషయము వచ్చినప్పుడు సాగుచేసుకునే భూములలో సుమారు 30% వరకు రైతులకు వదిలిపెట్టాలని అను కున్నారు. తరువాత Conservator of Forests ను కలుసుకున్నప్పుడు, యీ పరసెంటేజిని తగ్గించడమా ఎక్కువచేయడమా అనే ఆలోచన వచ్చింది. అప్పుడు యీవిషయము ప్రభుత్వము ఆలోచిస్తుందని ప్రభుత్వమువారు చెప్పారు. ఇంతవరకూ కూడా ప్రభుత్వము యీ సర్వే సెటిల్ మెంటు జరిగే సందర్భంలో పరసెంటేజి ఎంత అని నిర్ధారణచేసేవిషయములో, యీబంజరుభూములలో ఎంతవరకు రైతాంగము సాగు చేసుకోటానికి వీలవుతుంది అనేది యింతవరకూకూడా ప్రభుత్వము నిర్ణయించలేదు. పోనీయండి, యిప్పటికి ఎన్నో సంవత్సరాలుగా వాళ్లు సాగుచేసుకుంటున్నప్పుడు అవి వాళ్లకు పట్టాకైనా యివ్వలేదు. కాబట్టి యీవిషయములో ప్రభుత్వము ఒక సమగ్రమైన పంథాలో రైతాంగానికి ఏవిధంగాను యిబ్బందులు లేకుండా ఫారెస్టు

SRI G. Yellamanda Reddi] [26th July 1955

అధికార్లవల్ల ఏవిధంగాను రైతులకు బాధ కలుగకుండా ఫారెస్టులు అభివృద్ధిపరచ టానికి, తయారుచేయవలసిందిగా ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

ముఖ్యంగా Estates లోవున్న Forests విషయములో మొన్న మంత్రిగారు ప్రశ్నలకాలములో సమాధానముచెబుతూ "Estates రద్దుఅయితే రైతులకు Estate భూములమీద హక్కులు వుండేటట్లు కనబడలేదు" అని చెప్పారు. ఈ విధంగా చెప్పడము చాలా విచారకరంగా వున్నది. 1937వ సంవత్సరములో ప్రకాశము పంతులు గారు ఒకరిపోర్టుతయారుచేశారు. ఆరిపోర్టుయొక్క 1st partలో 169 పేజీలో రైతాంగము Estate Forest లోనుంచి గడ్డితెచ్చుకోవడం, వ్యవసాయానికి కావలసిన పనిముట్లు తెచ్చుకోవడం జరుగుచున్నది, అలా తెచ్చుకునేహక్కు రైతాంగానికి సర్వసిద్ధంగా వున్నదని ప్రకాశంపంతులుగారి రిపోర్టులో స్పష్టంగా వ్రాయబడ్డది. తరువాత మద్రాసు ప్రభుత్వముగూడా యీ విషయము పరిశీలించారు. రైతాంగానికి యిటువంటి హక్కువున్నదని గుర్తించబడియున్నది, కొన్ని హక్కులు గూడా కలుగజేస్తామని అప్పుడువున్న వ్యవసాయ శాఖామంత్రి నాగన్నగౌడు గారుగూడా వాగ్దానముచేసియున్నారు. తరువాత Reserve lines, forest lines వేసే సందర్భములో రైతాంగముయొక్క హక్కుతీసివేయకుండా చెయ్య టానికి ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఈమాదిరిగా ఫారెస్టులోనుంచి గడ్డి కంప వగైరాలు తెచ్చుకొనే గ్రామాలు చాలావున్నవి. ముఖ్యంగా కనిగిరి, ఉదయగిరి ఫారెస్టులు చూచినట్లైతే అనేకగ్రామాలు ఫారెస్టుమధ్యలోనేవున్నవి. ఆ గ్రామాలలోని రైతులు పూర్వకాలంనుంచి యిదేమాదిరిగా తెచ్చుకుంటు న్నారు. ఇటీవల ప్లానింగుమంత్రిగారుకూడ ఆ ప్రాంతాలకు పర్యటనకు వచ్చి నపుడు యీ సంగతి వారి నోటీసుకు తీసుకొనిరాబడ్డది. ప్రభుత్వమువారు యీ పేదరైతాంగము విషయములో శ్రద్ధవహించాలని మనవిచేస్తున్నాను. ఫారెస్టు గ్రామాలకు సమీపములోవున్న కారణమున ఎండుకట్టెలు తెచ్చుకొని అమ్ము కోటానికి అవకాశము కల్పించాలి.

తరువాత మేకలసమస్య చాలా పెద్దసమస్య. ఆ ప్రాంతములో మేకలుకల రైతులు చాలామంది వున్నారు. గొర్రెకన్న మేకలమీద ఆధారపడినవారు ఎక్కువ మంది వుంటున్నారు. గొర్రెలకన్న మేకలమీదనే ఎక్కువగా ఆదాయము సంపా దించుకుంటున్నారు. శాస్త్రజ్ఞులు చెప్పడములో ఫారెస్టులోని చెట్లు 6 అడుగులు ఎత్తు పెరిగినతరువాత మేకలను ఫారెస్టులోవిడిస్తే, వృద్ధికి ఆటంకముకాదని చెప్పి

యున్నారు. ఈ విషయము ప్రభుత్వమువారు ముఖ్యంగా గమనించాలని అంటున్నాను.

మరొక విషయమువున్నది. కంచెపుల్లరి వసూలుచేయడము ఆనేదివున్నది. Estates Abolition Act ప్రకారము యీపుల్లరి ఎస్టేటు రద్దయినతరువాత మూడు సంవత్సరాలకు మాత్రము వసూలుచేయవలసివున్నది. గతసంవత్సరము యీ కంచె పుల్లరి వసూలు చేసేముందు గ్రామాలలోని రైతులకందరికి నోటీసులు యిచ్చారు కాని Estate Abolition Act ప్రకారము Miscellaneous grant క్రిందకువస్తుంది. ఇది మూడుసంవత్సరాలలోపల average rent క్రింద వసూలుచేయాలి. అది దాటిపోతే:వసూలుచేయకూడదు అనిగూడా యాక్టులోవుంది. మరొక విధంగాగూడా వసూలు చేయకూడదు. కాని అయిదు, ఆరు సంవత్సరాల తరువాత యిటీవలనే ఆంధ్ర రెవిన్యూబోర్డువారు ఒక ఆర్డరు జారీచేశారు. దీనికి కారణము యేమిటి అని విచారిస్తే, దీనికి ఒక technical objection వున్నదని చెప్పారు. అదేమిటి అంటే, Forests not properly taken over అని చెప్పి యీ property అనే మాటను అందులో చేర్చి, మరల యీ పుల్లరి వేలంవేసి వసూలు చేస్తామని రైతాంగానికి ఒక నోటీసు జారీచేశారు. అప్పుడు రైతాంగము ఆందోళన చేయడమువల్ల, కంచెలు వేలము వేసినప్పటికినీ, మరల యీ ఆర్డరును ప్రభుత్వమువారు withdraw చేశారు. కాబట్టి యిటువంటి technical objections వల్ల అన్యాయపు పన్ను వసూలుచేయకూడదని ప్రభుత్వాన్ని కోరుచున్నారు. ఇలాంటి హక్కు ప్రభుత్వానికిలేదు. చట్టరూపములో రైతాంగమునకు వుండే హక్కును గుర్తించాలని మనవిచేస్తున్నాను. కాబట్టి యిప్పుడు ముఖ్యంగా నేను మనవిచేసేది యేమిటంటే, యీనాడు యెస్టేటు ఫారెస్టు విషయములో తక్షణం యిప్పుడు రైతులమీద కేసులు తీసివేయించటానికి చర్యలు తీసుకోవాలని యీ విషయములో మంత్రిగారు తప్పకుండా సమాధానము చెప్పవలసిందిగా మీ ద్వారా కోరుతున్నాను.

5-00 p.m.

* Sri P. GUNNAYYA :— అధ్యక్షా, ఈ ఫారెస్టు డిమాండును నేను బలపరుస్తూ కొన్నివిషయాలు తమ దృష్టికి తీసుకువస్తున్నాను. నేను ముఖ్యముగా ఏజన్సీ ప్రాంతాల్లో పర్లాకిమిడిప్రాంతంలో ఎన్నుకోబడిన మెంబరును. ఆ తాలూకా పర్లాకిమిడి రాజాగారి చేతిక్రింద ఉండేది. అక్కడ మహా అరణ్యములు ఉన్నవి. ఆ ప్రాంతలో సవర, కోయవంటి కొండజాతులవారు ఎక్కువగా ఉన్నారు. ఇప్పుడు ఫారెస్టు డిపార్టుమెంటు ఆ కొండజాతులవాళ్లు సవరలు మొదలైనవారందరూ

26th July 1955] [SRI P. Gunnayya]

10 సం॥ల నుంచి దున్నుకు నేటటువంటి పోడుభూములన్ని నిర్బంధముగా తీసుకొని వాళ్లను కష్టపెడుతున్నారు. అలాంటి నిర్బంధములేకుండా ప్రభుత్వమువారు ఆ కొండజాతులవాళ్లకు ఆ ప్రాంతములలో తగినటువంటి సౌకర్యములు కలిగేవరకూ వారు దున్నుకునేటటువంటి పోడులు వారికి ఇవ్వాలని కోరుతున్నాను. ఫారెస్టులు పెంచడం చాలా మంచిదే. పర్లాకిమిడి మహారాజుగారి ఆధ్వర్యంలో అక్కడ ఒక గ్రామముండేది. అక్కడవారికి కావలసిన నాగళ్లుకాని యేడికట్టలుగాని, ఏతికఱ్ఱలుకాని అన్నికూడా అడవుల్లోనుండి పూరికినే తెచ్చుకునేవారు. ఇప్పుడు అది గవర్నమెంటుక్రిందకు వచ్చినవెంటనే గ్రామస్థులకు కావలసినవి ఏమియు తెచ్చుకోనివ్వకుండా నిర్బంధపెడుతున్నారని ప్రతి గ్రామంలోనూ ఆందోళన చేస్తున్నారు. అట్టి ఆందోళనలేకుండా అడవి ప్రాంతములో ఉన్నటువంటి రైతులకు వ్యవసాయమునకు పనికివచ్చేటటువంటి పరికరములు అన్నీ ప్రజలు పూరికినేవెళ్లి తెచ్చుకొనే ఏర్పాట్లు చేయిస్తారని ప్రభుత్వమువారిని కోరుతున్నాను. ఆ ప్రదేశములో రాజాగారు ఉన్నప్పుడు అనేకరోడ్లువేశారు. రిజర్వ చేసినందువల్ల పెద్దపులులుకూడా అక్కడ చేరుతున్నాయి. రోడ్డుకు 100 గజాలువదలి తతిమ్మాది రిజర్వుచేసుకుంటే మంచిదని మనవిచేస్తున్నాను. ఎందువల్ల అంటే ఆరోడ్డుమీద రైతులు యితర, ప్రజానీకము నడువవలసివుంటుంది. అలాంటప్పుడు రోడ్డువరకుకూడా రిజర్వు ఉండడమువల్ల, పెద్దపులులుచేరి మనుష్యులను తినివేస్తున్నాయి. గతనెల 26, 27 తేదీలలో సంగవరను ఫారెస్టుగుండా ఆలమండకు పోయేరోడ్డుమీద నేను ప్రయాణముచేస్తుండగా ఇద్దరు మనుష్యులను చంపుకు తిన్నది. ఫారెస్టుఆఫీసరుకు రిపోర్టుఇచ్చాము. జిల్లాకలెక్టరుకుకూడా రిపోర్టు ఇచ్చాము. కలెక్టరుకూడా వెళ్లిచూడలేదు. ఫారెస్టు ఆఫీసరు పోలీసువారికి వ్రాశామన్నారు. అక్కడ ఆపులి దానిపని అదిచేసుకుంటూనేయున్నది. ఆరోడ్డు ప్రాంతంలో ఇకనైనా రిజర్వు చేయకుండా నడవడానికి ఒక ఫర్లాంగు దూరం బాట వదలి రిజర్వు చేయిస్తారని ఆశిస్తున్నాను.

తరతరాలనుండి మేకలు, గొఱ్ఱెలు, మేపుకొనుటకు ఒక్కొక్కటికి 8 అణాలు చొప్పున పుచ్చుకునేవారు. ఇప్పుడు మేకలు అడవులలోకి వెళ్ళకుండా ఫారెస్టుగార్డులు మేకఒకటికి రూపాయి వసూలుచేసి మేకలను మేయకుండాకూడా ఇబ్బంది పెడుతున్నారు. ఒక దృష్టాంతరమును మీ ముందుకు తీసుకువస్తున్నాను. 80 మేకలను ఫారెస్టు ఆఫీసరుగారు పాతపట్టణంలో పట్టుకొన్నారు. 85 రూ॥లు తీసుకొన్నారు. మళ్ళీ కేసుపెట్టారు. ఆ 85 రూ॥లు ఏమైనాయంటే గవర్నమెంటుకు కట్టామన్నారు. District Forest Officer ను అడిగితే కట్ట

26th July 1955] [Sri P. Gunnayya]

లేదన్నారు. ప్రభుత్వమువారు ఇటువంటి అన్యాయాలను అరికట్టవలయును. మరియు తరతరాలనుండి గొల్లవారు దీనిమీద బ్రతుకుతున్నారు కాబట్టి మేకకు రూపాయి గాని, 2 రూ॥లు గాని పన్ను విధించి అడవుల్లో మేపుకొనుటకు ప్రభుత్వమువారు అర్డరు యిప్పిస్తారని ఆశిస్తున్నాను. అడవిప్రాంతములో గుత్తకంట్రాక్టులు లేకుండాచేసి కొండజాతివారికి సొసైటీలద్వారా సదుపాయముచేస్తారని కోరుచున్నాను. ఈ అవకాశం నాకు కల్పించినందులకు అధ్యక్షులవారికి సాహృదయపూర్వక అభినందనలు సమర్పిస్తూ విరమిస్తున్నాను.

*SRI P. KODANDARAMAYYA :—అధ్యక్షా! ఈఫారెస్టు డిమాండును నేను బలపరుస్తూ అక్కడ ఉండేటటువంటి వారియొక్క ఇబ్బందులను ప్రభుత్వదృష్టికి తీసుకురావడముకోసము ఇక్కడ 2,3 విషయములు చెప్పాలని నిలబడ్డాను.

ముఖ్యముగా ఫారెస్టుపేరు చెప్పేప్పటికి నాకు గుండెదడవస్తున్నది. అది ఫారెస్టుకాదు. ఒకయమలోకము. ఈ కోయవాళ్ళకు అది నిజముగా యమలోకమే. పాపమువాళ్లు ఆకులూ, అలములుతింటూ ఎట్లాగో కాలముగడుపుతూండేవాళ్ళకు ఇద్దరు బాధాకరంగా వుంటారు. ఫారెస్టుడిపార్టుమెంటువారు ఒకరు. షావుకారు-వాడి వర్తకమునకు వచ్చినటువంటి వర్తకులు రెండవవారు. ఈ ఇరువురుకూడా వాళ్ళయొక్క రక్తము పీల్చి పిండిచేస్తారు. అసలు అది జబ్బులతో బాధపడే ప్రదేశము. ఆహారములేని ప్రదేశము. దీనికితోడు ఆ ఇరువురుకూడా వీళ్ళను బ్రతకనీయకుండా చేస్తున్నారు. దీనివిషయంలో నేను 34 సం॥లుగా బయటఉండి శీతమ్మ శోకము పెట్టాను. ఇక్కడనుంచికూడా ఒకమారు శీతమ్మశోకముపెడితే ఏమైనా ప్రభుత్వం ఈ విషయం గురించి ఆలోచిస్తుందేమో అనేటటువంటి హృదయావేదనతో ఈ రెండు ముక్కలు చెప్పడముకోసము నేను ఇక్కడకువచ్చాను. ఫారెస్టుఆఫీసర్ల ఇళ్లచుట్టూర అడవులుఉంటాయి. నేను 34 సం॥ల నుంచి 365 రోజుల్లోను, సుమారు 100 రోజులు అడవిలోనే నివసిస్తూవుంటాను. అవి అంత పెద్ద అడవులుకావు. అక్కడ కర్రపుల్లలు, వెదురు, కంపమాత్రమే దొరుకుతాయి. కలప, టేకు ఇటువంటివి కావలసివుంటే యింకొక్కడనుంచో తెప్పించుకోవలసిందే. ఊరికనే ఏదో రిజర్వుకుమాత్రం ఏర్పాటుచేశారు. ఆ రిజర్వులోనే ఈ ఆఫీసర్లు కాపురము ఉండే ఇళ్లుఉన్నాయి. ఎక్కడో 4, 5 మైళ్ళకు ఒక ఇల్లు ఉంటుంది. ఆ ఇళ్లకు చుట్టూరాదార్లు రిజర్వుపెడతారు. దాంట్లోకి మేకగాని. ఒకగొడ్డుగాని వచ్చిందా

[Sri P. Kothandaramayya] [26th July 1955

అంటే వారికి కోపమువస్తుంది. ఒకవేళ అవి ఏమీ కనుక లేకపోయినా మనిషి అక్కడఉన్నాడుఅంటే వాళ్ళకు అడ్డమైన చాకిరీచేయాల్సివుంటుంది. ఇంకా వారికి కావలసింది కోడి, కొంగా ఇంకా ఏదికావలయునంటే అది తీసుకవచ్చి ఇవ్వవలసిందే. అసలు వాళ్లు సంపాదించేది చాలా తక్కువ. వాళ్ళకు కావలసినవి ఇవ్వకపోయాడంటే వాళ్లకు వెంటనే ఆగ్రహము వస్తుంది. ఆ ప్రజలయొక్క బ్రతుకు చెప్పడానికి తరముకాకుండాఉన్నది. వీళ్లు ఈబాధలతోడి కొట్టుకొంటుంటే ఈ కలపకొట్టుకోడానికి వచ్చినటువంటి వర్తకులు వారి తాలూకు ఏజంట్లు ఏమి కావలసివచ్చినాసరే అచ్చట వారిని అడుగకుండానే గృహాలలోకి ప్రవేశించి ఏది కనిపించితే అది తీసుకుపోవడము, వారు ఎవరుఅయినా అడ్డమువస్తే జబర్దస్తీచేసి తీసుకువెళ్ళడం జరుగుతోంది. ఆ విధంగానే జబర్దస్తీచేసి వాడినెత్తిన ఒక మూట పెట్టారంటే వాళ్లు ఎంతదూరము మోసుకువెళ్లమంటే, 5 మైళ్లు కానీయండి, 10 మైళ్లు కానీ యండి చచ్చినట్లు మళ్ళి వెనక్కు తిరగకుండా వాళ్లక్రిందపెట్టమనేంతవరకు మోసుకుపోతాడు. దానినే మనము కాస్త దూరముఅయినాసరే ఎంతడబ్బు ఇస్తామన్నాసరే చస్తేమోసుకు వెళ్ళడు. వాళ్లు ధుర్భాషలతో భయపెట్టి తీసుకోమంటే నోరు ఎత్తకుండా బరువు ఎత్తుకుంటాడు. ఇలాగ వాళ్లు దుర్భరమైన పరిస్థితిలో ఉన్నారు. వాళ్ళను ఏదైన మంచి మార్గంలోకి తీసుకువద్దామని ప్రభుత్వం చూస్తోందిగాని, చూడ్డములేదని నేను అనడంలేదు. కో-ఆపరేటివు సొసైటీలుపెట్టి ఫారెస్టు ఆదాయమువాళ్లకు ఇద్దామని చూస్తున్నారు. ఇందువల్ల మా బోటివాళ్ళకు లాభము జరగుతోందిగాని వాళ్ళకు ఏమీ లాభమూ జరగడములేదు. జరుగుతోంది అని నేను అనుకోను. ఇవన్నీకూడా ముఖ్యముగా ఆలోచించి వీరందరికికూడా సొసైటీలు ఏర్పాటుచేసి వాళ్లదగ్గరనుంచి ఈ సరకును తెప్పించి ఫారెస్టు ఇవతలవుండే సరకును తీసుకువచ్చేందుకు గవర్నమెంటు మోనాపొలీచేసి అలాగే ఇవ్వకుంటే వీళ్ళేతీసుకొనివారికి సహాయము చేయాలని ప్రభుత్వమువారిని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

5 p. m.

* SRI K. SANTHAPPA :—అధ్యక్షా! ధర్మవరం నియోజకవర్గములో రామాచార్యులవారు, నేను ఫారెస్టు ప్రాంతాలు వెంకట తిమ్మాపురం, వెలుదుర్తి, గంగినేపల్లి కళ్యాణదుర్గం తాలూకాలో బేస్తరపల్లి జంగంపల్లిలో ప్రచారము చేశాము. మేము Elections కు పోయినప్పుడు "అయ్యా,

మేము బీదవాళ్ళము చాలా కష్టపడుతున్నాము, మా మీద కేసులు పెట్టుచున్నారు." అన్నారు. అప్పుడు మేము "Elections అయిన తర్వాత మంత్రులతో చెబుతాము. అప్పుడు మీ కష్టాలు నెఱవేరుతాయి. ముందు ఓటుఇవ్వండి." అని బుజ్జగింపు మాటలుచెప్పి ఇట్లువచ్చాము. విష్ణువు, ఈశ్వరుడు బ్రహ్మలువలె ఉన్నారు మనమంత్రులు, ముఖ్యమంత్రి గోపాలరెడ్డి, ఉపముఖ్యమంత్రి సంజీవరెడ్డి, Planning మంత్రి కళావేంకట్రావు గారు చిన్నతనమునుండి కాంగ్రెసుసంస్థలో పుట్టి పెరిగి ఆంధ్రప్రదేశ కాంగ్రెసు President Ship వదలి All India Working Committee సభ్యత సంపాదించుకొన్న వారు. దేశము అంతా కష్టపడి తిరిగి ప్రజల పరిస్థితులు అర్థము చేసుకొన్నవారు.

"బావిడి మాటలు దేలకభావంబున కీడుమేలు పరికించి,

సద్భావుని అసద్భావుని నవసివర ఏర్పరక నెఱగ నేరగవలయన్."

అని భారతములో భీష్మాచార్యులవారు ధర్మరాజుకు శాంతి పర్వములో చెప్పారు. మాటలు వరుసనుబట్టి అర్థమును గ్రహించి కీడుమేలు పరికించి సద్భావుల ఉద్దేశ్యము గ్రహించి పరిపాలనచేసే ప్రభువులు మీరు. ఉమ్మడి రాష్ట్రకాలం నుంచి పరిపాలన చేయుచున్న మహాత్ములు. అయితే మాకు చెప్పవలసిన బాధ్యత ఉన్నది. కాబట్టి మనవి చేసుకొనుచున్నాను.

*SRI S. NARAYANAPPA :—అధ్యక్షా! ఈ అటవిశాఖ demand ను నేను సమర్థిస్తూ కొన్ని సూచనలు మంత్రిగారికి చేయదలచినాను. ఈ అడవి సంపదను పెంచుట ఎంతైనా అవుసరము. ఇది ప్రజానీకమునకు చాల ఉపయోగ పడుచున్నది. కలప, గడ్డి, కొండలయినవి తెచ్చుకొనుటకు పేదవారికి చాలా ఉపయోగపడుచున్నది. అయితే ఇప్పుడు ఇంతవరకు నేను బడ్జెటు సందర్భము లలో మూడు సంవత్సరములుగా మాట్లాడు చున్నాను. ఈ అటవీశాఖకు సంబం ధించిన భూముల విషయములో పరిష్కారము జరుగలేదు. చెట్లు పెరగడానికి సావకాశము లేకుండా ఉన్నట్టి ప్రదేశాలు చాలా ఉన్నవి. ఈ అరణ్యప్రాంతా లలో భూములు సాగుచేసే రైతులపైన ఈనాడు కేసులుపెట్టి Forest Depart- ment వారు penalties విధించి వారిపైన అరెస్టు వారంట్లు జారీచేయించి వారిని బాధించుచున్నారు. ఇటువంటి తగాదాలలో వారు ఉండడము జరుగు

SRI S. Narayanappa] [26th July 1955

చున్నదని ప్రభుత్వము దృష్టికి తీసుకువచ్చుచున్నాను. మా ప్రాంతంలో అనంతపురము జిల్లాలో పందికుంట గ్రామంలో రైతులు Forest department వారి బాధలు పడలేక వేరే గ్రామాలలో దాగుకొన్నారు. అటువంటి దారుణ పరిస్థితులు ప్రభుత్వము దృష్టికి తీసుకువస్తున్నాను. కనుక ప్రభుత్వమువారు సమగ్రంగా ఎక్కడెక్కడ ఏ ఏ ప్రాంతములలో చెట్లు పెంచడానికి సావకాశమున్నదో చూచి అటువంటి చోట్ల చెట్లు వేసి చెట్లు పెరుగుటకు వీలులేని స్థలములను రైతులకు సాగు చేయుటకు యిచ్చినట్లయిన ఎంతో ఉపయోగముగా ఉంటుంది. కనుక అటువంటి పద్ధతిని వెంటనే ప్రభుత్వము అమలు పరచాలని కోరుచూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI S. SEETHARAMAYYA :—అధ్యక్షా! వెట్టి చాకిరి Agency ప్రాంతాలలో కోయప్రజలను వదలిపెట్టిపోయేటట్లులేదు. కాంగ్రెసు ప్రభుత్వము వచ్చినతరువాత ఈ వెట్టిచాకిరిరద్దు అవుతుందని ప్రజలు ఆశపడ్డారు. కాని ఈ రోజు వరకుకూడా వెట్టిచాకిరి రద్దుచేయలేదు. ఈ forest ఉద్యోగస్తులు గ్రామాలకు పోయి అక్కడ రైతాంగమును నిర్బంధముగా తీసుకుపోయి పని చేయించుకొనుచున్నారు. అనేక గ్రామాలలో వీరు వ్యవసాయపనులు చేసుకొని చూదాము అని వ్యతిరేకిస్తే Forest వాళ్లు ఈ రైతులను కొట్టడంకూడా జరిగింది. అందుచేత ఈ వెట్టిచాకిరీ చేసేపద్ధతిని వెంటనే రద్దుచేయాలని కోరుతున్నాను. ఈ forest వెట్టిచాకిరీ చేసేటప్పుడు వీళ్ళకు సరైనకూలికూడ యివ్వడములేదు. ఇంకొక విషయము Timber bamboo coupes లో Contracts యివ్వడమువల్ల ప్రజలకు చాలా అన్యాయము జరుగుచున్నది. Coupes లో పనులు అయిన తర్వాత లెక్కలు చూచినందుకు కొంత మామూళ్లుక్రింద మినహాయించుకొని మిగతాది వీళ్లకుయిస్తూఉంటారు. ఈ లోపల Contractors దివాళాఅయిన కూలీలకు అసలు జీతమురాదు. ఈ రకముగా Contractors యివ్వకుండా ఉన్నడబ్బు కొన్నివేల రూపాయలు ఉన్నది. అందువల్ల Timber coupes పని ప్రభుత్వము స్వయముగా చేయించడానికి నిశ్చయించుకొన్నట్లు తెలుస్తున్నది. అయితే అట్లు పనిచేయించుకొనుటలో వారలకు కొంతడబ్బు Advance గా యిచ్చి వారిచేత చేయించుకొనుట బాగుంటుందని నా ఉద్దేశ్యము. తరువాత ఈ timber coupes లో రైతాంగాన్ని తీసుకొనిపోయి పని ముగించుటకుగాను కొంతమంది గుమాస్తాలు వస్తారు. ఈ గుమాస్తాలు ఈ రైతాంగాన్ని తీసుకుపోయి వీరిచేత వెదురు నరికించి నరికినదానిలో సన్నవెదురు తీసివేయుదురు.

ఈ వెదురు లెక్క పెట్టి ఇచ్చేప్పుడు సన్నవెదురుపోగా మంచివెదురులో 100 కి 10 చొప్పున తరుగు ఇవ్వవలసి ఉంటుంది. ఈవిధముగానే వెదురుతోటే బుంగ్ల వాళ్ళకుకూడా అన్యాయము జరుగుచున్నది.

ఇక అడవి ఫలసాయములు, చింతపండు, ఇప్పపప్పు, తేనె వగైరాలును కోయిలు వారలకు అవుసరమైనప్పుడు సంతకు తీసుకువెళ్ళి అమ్ముకుంటూ వుంటారు. వాళ్లు సంతకు ఇప్పపప్పు తీసుకొవెళ్ళినప్పుడు షావుకార్లు చాలా అన్యాయంచేస్తున్నారు. పెద్ద శేరులతో కొలుస్తూ ఉండడము జరుగుతోంది. గవర్నమెంటువారు marketing societies పెట్టినప్పటికి కొంచెము నష్టమురానున్నది.

MR. SPEAKER :— అడవులనుగురించి, అడవులను ఎట్లు పెంచడం, జంతువులను ఎట్లా పెంచడంగురించి మాట్లాడండి.

SRI S. SEETHARAMAYYA:— అయితే public depots ద్వారా ఖరీదుచేసినట్లయిన వీరికి లాభముకలుగును. ఇకపోతే తూనికాకుల విక్రయం కొన్నివేల మందికి ఉపయోగపడుతున్నది. ఈతూనికాకులను 100కి 0-0-3 చొప్పున contractors కొనుచున్నారు. దీనిని చాలా ఆందోళనచేయగా కట్ట 1 కి 0-0-6 చొప్పున గవర్నమెంటువారు రేటునిర్ణయించారు. అయితే ఇప్పుడు కట్టకు 200 ఆకులు ఉండాలని చెప్పారు. అందువల్ల రేటుపెంచినను ఏమీ లాభము కనబడుటలేదు. కనుక ఇప్పుడు 100 ఆకులకు 0-0-6 కొనాలని ఆర్డరు pass చేయవలసినది కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI RAJA V. V. KRISHNAM RAJU BAHADUR :—అధ్యక్షా, ప్రస్తుతం అటవీశాఖవిషయమై అనేకమంది మిత్రులు మాట్లాడారు. ఈరోజున Forest Department గురించి నేను ముఖ్యంగా గత 2, 3 విషయాలు చెబుతాను. వారిని అభినందిస్తున్నాను. కాంగ్రెసు ప్రభుత్వంవారు వచ్చిన తరువాత, భారతదేశంలో రాజులను, మహారాజులను వెళ్లగొట్టినతరువాత, జమీందారులతో బాటే అడవులలోవుండే మృగాలనుకూడా నాశనం చేయడానికి పూనుకుంటున్నారు. ఇది చాలా అన్యాయం. మన భారతదేశంలో అనాది సిద్ధంగా కొన్ని ఆచారాలున్నాయి. ఇంద్రునికి వెల్ల ఏనుగవుండేది. ఈనాడు జంతువులను నాశనం చేస్తుంటే ఇది అన్యాయం, స్వభావానికి విరుద్ధం అనే ఉద్దేశంతో Government of India

[SRI Raja V.V. Krishnam Raja Bahadur] [26th July 1955

వారు wild life day అని పెట్టారు. మన సమక్షంలో wild life day చేసినందుకు మన Chief Minister గారిని అభినందిస్తున్నాను. ఇదివరకు రాజులు వేటకు వెళ్లేవారంటే పరాక్రమానికి వెళ్ళేవారు. జంతువులు సస్యాలను నాశనం చేస్తుంటే పంటలను సంరక్షించడం రాజధర్మంగా వుండేది. గుర్రాలమీద వెళ్లి జంతువులను వేటాడేవారు. ఈరోజున అడవులలో రోడ్లుపడడంచేత battery lights తీసుకుని వెళ్ళుతున్నారు.

Srimathi C. AMMANNA RAJA :— అధ్యక్షా, అడవులను గురించి నాకు కొంచెం తెలుసు. తెలుసుకోవాలని చాలాకాలంగా కుతూహలంగా వున్నది. చూడాలనికూడా వున్నది. చాలాకాలం ప్రయత్నించానుకాని ఒకమారుమాత్రం మైసూరులో అడవిని చూడగలిగాను. వేసవికాలం అయినందువల్ల మృగాలను చూడలేకపోయాను. అటవీశాఖడిమాండుమీద 30 లక్షలు ఖర్చుపెడుతున్నాము దీని నుంచి 40 లక్షలు రాబడివున్నట్లు కనిపిస్తోంది. డిమాండు ప్రవేశపెట్టేముందు సమగ్రంగాచెప్పేవారు మంత్రులు, ఈసారి అట్లా చేయలేదు. అందువల్ల నేను మాట్లాడవలసి వచ్చింది. మంత్రిగారికి reply time లో ఒక్కొక్క ప్రశ్నవేసి, interruption అనిపించుకునేబదులు సందేహాలు ఇప్పుడే అడిగితే దానికి జవాబులు వస్తాయి అనే ఉద్దేశంతో మాట్లాడుతున్నాను. రాబడి వేటిమీదవస్తుందో నాకు తెలియదు. Timber వున్నది. ఎటువంటి timber వున్నది? మలబారులో rose wood అని, Nagpur లో teak wood అని, బొంబాయిలలో ఇంకొకరకం ఉన్నదని తెలుసు. కాని మనకు ఏమి వున్నదీ నాకు తెలియదు. కొద్దిగా teak వున్నదని నాకు తెలుసును. వివరంగా మనకు ఉత్పత్తి అయే వృక్షాలు ఏమిటో కొద్దిగా తెలుసుకోవాలనే ఉద్దేశంతో మాట్లాడుతున్నాను. అంతేకాకుండా upkeep of elephantsకు అని అన్నారు. మనకు eleplants ఎక్కడవున్నాయో నాకు తెలియదు. ఏమాత్రంవున్నాయో నాకు తెలియదు. Wild life day సందర్భంలో చెప్పడంలో మనకు elephauts లేనట్లు అర్థమైనది. బహుశా రంపచోడవరంలో వుండవచ్చును. ఆ ప్రాంతంలో దంతపు పరిశ్రమను చూచాను కాబట్టి అనుకుంటున్నాను. Governor గారి addresss లో games sanctuary ఏర్పాటు చేస్తాము అని చెప్పినట్లు జ్ఞాపకం. ఈ బడ్జెటులో ఎక్కడా ఆ విషయం కనిపించలేదు. ఇది చాలా అవసరం. Wild life day సందర్భంలో వన్యమృగాలు నశించిపోతున్నాయని, వాటిని రక్షింపవలసిన అవసరము ప్రభుత్వముమీద వున్నదని అన్నారు. మనకువున్న మృగాలు చాలా తక్కువ రకాలు. క్రొత్తమృగాలు పెంచుకోడానికి ఏమైనా మార్గాలున్నాయా ? మనకువున్న మృగాలే— సింహాలు,

చిఱుతపులులు—తగ్గిపోతున్నట్లు వింటున్నాను. ప్రక్క అడవులనుంచి రప్పించుకొనే మార్గంవున్నదా ? ఎటువంటి attraction కల్పించగలమో నాకు తెలియదు. ఈ forest department ఏ విధంగా పనిచేస్తున్నదోకూడా నాకు తెలియదు.

MR. SPEAKER :—మీకు తెలిసినవిషయం చెప్పండి. తెలియనివిషయా లెందుకు ?

Srimathi C. AMMANA RAJA :—తెలియని విషయాలనుకూడా తెలుసుకోవాలని అడుగుతున్నాను. అన్నివిషయాలు తెలుసుననే అనుకోవడం పొరపాటు. తెలియనివి తెలుసుకోవాలనుకుంటున్నాను కాని ఇతరులకు చెప్పే స్థితిలో లేను. మనకు వున్న అడవులు, రంపచోడవరం అడవులు, నల్లమలై అడవులు. వాటిలో ఇతరప్రాంతాలలోని అడవులనుంచి వచ్చేవాటిని పెంచి వాటిని సంరక్షించే మార్గం మనం ఆలోచించవలసియున్నది. అరకులోయ మిగిలిన వాటికంటె కొంచెం చల్లని ప్రదేశంకాబట్టి అక్కడ యూకలిప్టస్ చెట్లుపెంచే అవకాశం ఆలోచించవలెను. ఈ విషయంలో ప్రభుత్వం తగిన శ్రద్ధవహిస్తే మామూలుగా దొరికే వస్తువులే కాక మిగిలిన వస్తువులుకూడా సృష్టించడానికి వీలువుంటుందని, ఆ మార్గాలు ఆలోచించాలి అని మనవిచేస్తున్నాను. Zoo అనేది మనకు education demandలో వస్తుందేమో నాకు తెలియదు. మ్యూజియం అనేది లేదు మనకు. మద్రాసు రాష్ట్రానికి వెళ్లిపోయింది. దీనిని సృష్టించుకోడానికి ప్రయత్నాలు జరపాలి. Zoo కూడా చాలా అవసరమైన institution. చాలా రకాలైనజంతువులను అడవులలో చూడకపోయినా zoo లోనైనా, చూడగలుగుతాము. మనకు లేనిజంతువులనుకూడా, పైరాష్ట్రాలకు, దేశాలకువ్రాసి తెప్పించుకుంటే, అడవులలో లేకపోయినా మన దేశంలో మనం చూడగలుగుతాము. ఈ విధమైన శ్రద్ధకూడా తీసుకోవాలని కోరుతున్నాను.

5-30 P.M.

అడవుల సేవి చాల ఆకర్షణీయమైన పని ఇదివరకే చెప్పివున్నారు కొందరు. అటువంటపుడు యీ అడవులను మనము ఎక్కువగా వెళ్ళిచూడడములో కూడ అనేక విషయాలు నేర్చుకోవచ్చును. మృగాలనుండి మనము నేర్చుకోవచ్చును. వృక్షములనుండికూడా మనము నేర్చుకోవచ్చును. మృగాలు ఎవరినో చంపివేస్తున్నాయని చెప్పతున్నారు. పూర్వము ఋషులందరుకూడ తపస్సుచేసినప్పటికి వాండ్ల జోలికిపోకుండ ఉండెడివి మృగాలు. మనలో తప్పవుంటే తప్ప మనజోలికి రావుఅనే విషయముకూడ మృగాలనుంచి మనము నేర్చుకోవచ్చును. నేను కొంచెము

Srimathi C. Ammanna Raja] [26th July 1955

తిమ్మారెడ్డిగారి ధోరణిలోనికి పోతున్నాను. ఆదేవిధముగా వృక్షములనుంచికూడ మనము నేర్చుకోవలసిన విషయాలు అనేకము వున్నాయి.

Mr. SPEAKER :—శ్రీ ప. తిమ్మారెడ్డిగారా !

Srimathi C. AMMANNA RAJA :—వారు కాదండి. వారు మాట్లాడనేలేదు. సంస్కృతములో ఒకశ్లోకమువుంది, వృక్షము అనేది సూర్యునియొక్క ఎండను అంతా ఆకర్షించి తమను ఆశ్రయించినవారికి చల్లదనము యిస్తుందన్నట్లుగా. ఆవిధమైన విషయాలుకూడ మనము వృక్షములనుండి నేర్చుకోడానికి వీలుంది. అంతేకాకుండా యిచ్చింది పుచ్చుకుంటుంది, మనకు కావలసినది యిస్తుంది అని వారేచెప్పారు. అంతేకాకుండ అంతకంటే ఎక్కువ నే యిచ్చినవిషయాలుకూడా వున్నాయి. ఒకరాతిని విసరితే రెండుపండ్లు మనకు యిస్తుంది. మళ్లీ మనమీద రాళ్లు విసరదో. అటువంటి మంచివిషయాలున్నాయి. అట వీశాఖ మంత్రిగారు ప్రధానమంత్రి కాబట్టి ఒకమారు మమ్ములను అందరిని batches గా మనకు దగ్గరగావున్న అడవులలోనికి తీసుకవెళ్లి అడవులను చూపించాలని కోరుతూ యింతటితో నా ఉపన్యాసము ముగిస్తున్నాను.

* SRI S. RANGANATHA MUDALIAR: MR. Speaker, Sir, my object in speaking on this Demand is to request the Hon. Chief Minister to focus his attention on the kind of administration that obtains in my district with respect to the Forest Department. I have said in my cut motion, or rather I have characterised it as mal administration.

MR. SPEAKER : That motion is not before the House.

SRI S. RANGANATHA MUDALIAR : But I would just dwell on that point.

MR. SPEAKER : Yes, you may do that.

SRI S. RANGANATHA MUDALIAR : Chittoor district is one of the backward districts in this State, and the only natural wealth of the district is forest. It being also the

driest district in the State the importance of rainfall and the importance of forests in relation to rainfall is indisputable. In these circumstances the conservancy on which so much money is expended by this Government is most uneconomical, if not, waste, so far as forests in Chittoor district or at any rate the western taluks of Chittoor district is concerned. When I say Chittoor district I do not mean either Mamandur forest or the other ranges in Chandragiri taluk, of which I know nothing. There is a huge establishment in our district. The department is manned by two District Forest Officers; one of whom is a superannuated officer, re-employed, and the other gentleman is too young to be a district officer ; I am not saying too young to realise the responsibility of his office.

THE HON. Sri KALA VENKATA RAO : One makes the deficiency of the other.

SRI S. RANGANATHA MUDALIAR : I think, one cancels the other, with the result that there is absolutely no administration. Under them work one or two extra conservators, and there is a battalion of forest rangers and foresters and an army of subordinate forest menials. In spite of this huge establishment, what we see is a sad picture of progressive deterioration of administration as evidenced by indiscriminate and illicit felling of forest trees, which is increasing on a wider scale day by day with impunity. If conservancy includes regeneration and replacement of exploited areas and the maintenance of forest in a state of efficiency, such conservancy is absolutely wanting in my district.

Chittoor reserves have been famous for its red saunders. Formerly these red saunders were carefully conserved and quickly replaced, when mature trees were extracted. Such trees are now allowed to be lopped and cut down and sawed and transported in broad daylight without any notice and with impunity. Regions which are affected by this sort of depredation are areas within five miles from any town

SRI S. Ranganatha Mudaliar] [26th July 1955

limit. The offenders are not limited to the poorest classes who live by selling of firewood only. The offenders belong to the various labour classes in the town. They have found poaching a very fruitful source of income ; and the worst offenders in this respect are the policemen and the fire service men. The Policemen particularly belong to the armed reserve, and they along with the fire service men have been responsible for reckless denudation of the reserves close to Chittoor town. There are cases where policemen either on off-duty or in duty have committed this offence and they have been reported. But no notice was taken by the District Superintendent of Police. They want us to catch the offenders and take them red-handed—which is an impossibility. They resent when anything is said against their department subordinates. But the fact is, police officers, I mean, police constables and head constables, go as far as Palmaner, and by mere zulum get illicit green wood cut and get it transported on bus tops. This is almost a daily occurrence. These depredations have been noticed by no less a person than the Collector of the district himself. Mr. Yaganti had seen these things personally, and in spite of the trouble taken by him to rouse the district officers to a sense of duty, his efforts have proved a failure, and he confessed that it was a hopeless task to mend them.

Sir, I and my advocate friends are in the habit of going on evening rambles, and we have been helpless spectators of these ravages ; helpless, because we were often times defied by these offenders when we questioned them. The most wonderful thing is during all our rambles during all these years and months we have yet to come across a forest subordinate or a forest officer of any rank to come into this area, at least for pleasure of walking. The forest officers bungalow is within a shouting distance from the reserves. More often he is found in the Recreation Club in the evenings. If he is in the headquarters, he is in the Officers' Club in the evenings. If he is not in the Officers' Club, we must take it

26th July 1955] [SRI S. Ranganatha Mudaliar

he is somewhere touring; he is not doing his duty in Chittoor; he is somewhere else. That is what I want to submit.

Chittoor is noted for its round roads and the Chittoor reserve forests have been beauty spots for a long time, and the round roads are beautiful amenities; and it is one of the items marked out with pride by Chittoor people for visits and for being shown round to provincial Governors. My complaint is neither during the time of the composite State nor afterwards — neither Sri Sri Prakasa nor Mr. Trivedi — was taken round these 'round roads'. If only the Governors had been taken there, care would have been taken to repair those roads, and the Governor himself would have had an opportunity of seeing the depredation going on with such reckless impunity. These roads were laid by a benevolent Collector Mr. Whitehead as early as the sixties of the last century. Now they are in utter desolation; they are in absolutely utter ruin. Those roads have been maintained hitherto partly by the Government and partly from contribution from the district board and the municipality. Now nobody takes any pains to keep those roads in good condition. Not that the district board and the municipality are not willing to give their contribution, but the officers do not care for these roads; there is nobody to ask these local bodies for their contributions, with the result that the round roads have gone to ruin irremediably.

Another curse of Chittoor district is charcoal burning. It has been responsible for licence ravage. It is high time for the Government to put a ban, a severe ban, upon the export of charcoal from Chittoor and the burning of charcoal in any part of the Government forest or in land or forest privately owned. We don't care if Madras or any other State does not get fuel supply. The other States will take care of themselves, and it is for us to see that the forests are conserved, and the welfare of this State is the prime consideration and first consideration.

SRI S. Ranganatha Mudaliar] [26th July 1955

Then, lastly, I come to the state of affairs in the zamindari forests, which have been recently taken over by Government. These zamindari ryots were enjoying certain timehonoured rights of green manure and firewood and wood for agricultural implements under a free permit system. They had also a 'Mafi' system, that is to say, they were grazing cattle under Mafi permits, or permits given at favourable rents. These ryots now find themselves suddenly deprived of these rights and they are not able to take even firewood for their own domestic purposes; and so far as the administration of forests is concerned, it is a series of prosecutions of poor ryots, which is nothing but unrelieved persecution. This is a matter in which the Government should take immediate steps to redress the grievances of the ryots, if the object of the Government is to ensure happiness and contentment of the people of the State.

As regards denudation going on, we see side by side with this denudation, Vanamahotsavam being performed with much enthusiasm. It is a mockery; it is nothing but mockery Therefore, let us for some time stop this Vanamahotsavam business and devote our attention to planting of trees wherever old trees, primaeval trees and gigantic trees have been removed and destroyed by the vandalism of offenders, who have been doing such things with impunity.

Chittoor reserves are very favourable for (and it has a good soil for) the cultivation of bamboos. There was a time when the Chittoor reserves were famous for bamboos. Bamboo can be replanted and Government may also consider why casuarina cannot be planted in the place in forest area where old trees were felled and removed. Government must also take possession of river side porambokes and other lowlying land, shrubby lands lying on the outskirts of the reserve forest for casuarina plantation. That would in a way solve the firewood problem. With these words I close my observations.

26th July 1955]

THE HON. SRI B. GOPALA REDDI :—అధ్యక్షా, Agriculture Demand వలెనే ఇదికూడా అంతసులభంగా పోలేదు. Agriculture Demand మీద ఎంతోమంది అభినందనలు చెబుతూవచ్చారు. ఇంకా అనేక పనులు చేయ మనేటటువంటి విషయంకూడా చెప్పారు. అడవులనేటప్పటికి ప్రతివారూకూడా అక్కడేదో పెద్ద పెనుభూతాలున్నాయి, అక్కడ గార్డులనేవాళ్ళు, forester లు అనేవాళ్ళు, పెద్దరాక్షసులుగా ఉన్నారు, ఇవంతా మహామత్తుచేస్తేగాని ఇబ్బందులు తొలగవు అనేటటువంటి భయాన్ని సూచిస్తున్నారు. ఇది కొంతవరకూ వాస్తవం కావచ్చును ఎక్కడనో, ఏమారుమూలప్రదేశంలోనో, రోడ్లులేని ప్రదేశంలో అక్కడున్నటువంటి కోయవాళ్ళ మధ్యలో ఈ చిన్నచిన్న ఆఫీసర్లంతా ఉండడం వల్ల, వాళ్ళుకొంత నిరంకుశంగా ఉంటేఉండవచ్చును. కాని అది ఎట్లా మార్చాలి అనేటటువంటి విషయం అంత సులభమైనదికాదు. కేవలం వారినిచూచి భయపడితే లాభంలేదు. లేక వారుచేసిందంతాకూడా విమర్శిస్తేకూడా ప్రయోజనంలేదు. ఏ రకంగా వారిని అదుపులోపెట్టి పనిచేయించుకోవాలనే విషయం, మనమందరం ఆలోచించుకోవలసి యుంటుంది. ఈ నాడు ఈ Demand మీద 16 మంది మాట్లాడారు. చాలా సంతోషం. జిల్లాలలో వాళ్ళవాళ్ళకు న్నటువంటి స్థానిక ఇబ్బందులన్నీ చెప్పారు. నేను వారికి ఒకవిషయంమాత్రం చెబుతున్నాను. ఐతేవారు చెప్పినవిషయాలకు అన్నింటికీ తోడనే సమాధానం చెప్పలేకపోయినప్పటికీకూడా స్థానికమైనటువంటి విషయాలు అనేకం ఉంటాయి. నేను త్వరలోనే ఈ 16 మందిని ఒక conference కు పిలుస్తాను. Chief Conservator of Forests, మొదలైనవారి నందరినికూడా సమావేశపరచ దలచాను. అడవుల విషయంలో కొంత, శ్రద్ధవహించినవారిని, ఇంకా ఈ విషయంలో శ్రద్ధవహించి ఉన్నటువంటి M. L. A. లను, అందరినీకూడా ఇప్పుడు కాకపోతే September లో నైనా పిలచి, ఉన్నటువంటి విషయాలు అన్నీకూడా చర్చించుటకు వారితో ఒక దినమో, రెండుదినములో కూర్చుని ఒక conference మాదిరిగా పెట్టుకుంటే మంచిదని నే ననుకుంటున్నాను. ఎలమంచారెడ్డిగారి తాలూకాలో ఉన్న ఇబ్బందులూ నాకు తెలుసును. అక్కడకు నేను పోయినప్పుడుకూడా వారు చెబుతూ వచ్చారు. నేనుకూడా ఆ ప్రజలకు ప్రాథమిక బాధకాలు చెప్పాను. శాంతప్పగారు చెప్పినట్లుగా ఏదో మీరుమాకు వోటివ్వండి, తరువాత మేము మంత్రులకు చెబుతామన్న మాదిరిగా నేనుకూడాచెప్పినాను. Chief Conservator of Forests గారినికూడా మనం పిలిపించుకొని ఒక conference పెట్టుకోవాలి. ఈ అడవులలోని ఇబ్బందులు తొలగించుకోవడానికి కొంత ప్రచారం జరగాలి. మనకు

కూడా Forest Department వారు ఏమిచెబుతున్నారో తెలియకుండా పోతోంది. అందువల్ల Chief Conservator of Forests ఏమిచెబుతారో, Conservators of Forests ఏమిచెబుతారో, అక్కడ ఎందుకోసంగా ఈ ఇబ్బందులు ఉంటూ ఉన్నాయో—అనే విషయం తెలుసుకోవడం, వారికిఉండే ఇబ్బందులు మనకు చెప్పడం, మనకుఉండే ఇబ్బందులు వారికి చెప్పడం, ఈ మాదిరిగా Department కూ మనకూ కొంతసంబంధం ఏర్పాటుచేసుకుంటే మంచిదనే ఉద్దేశ్యంతోనే ఈ 16 మందినీ, ఇంకా ఈ అడవులవిషయంలో శ్రద్ధవహించే వారిని అందరినీ త్వరలోనే ఒక conference కు పిలుస్తాను. అప్పుడు ఎలమందారెడ్డిగారు, లేకపోతే మన మాలా సాహేబుగారు, లేకపోతే మన రంగనాథ మొదలియారుగారు అందరూ కూడా వారి స్థానిక ఇబ్బందుల గురించి చెప్పడానికి వీలుకల్గుతుంది. ఆ tribal areas లో ఉన్నటువంటి వారంతా కూడా వారి సమస్యలు చెప్పడానికి సమావేశం ఏర్పాటు చేసుకుందాం. చెప్పిన విషయాలన్నీ చూస్తే ఇబ్బందులున్నాయి అని బోధపడుతోంది. Prosecutions ఉన్నాయి. ఎవరి ఇష్టం వచ్చినట్లు వారుకట్టెలు కొట్టుకోడానికి వీలులేదు. ఇష్టంవచ్చినట్లుగా ఆకులు తెచ్చుకోడానికి వీలులేదు. అదేమంటే, ఆ guard లంతా prosecute చేస్తున్నారనేటటువంటి మాట చెబుతున్నారు. "జమీందారీ forest లలో ఇంతకుముందు కొన్ని కొన్ని సౌకర్యాలు మేం మనుభవిస్తూయున్నాం, ఆ సౌకర్యాలన్నీ ఇప్పుడు తీసివేసినారు" అనేటటువంటి మాటగా చెబుతున్నారు. జమీందారులు ఉండగా లాచా సౌకర్యాలు వారికి ఉండినాయన్న మాట. అప్పుడూ ఇబ్బందులు ఉండినవా ?

SRI RAJA SAGI SURYANARAYANA RAJU:—అప్పుడు ఇబ్బందులు లేవండి. ప్రతిగ్రామస్థుడికీ ప్రక్కనవున్న అరణ్యంలో ఇష్టానుసారంగా స్వంత ఖర్చులకీ, స్వంతఉపయోగానికీ కట్టె, కలప తీసుకోవడానికి అవకాశాలు పూర్వం ఉండేవి. ఇప్పుడు లేకుండా ఉన్నాయి.

THE HON. SRI K. VENKATA RAO :—ఆ అడవులూ చూచాను. ఆ అడవులు ఎంతఅందంగా ఉన్నాయో చూస్తే తెలుస్తుంది.

THE HON. SRI B. GOPALA REDDI :— అది సూర్యనారాయణ రాజుగారికి తెలిసినవిషయం. ఎలమందారెడ్డిగారి అనుభవాలు, మరికొన్ని ప్రాంతాలలో ఇతరుల అనుభవాలు ఇంకోరకంగా ఉండవచ్చు.

SRI P. KODANDARAMAYYA :—డబ్బు పుచ్చుకోడానికి నాకు అభ్యంతరం లేదు. రుసుము పుచ్చుకొని, జమీందార్లు వదలిపెట్టేమాదిరిగా కొట్టుకపోయినా

26th July 1955] [Sri P. Kodandaramayya]

Forest శాఖవారు ఏర్పాటుచేసిన రుసుం పుచ్చుకుని వెదురు, కంపవ్యవసాయదార్లకూ, చిన్న చిన్న ఇళ్లుకట్టుకునేవాళ్ళకూ ఇప్పించే ఏర్పాట్లు జరగడంలేదని నేను మనవిచేస్తున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :— ఆ విషయం చాలా పెద్ద విషయం. దానిలోఉన్న సాధక బాధకాలు విచారించవలసియుంది. మన కోదండరామయ్యగారు చెప్పినంత సులభంగా డబ్బు పుచ్చుకుని వాళ్ళకు కావలసినకట్టే, కంపఅంతా ఇవ్వడానికి ఎటువంటి ప్రదేశంలో అవకాశాలు ఉన్నాయో, దానికి ఇబ్బందులు ఏమి ఉన్నాయో తీవ్రంగా దర్యాప్తు చేయవలసిన విషయం

అడవులలో ఉపయోగపడేటటువంటి చెట్లువేయడంలేదని గోపాలురెడ్డిగారు చెప్పతున్నారు. పోడు cultivation చేసేటటువంటి భూములను మార్కెట్టు ధరకు ఇవ్వవలసిందని మన మత్స్యరాజుగారు చెబుతున్నారు. తరువాత, ఈబంజర్లు అన్నీ forest area లో కలుపుతూ ఇదంతా ఏదో mania గా పెట్టుకొని చేస్తున్నారని యెల్లమందా రెడ్డిగారు చెప్పారు. ఉన్న forest లోనే చెట్లువేయవలెననే ఉద్దేశ్యంతోనె చెప్పతున్నానుగాని కొత్తగా ఊర్లలో వేయమనికాదు. Taken over forests విషయంలో ఈ సంవత్సరం జనవరినెలలో, గవర్నరుగారి పరిపాలన ఉన్నప్పుడు,—"to examine the question of re-alignment of boundaries of reserve forests and panchayat forests and where these are too close to the village limits, so as to afford sufficient area for grazing and communal purposes" అని 17-వ జనవరి 92 నంబరు గల G. O. లో ప్రభుత్వంవారు ఉత్తరువు చేశారు. అది ఈనాడు అమలులో ఉన్నది. దానిప్రకారంగా కొంతవరకు ఈ boundariesఅన్నీ కూడ మార్పుచేయవలసిందిగా నేనుగూడ Chief Conservator తో చెప్పాను. ఆ విషయంలో వారేదో కొంత staff అడిగారు. మూడవ conservator కావాలని చెప్పారు. అది ఇంకా sanction చేయలేదు. బహుశా దానివల్ల ఇది కొంత ఆలస్యమవుతున్నదేమో నాకు తెలియదు. దర్శి, పొదిలి తాలూకాలు, లేకపోతే వెంకటగిరి, సూలూరుపేట అనేటువంటి అనేక తాలూకాలు ఉన్నాయి. ఈ తాలూకాలలో ప్రతిగ్రామానికిపోయి, reserve forest area ఎక్కడ వరకు mark చేస్తే బాగుంటుందనే విషయము Forest Officers పరిశీలించి చేయవలసియున్నదని ఈ నాడు నేను పదేపదే D.F.O.లకు చెప్పతున్నాను.

SRI B. GopalaReddi] [26th July 1955

ఈనాడు ఈ ఇబ్బందులు, ఈ కష్టాలు ఉన్నాయని మా M. L. As చెప్పుతూ ఉన్నారు, కనుక మీరేదో ఒకరకంగా వీటిని సరిచేయవలసిందనే మాటకూడ వారికి చెప్పుతున్నాను. ఇది కొన్ని చదరపుమైళ్లకు సంబంధించినటువంటి విషయము. survey settlement విషయంలో ప్రతి గ్రామానికిపోయి, demarcate చేయడం కూడ అంత సులభముకాదు. అందులో వారు అడిగిన staff కూడ మేము ఇవ్వ లేము అనేటటువంటి కారణముకూడ ఉన్నది. కొబట్టి కావాలంటే మీరు Forest Officers తో ఈవిధంగా మీకు జనవరినెలలో ఒక G. O. వచ్చియున్న దని చెప్పవచ్చును. grazing విషయంలోకూడ ఈ జమీందారీగ్రామాలు గురించి ఇంతకుముందు నేను చెప్పినటువంటిమాట ఏదో భలో క్తిగా చెప్పానని యల్లమందా రెడ్డిగారు చెప్పారు. కాని ఇదివరకు వాళ్లు ఎటువంటి హక్కులను అనుభవించారో అటువంటి హక్కులను అనుభవించవలసిందే నని మేము చెప్పుతున్నాము. ఒక్క మేకల విషయంలో తప్ప, అంతకుముందు జమీందారీ గ్రామాలలో ఎలాంటి హక్కులను ఆరైతులందరు అనుభవిస్తూవచ్చారో, వాటిని అదేవిధంగాఉంచండి అని చెప్పుతూవచ్చాము. ఈ మేకలవిషయంలో మాత్రము కొంచెము ఇబ్బంది ఉన్నది. మేకలు, reserve forests, ఈ రెండూ ఉండడానికి (co-excistense కు) వీలు లేదు. అడవులకు ప్రథమ శత్రువులు ఈ మేకలన్నమాట. ఈ మేకలు reserve forests లో, చిన్న చిన్న లేతచిగుళ్లులన్నికూడ మేయడంవల్ల, ఆ చెట్లను పెంచ డానికి వీలుండదను అనే ఉద్దేశ్యంతోనే ఆవి మినహాయింపబడినది.

ఇక, forest produce విషయంలోను, tribal areas విషయం లోను కొంత ఇబ్బందిగా ఉంటున్నదని ఒకరిద్దరు చెప్పారు. దీనికోసం రెండులక్షలరూపాయలతో ఒక financing corporation పెడుతున్నాము. అనేకమంది, అనేక సంవత్సరములనుంచి ఇబ్బందులుపడుతూ వస్తున్నారు. రాజమం డ్రిలో వర్తకులకు బాకీలుపడి, వాళ్లు పండించిందంతాకూడ వర్తకులకే తక్కువ ధరకు ఇవ్వవలసి వస్తున్నది. అటువంటివారి ఇబ్బందులను తగ్గించడానికి ఇక్కడ ప్రథమంగా రెండులక్షలరూపాయలతో ఒక financing corporation పెట్టుటకు, ప్రయత్నంచేస్తాము. దానివల్ల ఎంతవరకు వారికి సౌకర్యము కలుగుతుందో కూడ విచారింపవలసియున్నది. ఆ విషయం Tribal Welfare Demand వచ్చినప్పుడు లచ్చన్నగారుకూడ చెప్పగలరు.

తరువాత village forests కూడ చాలాకాలంగా గ్రామ పంచాయతీల క్రిందనే ఉంటున్నాయి. దానివల్ల అడవులన్నీ దినదినానికి క్షీణించిపోయి

నాయి గాని అభివృద్ధికాలేదు. అందువల్ల forests అన్నీ పంచాయతీలనుంచి తీసివేసి Forest Department కు ఇచ్చివేయవలెననే ఉద్దేశ్యంతోనే 4, 5 సంవత్సరములక్రిందట reserve forests ఏర్పాటు చేయడం జరిగింది. ఇప్పుడిప్పుడే ఆ department వారుకూడ చెట్లుపెంచాలని ప్రయత్నం చేస్తున్నారు. అటువంటప్పుడు "చెట్లు అక్కరలేదు, వ్యవసాయంకావాలి, మనుష్యులు మొదట బ్రతకాలి, తరువాత మీ అడవులు ఏమైనాగాని, అనేవిధంగాచెప్పితే ప్రయోజనం లేదు. అడవులుకూడ జాతికి అవసరమనే విషయం మనమందరం గుర్తించవలసియున్నది. ఇంతలోనే ఈ departmental officers తో conference ఒకటి ఏర్పాటుచేస్తున్నాను. ఆ conference కు మిమ్ములనుకూడా ఆహ్వానిస్తున్నాము. అక్కడ వాళ్లు ఏమిచెప్పుతారో చూచి, వాళ్లదృక్పధాన్నికూడ అర్థంచేసుకొని సమగ్రంగా ఈవిషయాన్ని పరిశీలన చేసుకొందాము

తరువాత మృగముల విషయంగురించి క్రిష్ణమరాజాబహుదూర్ చెప్పినందుకు గాలా సంతోషము. ఈ wild life preservationకుగాను India Government వారు ఒక Board కూడవేసి ప్రయత్నంచేస్తున్నారు. మనముచేయవలసిందికూడ మనము చేసుకొందాము. Torch light వేసి జీప్పువేసుకొనిపోయి ఆ జంతువుల కళ్ళలో కొట్టడము ఇటువంటివేమి చేయకుండా నిబంధనలు చేసుకోవాలి. వాటిని preserve చేసుకోవాలి. ఆ విషయంలో మనమందరం శ్రద్ధవహించాలి. మన దేశములో ఈనాడు కొన్ని కొన్ని మృగములు కనపడకుండా పోతున్నాయి. మృగ్యమైపోతున్నాయి. ఇంకా 4, 5 వందల సంవత్సరాలకు పెమళ్లు, దుప్పులు, ఇటువంటివి లేకుండాపోతా యేమోననిపిస్తున్నది. ఆంధ్రదేశంలో ఇప్పుడు ఏనుగులు ఎక్కడాలేవు. అమ్మన్నరాజా గారు ఏనుగులు ఎక్కడో చూచినారని అన్నారు. అది మన ఆంధ్రదేశములో అయిఉండదనుకొంటాను. బహుశ మద్రాసు Administraition report లో చదివినారు కాబోలు, మన ఆంధ్రరాష్ట్రములో ఈనాడు ఏనుగులు లేవనేచెప్పాలి. Department కు లేవు. అడవులలోకూడలేవు. మద్రాసు రాష్ట్రములోను ఇతర రాష్ట్రాలలోనుఉంటే ఉండవచ్చు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—"Up keep of elephants and draught cattle" అని 55 వ page లోఉన్నది.

THE HON. SRI B. GOPALA REDDI :—మద్రాసు గవర్నమెంటుకు ఉన్నాయి. Annamalais లో దాదాపు 50, 60 ఏనుగులు ఉన్నాయి. మనకు లేవు.

[Sri B. Gopala Reddi] [26th July 1955

తరువాత games sanctuary ఒకటి ఈ second five year plan లో ఏర్పాటు చేయవలెనని అనుకొంటున్నారు. చిత్తూరు, కడపజిల్లాలలోని మామండూరు forests లో ఒక games sanctuary పెట్టవలెనని Forest Department వారు ప్రయత్నంచేస్తున్నారు. మనకు Zoology ఉన్నదిగాని zoo మాత్రములేదు. మనకు zoo కూడ ఒకటి ఎక్కడైన పెట్టవలసిందని ఒక suggestion కూడ వచ్చింది. అది, బహుశా, మామండూరు forests లో games sanctuary ఏర్పాటు చేసేటప్పుడు, దానికి దగ్గరగానో లేక ఎక్కడైనా ఒక పెద్దపట్టణములోనో పెట్టేదానికి ఆలోచించుకోవచ్చును. విశాఖపట్నంలో ఒక aquarium పెట్టడానికి ప్రభుత్వము ఆలోచిస్తున్నారు. Zoo విషయము ఇదివరకు ఆలోచన జరగలేదు. Museum గూడ లేనప్పుడు, zoo ఎందుకనే ఉద్దేశ్యంతో ఆ విషయంగురించి ఆలోచించుకోలేదు. ఏమైనప్పటికీ, మామండూరు forest లో, national park, games sanctuary వచ్చినప్పుడు, ఈ zoo విషయంకూడ చూచుకోవచ్చు.

ఇక పోడు cultivation, కుమ్రీసాగు గురించి ఇదివరకే నేనుచెప్పాను. అనేకమంది ఈ భూములలో వ్యవసాయం చేసుకోడం, కుమ్రీ చేయకుండా మెల్లగా భూములంతా స్వాధీనంచేసుకోవాలిఅనే ఉద్దేశంతో ఈ ప్రభుత్వము చేసినటువంటి ఉత్తరువులను ఉల్లంఘిస్తున్నారు. అది న్యాయంకాదు. కుమ్రీచేయడం మంచిది. అక్కడకూడ చెట్లు పెంచుతూఉండడం మంచిది. కాని అదికూడ చేయకుండా పోతున్నారు. అక్కడకూడ కొన్ని ఇబ్బందులు ఉన్నమాట వాస్తవమే. ఆ ఇబ్బందులు తొలగించడానికి ప్రయత్నం చేయవలసియున్నది. కాని అట్లాఅని అడవులను అనవసరంగా కొట్టివేయడంగాని, ధ్వంసంచేయడంగాని న్యాయం కాదు.

తరువాత రంగనాథ మొదలియార్ గారు బొగ్గు మద్రాసుకు పోయేదానివల్ల మా అడవులన్నీ చెడిపోతున్నాయని చెప్పారు. దాన్ని గురించి పరిశీలన చేయవలసియున్నది. బస్సులకు, లారీలకు బొగ్గుపోవడంచేతను మద్రాసుకు బొగ్గుపోవడం చేతను మన అడవులు చాలా ధ్వంసంఅయ్యేమాట నిజమే. కాబట్టి ఆ విషయం కూడ మనం ఆలోచించవలసియున్నది.

కాబట్టి దీంట్లో కొన్ని ఇబ్బందులు ఉన్నాయి. Corruption కూడ కొంత ఉండవచ్చు. కోయవాళ్ల విషయంలో వారు కొంచెము దౌర్జన్యంచేస్తూ ఉండవచ్చును. ఇవన్నీ మనం సరిచేసుకోవలసియున్నది. కాని ఎట్లా చేసుకోవలెను అనే

విషయంలో కొన్ని చిక్కులు వస్తున్నాయి. ప్రభుత్వంవారు కొంతమంది ఉద్యోగస్థులను పట్టుకొని dismiss చేయవలెనని కొంతమంది సూచించారు. కాని అది న్యాయంకాదు, బాగుండదు. ఇవన్నీ మన సమావేశంలో మాట్లాడుకోవచ్చును. ఏమైనప్పటికినీ ఈ ఇబ్బందులు, కష్టాలుగురించి చెప్పినందుకు, చాలా సంతోషము. ఈ ఇబ్బందులు తొలగించడానికి అందరుకూడ ప్రయత్నంచేస్తాము. అంత త్వరగా జరిగేపనికాదది. సమగ్రంగా పరిశీలన చేయవలసియుంటుంది, కనుక ఈ డిమాండుకు ఏలాటికోత లేకుండా అడిగిన మొత్తాన్ని ఇస్తారని ఆశిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— Range Advisory Committees function చేస్తున్నాయా ?

THE HON. SRI B. GOPALA REDDI :— మీ జిల్లాలో పని చేయడంలేదని చెప్పారు. మీరు ప్రశ్నకూడ వేశారే !

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అవి పనిచేయడం లేదండీ.

The Hon Sri B. GOPALA REDDI :—అట్లయితే, ఆ విషయం తప్పకుండా చూస్తాను.

MR. SPEAKER : The question is :

**" To reduce the allotment of Rs. 30,64,900 for Forests by Rs. 100.**

(ఫారెస్టు ఉద్యోగస్థులు ప్రజలకు కలుగచేసే ఇబ్బందులను తొలగించనందున, అడవులకు సమీపములోనున్న గ్రామస్థులకు కొంత మేరకయినా ఉచితంగా పసు గ్రాసము, ఎండుఆకు, వంటచెఱుకు కోసం ఎండుపుల్లలు తెచ్చుకొనే సౌకర్యము కలుగజేయనందున.)"

**The motion was lost.**

**MR. SPEAKER : I shall now put the main Demand to the vote of the House. The question is :**

**That Government be granted a sum not exceeding Rs. 30,64,900 under Demand No. IV—Forests.**

The motion was carried and the grant was made.

MR. SPEAKER : I now adjourn the House till 11 a.m. to-morrow.

The House then adjourned.

# APPENDIX.

REVENUE DEPARTMENT.

## PAPER PLACED ON THE TABLE OF THE HOUSE.

[*Vide* ANSWER TO LEGISLATIVE ASSEMBLY QUESTION NO. 436 [STARRED) BY SRI R. B. RAMAKRISHNA RAJU, M.L.A —page 150 SUPRA.

According to certain orders issued by the composite Madras State, the treatment of wells in estates taken cver under the Abolition Act, is as follows :—

(1) poramboke wells having a regular ayacut of not less than 3 acres are classified as irrigation sources and their ayacuts registered as wet, with appropriate wet assessment, the usual baling remission being allowed ;

(2) in the case of other wells in porambokes including those having an ayacut of less than 3 acres—

(*a*) the lands around them are treated as dry and appropriate water cess is charged for their irrigation from the wells ; and

(*b*) if, in individual cases, the ryots are able to show that the wells are private wells, constructed prior to 20th August 1884, no water-cess is charged for the irrigation of dry lands from them ; and

(3) the sites or ruined wells on porambokes are transferred to assessed dry and assigned by the Revenue Department.

These orders apply to the poramboke wells in the estate areas in the Chittoor district also.

A number of representations have been received by the Government against the orders referred to above and the matter is being examined by the Government. Pending final

decision on the question of treating these wells as Government irrigation sources or as private wells, the collection of water rate on lands irrigated by poramboke wells in all the estate villages in Puttur and Tiruttani taluks of Chittoor district taken over by the Government under the Abolition Act, has been postponed.

M. T. RAJU,
*Secretary to Government.*

---